# గుణ - దేవకి

(సాంఘిక నవల)

రచన:

సి. యస్. శ్రీనివాసన్

అనువాదం:

బెజ్జం సాంబయ్య

పెదకాకాని

ఈ పుస్తక ప్రచురణ ఖర్చులకు
ధన సహాయంచేసి, సాహిత్యా
పోషణకు కృషిచేసిన
శ్రీ కృష్ణంనేని బ్రహ్మయ్యగారికి
నా కృతజ్ఞతాభివందనాలు.

# మనవి

మహాశయులారా!

ప్రతి మానవుడికీ యేదో ఒక సుగుణం వుందనుట కద్దు. అన్ని సుగుణాలూ కలిగినవాడు భగవంతుడే! భగవంతుడు నా కొసగిన వరంతో యీ నవల మీ ముందు వుంచగలిగాను. నేను దాదాపు 10 సాంఘిక నవలలు తమిళభాషలో రచించాను. అందులో "సొంతకారి", "యార్ కుట్రవాళి!" అను రెండు నవలలు "యమ్. వి. రామన్ ప్రొడక్షన్స్" (మద్రాసు) వారికి అర్పించియుంటిని. అవి త్వరలో చలన చిత్రాలుగా మీకు దర్శన మియ్యగలవని ఆశిస్తున్నాను. ఈ నవల చదివినకొద్దీ మీకు ఆనం దాశ్చర్యాలు కలుగుతాయి. ఆధునిక యుగంలో సంభవించే సంఘటనలను సమకూర్చి నవలగా రచించాను. నేను తమిళ భాషలో రచించిన యీ నవలను, యెంతో కష్టపడి తెలుగులోనికి అనువదించి నాకు అన్నివిధాలా సహాయపడిన శ్రీ బొజ్జం సాంబయ్య (పెదకాకాని) గారికి నా అభివందనాలు. ఈ నవల ప్రముఖ సినిమా కథలతో సాటిగా నిలబడగలదని విశ్వా సిస్తున్నాను. ఈ నవలను పాఠకులు చదివి ఆనందపడగలరని, యిందు కనిపించే అల్పదోషాలను మన్నించగలరని మనవి చేసుకుంటున్నాను.

నమస్తే.

శ్రీనివాసన్.

## ఈ నవలను గురించి!

రాజు ఓ పెద్ద జమీందార్. అతనికి గుణ, దేవకి అను యిద్దరు ముద్దుల కుమార్తెలున్నారు. తల్లి వారి చిన్నతనం లోనే కాలధర్మ మొందుటవలన, తండ్రి వారిని అల్లారు ముద్దుగా పెంచి పెద్దచేసి, విద్యాబుద్ధులు నేర్పించాడు.

సుందర్ కూడా ఓ పెద్ద జమీందార్. మహాక్రూరుడు. వ్యభిచార ధురంధరుడు. కంటికి నచ్చిన కన్నెలను చెరపట్టి చేపట్టాలని యత్నించు మూఢ విశ్వాసి. పయోముఖ విష కుంభం లాంటివాడు.

రాజు, గుణను సుందర్ కిచ్చి పెండ్లిచేయ నిర్ణయిస్తాడు. కాని గుణ ఆ నిర్ణయాన్ని తిరస్కరించుతుంది. అందులకు తండ్రి ఏం చేస్తాడు? క్రూరుడైన సుందర్ గుణ తిరస్కారానికి ఉగ్రుడై వివిధ పన్నాగాలు పన్ని గుణను చెరపట్టాలని ప్రయత్నించి, ఒకనాటిరాత్రి కారులో వెళ్తున్న గుణను రౌడీల సహాయంతో బంధిస్తాడు. అప్పుడు గుణ గతి ఏమాతుంది? బంధించిన సుందర్ ఆమెను ఏం చేస్తాడు?

ఒక ముసలి తాత తన ఆస్తిని చూపించి అందాల పేద యువతీమణి మెళ్లో తాళిగట్టాలని ప్రయత్నిస్తాడు. ఫలితం చిక్కుతుందా ?

సుందర్ అహంకారాన్ని అణగద్రొక్కి, అతనికి బుద్ధి గరపాలని ప్రయత్నించే మూరు వేషగాళ్లు, అతనికి ఓ పేదింటి యువతిని పెండ్లిచేయాలని ప్రయత్నిస్తారు. సఫలమౌతుందా ?

గుణ, దేవకిలు పేదింటి వారిని పరిణయమాడ నిర్ణయించుకుంటారు. నిర్ణయం ఎంతవరకు నిజం అవుతుంది ?

పనికోసం పల్లెటూరునుంచి పట్నం వచ్చిన యిద్దరు యువకుల్ని అన్యాయంగా పోలీసులు బంధిస్తారు. వారికి న్యాయం జరుగుతుందా ?

ఈ నవల చదివి తెలుసుకొని తృప్తిపడి ఆనందించండి.



# గుణ, దేవకి

## 1

అది రాజు జమీందార్ భవనం. సాయంత్రం నాలుగు గంటల సమయం. తలుపు తట్టిన శబ్దం విని నౌకరు సుబ్బయ్య తెరుస్తాడు. ఆ వచ్చిన వ్యక్తిని లోనికి ఆహ్వానించి, తొందరగా వెళ్ళి ఆ వచ్చిన వ్యక్తిని గురించి రాజు జమీందారుకు తెలియ జేస్తాడు. రాజు పరమానందపరవశుడై లోనికి వస్తున్న సుందర్‌ను చూచి "రండి...రండి" అని ప్రక్కనే వున్న సోఫాను చూపించాడు. "అందరూ కులాసా?" అంటూ సోఫాలో కూర్చున్నాడు సుందర్.

"ఆ...మీదయవల్ల" అంటూ జమీందారు రాజు చిరు నవ్వులు చిందించాడు. నౌకరు సుబ్బయ్య కాఫీ ఫలహారములు తెచ్చి వారి ముందరవున్న టేబిల్‌పై పెట్టి వెళ్ళిపోయాడు. అనంతరం ఉభయులు కాఫీ ఫలహారములు సేవించారు.

సుందర్ కుశలోపరిగా "తమ సుపుత్రీ రత్నాలు స్వదేశం ఎప్పుడు వస్తారో ఏమైనా తెలిసిందా?" ప్రశ్నించాడు.

"ఈ నెలలో వస్తామని రెండురోజుల క్రిందటనే జాబు వ్రాశారు" అన్నాడు జమీందార్ రాజు.

ఇంకా ఉభయులూ ఏవేవో ముచ్చటించుకున్నారు.

"మంచిది వస్తా" అంటూ లేచాడు సుందర్. వెళ్తున్న సుందర్‌ను గుమ్మం వరకు సాగనంపి, యథాస్థానం చేరుకున్నాడు జమీందార్ రాజు.

# 2

అది ఒక అందమైన మేడ. వివిధ డిజైనులతో అలంకరించబడి చూచువారి హృదయములను రంజింప చేయుచుండును. ఆ మేడ ముందర "సుందర్ వీవింగుమిల్లు" అని ఆంగ్లభాషలో పెద్ద పెద్ద అక్షరములతో లిఖించిన బోర్డు కట్టబడివుంది. మేడముందు ఒక రహదారి. మేడ ముందున్న ఆవరణలో ప్రజలు గుంపులుగుంపులుగా కూడి "సుందర్ నిరంకుశత్వం నశించాలి. రెండు సంవత్సరాలుగా ఎగవేసిన బోనసు యివ్వాలి. దోపిడి మూకల దౌర్జన్యం నశించాలి" అంటూ కేకలు వేస్తున్నారు. ఆ కేకలు విన్నవారికి ఆ ప్రజలు మిల్లు కార్మికులని స్పష్టంగా తెలిసిపోతుంది ఆ కార్మికులలో నుండి వెలువడు ప్రతి ఒక్క శబ్దం, పరికించు ప్రజావళికి జాలి ఆదరాభిమానములు కలిగించుననుట నిస్సందేహం. ఆ కార్మికుల హృదయావేదన, వారి ఆర్తనాదములు కఠిన మనస్కులనైన మంచి మార్గమునకు మరలించును. కాని సుందర్ హృద

యమును మార్చుట కవి మార్గములా ? ప్రజాందోళన ప్రళయమై తాండవ మాడుచున్నది.

అదే సమయంలో అందమైన చిన్న కారు హారన్ వేసుకుంటూ వచ్చి ఆ జనం మధ్య ఆగిపోయింది. ఆకాశమునుండి రాలిపడిన తారలా ! అన్నట్లు రెండు మెరుపు కాంతులు. కాదు...కాదు...యిరువురు అందమైన అమ్మాయిలు ఆ కారులో నుండి వాలుజడలు వంపులు తిరుగుచు చనుగవ్వల మధ్యపడునట్లు ఆశ్చర్యముగా ఒక్కసారి కమల నేత్రములతో కార్మికులను కలియ చూచిరి. వికసించిన వారి మోములను విచారము ఆవరించినది. కమలముల వలె విప్పారిన వారి కనులు కలిగిన జాలివలన కన్నీరుతో ముకుళించినవి. వారిలోని ఆనందం మాయమైనది. కార్మికుల ఆర్తనాదములు వారి హృదయములను ఆహ్వానించినవి.

అప్రయత్నంగా గుణ దృష్టి ఒక వ్యక్తిని ఆకర్షించింది. ఆ వ్యక్తి ఓ పేద కార్మికురాలు. ఆమెను పిలిచింది. ఆ కార్మికురాలు వచ్చి "ఏం తల్లీ" అంది.

"ఏమిటి యీ గందరగోళం ?" ప్రశ్నించింది గుణ. ఆమె యేమో చెప్పబోయింది. కాని ప్రక్కనున్న తోట కార్మికుడు రగులుతున్న హృదయాగ్నికి భరించలేక, "ఏముంది తల్లీ ! మా బ్రతుకు యిలావుంది. 'అన్నమో రామచంద్రా' యని అలమటించు పేదకార్మికుల పొట్టలుకొట్టి బొజ్జలు పెంచి కోటీశ్వరులై కులికే ధనవంతుల లక్ష్యాలు వేరుగా వున్నాయి" అని అతడు నిట్టూర్చాడు.

"అది గాడంక్ష్! అసలు విషయం యేమిటో కొంచెం వివరంగా చెప్పండి." దీనంగా అడిగింది గుణ.

"ఏమని చెప్పమంటారు తల్లీ ! మేము సుందర్ వీవింగు మిల్లులో పనిచేసే కార్మికులం. సుందర్ నాన్నగారైన ఆనంద్ ప్రతి యేడాది దీపావళికి కార్మికులకు బోనసులు యిచ్చేవారు. ఆ ధర్మాత్ముడు రెండు సంవత్సరాల క్రితం కీర్తిశేషులైనారు. ఈ సుందర్ రెండు సంవత్సరాలనుంచి మాకు బోనసు ఎగ వేశారు. "ఇయ్యండి" అని అడిగితే "రేపు" అని గోడమీద వ్రాసుకోమన్నట్లు చెప్తాడు. మరికొంత గట్టిగా అడిగితే, తను పట్టిన కుందేలుకు మూడేకాళ్ళన్నట్లు యివ్వనని మొండిగా మొరుగుతాడు; పైగా మూలిగే నక్కమీద తాటిపండు పడ్డట్లు మా కూలిలో రోజుకు రెండణాలు తగ్గించి మా కడుపులు కొట్టుతున్నాడు. మా పెళ్ళాం బిడ్డల నోళ్ళు కొడ్తున్నాడు" అన్నాడు బాధగా ఆ కార్మికుడు.

ఆ మాటలు విన్న గుణ, దేవకిలకు మనసులలో జాలి, హృదయాలలో బాధ కలిగింది.

గుణ హృదయం మరింత కృంగిపోయింది. ధనవంతులపై యీర్ష్య, దరిద్రులపై జాలి ఆమెలో వుత్పన్నమయ్యాయి.

కార్మికులంతా సుందర్ కారుచుట్టూ మూగారు. ఏమేమో విన్నవించుకున్నారు. కాని ఫలితం లేకపోయింది. కార్మికులను చీల్చుకుంటూ సుందర్ కారు సాగిపోయింది.

గొప్పవాళ్ళకి మేడమిద్దెలలో హాయిగా వసించడం తెలుసు; కార్లల్లో జోరుగా షికారుగా పచార్లు చేయడం తెలుసు; మేలిమి వస్త్రాలు మేనులకు ధరించి అలంకరించు

కోవడం తెలుసు; లక్షలకు లక్షలు డబ్బు గడించే మార్గాలు తెలుసు. కాని ఆ సుఖ సౌఖ్యాలన్నీ చెమటోడ్చి శ్రమించి యేర్పరచిందెవరో! పాపం! వాడిపోయిన వారి కళ్ళకు, పుచ్చుబట్టిన వారి హృదయాలకు గోచరంగాదు కాబోలు.

గుణ ఆ సంఘటనలోని పరమార్థాన్ని పరిపూర్ణంగా అవగాహన చేసుకుంది. కార్మికుల పట్ల ప్రేమానురాగాలు వ్యక్తపరుస్తూ 'కారును పోనియ్' అన్నట్లు డ్రైవరుకేసి చూచింది. కారు ముందుకు సాగింది.

# 3

అది సంతోషదినం. అందరి హృదయాలు ఆనందంతో అలరుచున్నవి. గుణ, దేవకి బొంబాయిలో చదువును సంపూర్తి చేసి స్వదేశము తిరిగి నిన్ననే వచ్చారు. గుణ, దేవకిల పుట్టిన రోజు యీరోజే కావటం వలన, మిత్రులందరిని ఆహ్వానించి విందు ఏర్పాటు చేశాడు తండ్రి. గొప్పగొప్ప వ్యాపారస్తులు, మార్వాడీలు, ప్లీడర్లు, డాక్టర్లు, విద్యావేత్తలు మొదలుకొని సర్వసామాన్య మిత్రపరివారముతో జమీందార్ రాజుభవనం క్రిక్కిరిసిపోయింది.

అత్తరు, సెంటు, పన్నీరు సువాసనలు ఆ భవనమంతా ఘుమాయించి వీస్తున్నవి.

హంసతూలికా పాన్పులు ఆ భవనమునం దమర్చబడినవి. నవరత్న ఖచితమైన దీపికా స్తంభములు ప్రకాశించుచున్నవి. భవనమంతా బంగారుమయమై వెలయుచున్నది. గుణ, దేవకి విలువైన వస్త్రములు ధరించి శరీరమును బంగారు నగలతో నింపి, కమలనేత్రములకు కాటుక దిద్ది, నొసటని బొట్టు నలంకరించి అందాల చందమామకే వంకలు దిద్దు సౌందర్య రూపముతో ప్రకాశించుచున్నారు.

భరతనాట్యములతోను, సంగీత సభలతోను నాటి రాత్రి గతించినది.

# 4

జమీందార్ రాజు కాఫీ పలహారములు సేవించి, వాలు కుర్చీలో పడుకొని దినపత్రిక చదువుతున్నాడు. అతని ముఖంలో ఆనందసంతోషములు తొణికిసలాడుతున్నాయి. పేపరు మూసి, యోచనాతత్పరుడై ఏదో ఆలోచించుకుని తనలో తాను మురిసి ముగ్ధుడైపోతున్నాడు.

గుణ, దేవకిలు చక్కగా టాయిలెట్ అయి షికారు కెళ్ళాలని బయలుదేరారు. నూర్జహాన్ సెంటు సువాసన గుప్ మన్నది. అక్కా చెల్లెలు యిరువురు కళకళలాడుతూ కిలా కిలా నవ్వుకుంటూ, హేండు బ్యాగ్‌లను పట్టుకొని హంస నడకలతో తండ్రి ముందుగా పోతున్నారు.

"గుణా ఎక్కడికమ్మా ప్రయాణం?" అని ప్రశ్నించాడు రాజు, పెదిమలపై చిరునవ్వులు చిందిస్తూ.

"చల్లగాలికి అలా పార్కుకు వెడదామని బయలుదేరాం నాన్నా!" అని బదులిచ్చింది గుణ, చిలుక పలుకలతో.

"అమ్మాయిలూ! యిటు కూర్చోండి. మీతో ఒక్క శుభవార్త చెప్పాలి" అమితానందంతో అన్నాడు రాజు.

గుణ, దేవకిలు సోఫాలో కూర్చొని, ఏమి చెప్తాడా! అని ఆశ్చర్యచకితులై విప్పారని కనులతో తదేకదృష్టితో ఎదురు చూస్తున్నారు.

మీ చదువులు పూర్తిఅయ్యేవరకు మీ పెండ్లి విషయా లేమీ తలపెట్టకూడదని అనుకున్నాను. ఇపుడు మీ చదువులు పూర్తి అయ్యాయి. నా ఆశ ఫలించే సమయం దగ్గర పడింది. మన గృహాని కొక శుభదినం త్వరలో రానున్నది.

తండ్రి మాటలకు గుణ, దేవకిలు సిగ్గుతో తలలు క్రిందికి దించారు.

"గుణా! నీ కొక మంచి సంబంధం చూచానమ్మా!" అన్నాడు రాజు, పట్టలేని సంతోషంతో.

"నాన్నగారు! ఎవరితో ఆ సంబంధం..." నిర్మలంగా అన్నది గుణ.

'నా విషయం కాదులే' అన్నట్లు పరధ్యాన్నముతో కూర్చున్నది, దేవకి.

"మన అంతస్థుకు తగిన అంతస్థుగలవాడు; విద్య, బుద్ధి, జ్ఞానము కలిగినవాడు. మన కేమీ తీసిపోయినవాడు కాదు..."

"అసలు ఎవరితో నాన్నా సంబంధం" అన్నది కొంచెం విసుగ్గా.

"ఆ...ఆ...అదేనమ్మా! మన వూరు జమీందారు గారి సుపుత్రరత్నం 'సుందర్'. అతనికీ, నీకూ వివాహం చేయడానికి నిశ్చయించాను. తాంబూలంకూడా పుచ్చుకున్నానమ్మా..." అని యింకా చెప్పబోయాడు.

"నాన్నా !..." అన్నది వెగటుగా గుణ.

"ఏ మమ్మా !"

"ఎవ రా సుందర్ ?"

"చెప్పానుగా, బృందావన జమీందార్‌గారి అబ్బాయని. చాల అందగాడు. నీకు తగిన యీడు జోడు. చాల మంచిదమ్మా యీ సంబంధం! నీవు చాల అదృష్టవంతురాలవు" అన్నాడు రాజు.

ఆ మాటలు ఆమె హృదయమునకు బాణపుపోటులైనవి. ఆమె హృదయమున కోపాగ్ని రగులుచున్నది. ఆమె గుండె కత్తులతో చీల్చినట్లైనది. పొరలివచ్చే కోపాన్ని లోలోన అణచుకొన్నది.

"అదేమిటమ్మా! ఏదో ఆలోచిస్తున్నావ్ ?"

"ఆఁ...ఏమీ లేదూ, వాళ్ళపేరిట ఒక వీవింగు మిల్లు కూడా వుందనుకుంటాను..."

"ఒక్క వీవింగు మిల్లేమిటి తల్లీ ! నాలుగు డ్రాల్డా కంపెనీలు, రెండు షుగర్ ఫ్యాక్టరీలు...ఒక టేమిటి ? చాలా వ్యాపారా లున్నాయి..."

"నాన్నా..." అని విసుగ్గా ముఖంపెట్టింది గుణ.

"ఏమమ్మా! అలా ఉన్నావ్? సంతోషవార్తకు వికసించాల్సిన నీ ముఖం వాడినపూవ్వులె మాడిపోయిందేవమ్మా ?" అడిగాడు ఆశ్చర్యంగా రాజు.

"అవును. సుందర్‌ను నేను వివాహాము చేసికోడానికి అంగీకరించలేను" నెమ్మదిగా గొణిగింది గుణ.

"గుణా...అట్లనకమ్మా ! ఈ సంబంధం చాలమంచిది. గౌరవమర్యాదలు కల్గిన కుటుంబం. కావాలని వెదకినా యిటువంటి కుటుంబం మరొకటి దొరకదు. నీవు అంగీకరిస్తావని, నామాట నిలబెట్టుతావని కలలుగన్నాను. నేను మాటిచ్చాను. మాటిచ్చి మార్చుకోవటం మన వంశానికే అప్రతిష్ట; మన కుటుంబానికే గొడ్డలిపెట్టు."

"ఏమో నాన్నా !...వంశ ప్రతిష్టలకోసం, కుటుంబ గౌరవ మర్యాదలకోసం నా జీవిత సమస్య తేలికగా ఆలోచించుట భావ్యంకాదు నాన్నా !"

"గుణా ! చాల దీర్ఘంగా ఆలోచించే యీ సంబంధం కుదిర్చాను. ఇటువంటి సంబంధం ఎంత ప్రయత్నించినా లభించుట కష్టం. మన హోదాకు తగ్గ హోదా; గౌరవానికి తగ్గ గౌరవం! డబ్బుకు డబ్బు. ఒక్క మాటలో చెప్పాలంటే, ఇద్దరమూ జమీందారుహోదా గలవారమే. ఇటువంటి బంధుత్వం లభించటం నీ పూర్వపుణ్యాఫలమని చెప్పాలి..." ఇంకా యేదో చెప్పబోతాడు.

"ఆపండి నాన్నా !" అంటూ తలపట్టుకొని ఆలోచిస్తూ కూర్చుండిపోయింది గుణ.

ఆమె మనస్సు అగ్ని జ్వాలలతో రగులుచున్నది. సుందర్ పేరు వింటేనే, ఆమె హృదయం సూదిమొనలతో గ్రుచ్చిన ట్లైనది.

ఆమె విచారాన్ని గమనించాడు రాజు.

"ఏమమ్మా ఆలోచిస్తున్నావు" అన్నాడు ఆప్యాయంగా.

"ఏమీలేదు నాన్నా, యీ వివాహాన్ని నేను అంగీక రించలేను" అన్నది విచారంగా.

"అయితే నామాటలందు నీకు విలువలేదా! గుణా ?" అన్నాడు రాజు కొంచెం కోపంగా.

"ఎందుకు లేదు నాన్నా ? నన్ను అల్లారు ముద్దుగా పెంచారు. విజ్ఞానవంతురాలుగా చేశారు. పెద్దదాన్ని చేశారు. మిమ్ములను గౌరవిస్తాను. పూజిస్తాను. కానీ..."

"నా మాట చెవిని పెట్టనంటావు. అంతేగా..."

"కాదు. నా వివాహవిషయంలో నాకు పూర్తిగా స్వేచ్ఛ కావాలని మిమ్మ్ము కోరుకొంటున్నా నాన్నగారూ" అంది జాలిగా.

"స్వేచ్ఛా! స్వేచ్ఛ! నీ స్వేచ్ఛకు యిపు డేంలోటు కలిగిందమ్మా" అన్నాడు విసుగ్గా.

"నా కిష్టంలేని పెండ్లికి బలవతం చేయడం స్వేచ్ఛా లోపం కాదా ? నాన్నా."

"గుణా! నీవు వందచెప్పు...యీ పెండ్లి తప్పక జరగాల్సిందే. నే మాటిచ్చాను. మాట మార్చుకోవటం నా జాతకంలోనే వ్యర్థ్యం" ఘాటుగా చెప్పాడు రాజు.

ఆమెలో తుఫాను చెలరేగింది. ఆపాదమస్తకం ముచ్చెమటలతో నిండిపోయింది. ఆరని అగ్ని ఆమె హృదయాన్ని దహించివేస్తోంది. తన జీవిత సమస్యలో ఆమెకు స్వాతంత్ర్యం లేదు. స్త్రీ జన్మయే యింత. ఎందు చూచినా స్త్రీని దాసురాలుగా భావింతురేగాని, స్వేచ్ఛగా జీవించుటకు స్థానమీయరు. ఇదియూ న్యాయము, ఇదియూ ధర్మము.

ఆమె నెత్తిపై ఎవరో సమ్మెటతో బాదినట్లుంది. ఆమె శరీరమును కత్తులతో చీల్చినట్లయింది. కొంతకాలం మౌనం వహించింది.

దేవకి ఏమీ తెలియని అయోమయంలో అలమటించుచు అంతే దిగజారిపోయింది.

"గుణా ! ఆలోచించావా !"

"ఆలోచించాను నాన్నగారూ !"

"ఏమని" అన్నాడు అదోరకంగా.

"పెళ్ళి చేసుకోలేనని. పెళ్ళంటూ చేసుకుంటే నిరుపేదను పెండ్లి చేసుకుంటాను. కాని...నా కంఠంలో ప్రాణం వున్నంతవరకు ధనవంతుని వివాహమాడలేను."

"గుణా !" అన్నాడు మహాకోపంగా.

"పేదవాడు...ఆ మాటే ఎత్తకు నా దగ్గర. తిండికిలేక ఏడుస్తుండే పేదవాడిని చేసుకుంటావా? సిగ్గులేదూ నీముఖానికి."

"నాన్నా...ఎందుకు సిగ్గు. నీతి, జ్ఞానం లేక కోటీశ్వరులమను అహంభావముచే పరమనీచులుగా ప్రవర్తించే ధనవంతులకన్న, పరమ పవిత్ర మనస్కులై, నీతి, న్యాయములను పాటించి కష్టించి బ్రతుకు నిరుపేదలు మిన్నకదా !"

"గుణా! ఆపు నీ అతివాగుడు. తండ్రిమాటను ధిక్కరించినదానవు నీ వొక బిడ్డవేనా?"

"బిడ్డనుకాదు నాన్నా; మట్టిగడ్డను. ఏ తండ్రి తన చేతులార తన కుమార్తెకు యిష్టంలేని వివాహాన్ని చేసి యీ లోకంలో సుఖించాడు? అంతమాత్రం ఒక్కసారి నా పీక నొక్కు; పీడా వదిలిపోతాను."

"గుణా! బాగా ఆలోచించే పలుకుతున్నావా?"

"అవును. అన్నీ ఆలోచించుకొనే మాట్లాడుతున్నాను."

ఆ పలుకులు ములుకులై రాజు హృదయాన్ని బాధించాయి. అతని శరీరమంతా విషముచే నిండియున్నది. తోక త్రొక్కిన త్రాచువలె కోరలు చాచాడు. అతనిలో క్రోధము, ఆక్రోశము, ద్వేషము తాండవ మాడుచున్నవి.

"గొప్పింటి బిడ్డ ఒక్క పేదవాడి చరణదాసిగా మారుటయా? సంహించబోను" అంటూ, తనలో తాను పూరటపడ్డాడు.

కలిగిన సమస్యతో కుమిలిపోతోంది గుణ.

"గుణా! నా మాట వినక నీ యిష్టానుసారముగా కూటికి లేని నిరుపేదవాణ్ణే పెళ్ళి చేసుకుంటే, నా ఆస్తిలో చిల్లిగవ్వ కూడా నీకు ముట్టకుండా చేస్తాను...జాగ్రత్త" అని బెట్టుగా పలికాడు రాజు.

"నాన్నా, ఆస్తికి ఆశించి నాజీవితాన్ని నాశనం చేసుకోలేను" అని దీనంగా పలికింది గుణ.

రాజు ఆ మాటలు చెవిని పట్టించుకోలేదు.

"అమ్మా దేవకీ..."అన్నాడు రాజు.

ఆ మాట విన్న దేవకి హృదయంలో రైళ్ళు పరు గెత్తాయి.

"నువ్వయినా నా మాట నిలబెట్టి, నా గౌరవ మర్యాద లకు లోపం రానియ్యాకమ్మా" అన్నాడు వినయంగా రాజు.

"ఆఁ...నేనా ?" అంటూ గుడ్లు తేలేసింది దేవకి.

"అవును... నువ్వే. నా మాట విన్నావంటే నా ఆస్థి అంతా నీకే దక్కుతుంది. నాకు పుట్టిన కవలపిల్లలలో పెద్దది తల్లితోపాటు పురుడులోనే చచ్చిందనుకుంటాను." కళ్ళ వెంట చింత నిప్పులు రాల్చుతూ అన్నాడు రాజు.

"నాన్నా" అని బిక్కమొగం వేసింది దేవకి.

గుణ హృదయం బద్దలైనట్లయింది తండ్రి మాటలకు.

'నీకేం పుట్టింది' అన్నట్లుగా దేవకికేసి చూశాడు రాజు.

"అక్కకు యిష్టంకాని సంబంధం..."

"నా కోర్కె యిష్టం అవుతుంది అంటావు, అంతేగా !" అన్నాడు దేవకి మాట నందుకొని, మండిపడుతూ రాజు.

'అవును' అన్నట్లు చూసింది దేవకి జాలిగా.

"అయితే నీవూ ఒక ముష్టివాణ్ణి కట్టుకుని పూరేగుతా వన్నమాట" క్రూరంగా పలికాడు.

"కాదు" అన్నట్లు తలాడించింది.

"మరి" ప్రశ్నించాడు రాజు.

"మరొక సంబంధం నీ యిష్టమొచ్చినవానిని పెండ్లి చేసుకుంటాను" అంది దేవకి ఆప్యాయంగా.

"అయితే, సుందర్‌ను పెండ్లాడవన్నమాట."

"ఉహుఁ...నాకు యిష్టంలేదు" అన్నట్లు తలపంకించింది.

"హుఁ..." అని నిట్టూర్పు వదలి, "నా గౌరవ మర్యాదలు మంటగలిపారు. మీరు యిట్లా చేస్తాని కలలోనైనా కని యెరుగను" అని తల పట్టుకొని దిగాలుపోయాడు.

మళ్ళీ గుణను అడిగిచూడాలని సగంచచ్చిన ప్రాణంతో యిలా అన్నాడు:

"అమ్మా గుణా!" అన్నాడు ఎంతో సవినయంగా.

కుమిలిపోతున్న గుణ, "ఏమిటి నాన్నా" అన్నది ఓపికతో.

"సుందర్‌ను కాకపోతే పోనీ, మరొక మంచి సంబంధం చూస్తాను. ఇష్టపడతావా?"

"అంటే..."

"మరొక లక్షాధికారిని..."

"లక్షాధికారి కాదు, కోటీశ్వరుడైనా నేనాసంబంధానికి యిష్టపడను. నేనొక భిక్షాధికారినే పెండ్లిచేసికుంటాను. ఇది నా నిశ్చయం" ఖచ్చితంగా నొక్కి చెప్పింది గుణ.

"నిశ్చయమా? కానీయ్. తిన తిండీ, వంటినిండా గుడ్డా, వుండ నిల్లూ లేక పడరాని బాధలు పడుతున్నా, నా ఆస్తిలో చిల్లిగవ్వకూడా నీకు ముట్టకుండా చేస్తాను. పాలుపోసి పెంచిన వానిని కాటువేయ ప్రయత్నించు త్రాచు పామువు నీవు" అన్నాడు మంటలు గ్రక్కుతూ.

## 5

కొండంత దిగులుతో కుమిలి, కృశించిపోతున్న హృదయంతో కుర్చీలో కూలబడి ఏవో ఆలోచిస్తున్నాడు రాజు.

"నమస్కారమండీ" అంటూ ప్రవేశించాడు శాస్త్రి.

"ఓహో...రండి,...రండి కూర్చోండి" అన్నాడు రాజు హీనస్వరంతో.

"శుభప్రాప్తిరస్తు" అంటూ కూర్చొన్నాడు శాస్త్రి.

ఆ మాటలు రాజు హృదయాన్ని మరింత బాధించాయి. చచ్చే పాముని మరీ...చావమోదినట్లయింది అతని బ్రతుకు.

మంచీ మర్యాద తెలిసిన నౌకరు సుబ్బయ్య కాఫీ, ఫలహారములు తెచ్చి, వారి ముందు టేబులుపై పెట్టి వెళ్లిపోయాడు.

"శుభస్య శీఘ్రం"...అంటూ కాఫీగ్లాసు పట్టుకున్నాడు శాస్త్రి.

"అతి కష్టం శాస్త్రిలూ..." అన్నాడు ఆరిపోయిన దీపంలా ముఖాన్ని పెట్టి రాజు.

ఆ మాటలకు కాఫీగ్లాసు ఖాళీ చేశాడు శాస్త్రి. అర్థంకాని ఆ మాటలకు దిగాలుపోయాడు పాపం శాస్త్రి.

"ఏమండీ! అలా అంటారు. కొద్దిరోజుల్లో మీ గృహాన్ని శుభదినం అలంకరించనుంటేనూ..." అని చప్పరించాడు శాస్త్రి.

రాజు ఏమీ చెప్పలేక వంచిన తల మరింత వంచుకున్నాడు.

"సుందర్‌గారు ముహూర్తం నిర్ణయించుకు రమ్మన్నారండీ" మరింత ఓపికతో.

"ఏం...ముహూర్తమయ్యా!" అన్నాడు పొరలివచ్చే విచారాన్ని ఆపుకొంటూ.

"అదేనండీ, సుందర్ పెండ్లి ముహూర్తం!" అన్నాడు ఆతృత మనస్సుతో.

"మా అమ్మాయిలు యిద్దరూ సుందర్‌ను పెండ్లి చేసికోడానికి అంగీకరించలేదు శాస్త్రిగారూ!" సమాధానమిచ్చాడు విచారంగా.

"ఇద్దరెందుకండీ? ఒకర్తె చాలు."

"ఏ ఒక్కర్తీ అంగీకరించలేదు. నే నేం చేస్తాను?"

"ప్రయత్నించండి. ఫలితం దక్కుతుంది!"

"ప్రయత్నించే చూశాను. కాని ఫలితం లేకపోయింది" అని కన్నీరు కార్చాడు రాజు.

"ఆ సుందర్‌గారి సంబంధం మీరు వదిలేస్తే, అటువంటి సంబంధం తిరిగి రమ్మన్నా వస్తుందండీ? ఆయనకు అందం తక్కువా? ఆస్తి తక్కువా? ఏం తక్కువని మీరలా అంటున్నారు?" అన్నాడు శాస్త్రి.

"నే నంటం కాదయ్యా! మా అమ్మాయిలు అన్నారు. ఎన్నో విధాల అడిగి చూశాను. నా మాట నిలబెట్టమనికూడా అడిగి ప్రయత్నించాను. కాని, లాభం లేకపోయింది" అని గొణిగాడు.

"నీ కూతుళ్ళు నీ మాట కాదన్నారా ?"

"వాళ్ళు నా కూతుళ్ళు కాదు; నా ప్రాణాలు తీయ జన్మించిన యమదూతలు" అన్నాడు మండిపడుతూ.

"సుందరటుఃవంటి నీతీ, నిజాయితీపరుడు ప్రపంచం అంతా గాలించినా మీాకు లభించడు. మంచిగా అమ్మాయి లకు నచ్చచెప్పి ఒప్పించండి. 'కష్టే ఫలే'" అన్నాడు శాస్త్రి.

"ఇక లాభం లేదు శాస్త్రి."

"సరే, వస్తా...ఎందుకయినా మంచిది, ప్రయత్నం చేసి చూడండి" అన్నాడు లేస్తూ.

"సరే..." అన్నట్లు తలపంకించాడు రాజు.

# 6

అంతులేని విచారగ్రస్తుడై ఏదో ఆలోచిస్తున్న జమీాం దార్ రాజు వీపు తట్టాడు రామయ్య, వెనకగా వచ్చి. ఐట్టింది గమనించలేదు. రామయ్య విస్తుపోయాడు.

"ఏంటి, బావా! సుదీర్ఘంగా ఆలోచిస్తున్నావ్ ?"

రాజు తేరిచూచి, "ఓహోఁ......రామయ్యబావా! కూర్చో, బావా!" అన్నాడు ఆప్యాయంగా రాజు.

"ఏంటి బావా! మైమరచి అంత దీర్ఘంగా ఆలో చిస్తున్నావు" తిరిగి ప్రశ్నించాడు రామయ్య.

"ఏముంది బావా! చెప్పుకుంటే సిగ్గుచేటు" అంటూ చిటకరించాడు.

"అసలు సంగతేంటి?"

"గుణ, దేవకిలు చేసిన మర్యాద."

"ఏం చేశారు?"

"చేయాల్సిందంతా చేశారు. చెప్పాల్సిందంతా చెప్పారు."

"అసలు సంగతి కొంచెం వివరంగా చెప్పు బావా!"

"మన నగర్ జమీందార్ కుమారుడు సుందర్‌కు గుణ నిచ్చి పెండ్లి చేస్తానని మాటిచ్చాను. కాని అందుకు యిద్దరూ అంగీకరించక, నా పరువుమర్యాదలు మంట గలిపారు" అంటూ ఆవేశాన్ని వెలిబుచ్చాడు రాజు.

"ఓహో! అదా సంగతి" అని చిన్నగా నవ్వాడు రామయ్య.

"ఆఁ...అంటే..." అన్నట్లు దిగాలుపోయాడు రాజు.

"అయితే నే చెప్పి చూస్తానుండు" అని గుణ, దేవకిలు వున్న గదిలోకి వెళ్లాడు.

# 7

రామయ్య వెళ్ళి అరగంట దాటింది. ఇంకా రాలేదు. రాజు మెల్లగా లేచాడు. వారున్న గది గుమ్మంవద్ద కాలు పెట్టి అంతే ఆగిపోయాడు. నలిగిన హృదయం మరింత చితికింది.

"మామయ్యా, నీవు వందచెప్పు. సుందర్ ను నేను పెండ్లాడ లేను. అసలు ధనవంతులనే పెండ్లి చేసుకోను. నీ మాట కాదన్నానని కోపించక నన్ను మన్నించు" అంది చిరాకుగా గుణ.

ప్రయత్నం విఫలమైనందున ఏమీ చేయలేక మూతి బిగించుకుని అఘోరకంగా బయటపడ్డాడు రామయ్య. గుమ్మం దగ్గరవున్న రాజును చూచి,

"విన్నావుగా ...?" అని ప్రశ్నించాడు.

"విన్నా ..." అన్నట్లు తల వూపాడు.

"మరి కర్తవ్యం ?"

"ఏదైనా ఒక మంచి సంబంధం చూచి దేవకికి వివాహం చేస్తాను. నా ఆస్తంతా దానిపేర పెట్టివేస్తాను" ఆవేశంతో అనేశాడు రావు.

"గుణ విషయం..."

"నీవు విన్నావుగా ! అది పేదవాడ్ని పెళ్ళిచేసుకుంటుం దట. ఎలాగో ఏడ్వనీ, నా ఆస్తిలో అరసెంటు భూమైనా... దానిపేర పెట్టను. అసలు దానికి పెండ్లే చేయను. ఏకాకిలా పడుండి నాశనమవాల్సిందే..." అన్నాడు బాధగా రాజు.

"అట్లనకు బావా !...కన్నబిడ్డ..."

"అది కన్నబిడ్డ కాదు. నా పాలిట తలకొరివి."

"కంగారుపడకు బావా ! విజయనగరంలో మంచి సంబంధం ఒకటి వుంది. ఆ సమాచారాలన్నీ సంపూర్తిగా తెలిసికొని నీకు తెలియచేస్తాను" అన్నాడు రామయ్య.

"అయితే నేనుకూడా వస్తాను. రేపే మధ్యాహ్నం బయలు దేరి వెళదాం" అని "భోజనానికి లేచిరా!" అన్నాడు చిగు రించిన చిన్న సంతోషంతో రాజు.

ఇద్దరూ లేచి వెళ్లిపోయారు.

# 8

మరునాడుదయం రాజూ, రామయ్యా ప్రయాణానికి సిద్ధమయ్యారు.

"దేవకీ! యిలా రా" అన్నాడు రాజు.

దేవకి వచ్చింది.

"మేము విజయనగరం వెళ్తున్నాం. అక్కడ వో... మంచి సంబంధంవుంది. నీకు ఆ సంబంధాన్ని ఒప్పించుకుని వస్తాను" అన్నాడు రాజు.

గుణ గుమ్మంవద్దకు వచ్చి వాడిన పద్మమువలె మాడి పోయిన ముఖంతో అక్కడే నిలిచిపోయింది.

దేవకి బెదరిన లేడివలె అదోరకంగా చూస్తోంది.

"దేవకీ! నీ వేం భయపడకు. నా ఆస్తిపాస్తులన్నీ నీకే రాసిస్తాను. గుణ – నా మర్యాద తీసివేయపుట్టిన పెనుభూతం. దానికి నా ఆస్తిలో ఆవగింజైనా ముట్టజెప్పను. ఆకలి... ఆకలి...అంటూ అలమటించి చచ్చినా నాకు విచారంలేదు" అని పుక్రోషం వెలిబుచ్చాడు రాజు.

గుణ గుండె నీరయింది. కన్నీరు కార్చింది.

దేవకి హృదయం కరిగింది.

"నాన్నా, అక్కకు అన్యాయం చేయకు" అని కన్నీరు కార్చింది.

దేవకి మాటలు చెవిని బెట్టకుండా చరచర బయలు దేరాడు రామయ్యను వెంటబెట్టుకొని. ఇంతలో సుబ్బయ్య ఎదురయ్యాడు.

"ఒరే! సుబ్బా! విజయనగరం వెళ్ళుతున్నా! పది రోజులవరకు పనివుంటుంది. ఆ పని పూర్తిచేసికొని తిరిగివస్తాను. జాగ్రత్త!" అని బయలుదేరి గుమ్మం దగ్గరున్న కారెక్కి యిద్దరూ వెళ్ళిపోయారు.

దేవకి కన్నీరు తుడుచుకొంటూ గుణవద్దకు వెళ్ళి వెక్కి వెక్కి యేడ్చింది.

"దేవకీ! ఎందుకలా ఏడుస్తావ్? తప్పకదూ. అయినా అంత ప్రమాదం నీకేం లేదుగా...నాన్న ఆస్తంతా నీకే దక్కుతుంది. హాయిగా జీవితం గడపవచ్చు" అంది గుణ.

"హాయి!...నా కెక్కడిది. తిండిలేని పేదవానిని పెండ్లి చేసికొని నీవు బాధలు అనుభవిస్తూంటే, నేను శ్రీమంతురాలి నైతేమాత్రం నేను సుఖపడగలనా?" అంది వెక్కి వెక్కి యేడుస్తూ దేవకి.

"దేవకీ! నీవు పొరబడుతున్నావు! నేను ధనవంతుని పెండ్లాడి మనసు తృప్తిలేక అనేక బాధలకు గురికావల్సిందే కాని...సుఖపడలేను. పేదకుటుంబీకుని పెండ్లి చేసికొంటే

నాకు ఆనందం. నా మనస్సు తృప్తిపొందుతుంది." నిర్మలంగా పలికింది గుణ.

"అక్కా! నీ ఆనందం! నీ సుఖంకోసం మన కుటుంబ సాంప్రదాయాలను మంటగలుపుతావా? నాన్న గౌరవమర్యాదలు నాశనంచేసి, నా మనోవ్యాధికి కారకురాలవౌతావా?" విచారాన్ని వ్యక్తపరుస్తున్న కంఠంతో పలికింది దేవకి.

గుణ పక్కున నవ్వింది.

"దేవకీ..." నీవింత తెలివితక్కువ దానవని నే నెప్పుడు తలంచలేదు. నాన్న పరువుప్రతిష్ఠలకోసం మన జీవితాలు బలిచేయాలా? మన సాంప్రదాయాలకోసం గుణహీనులను పెళ్లాడి, మన సుఖాన్ని నాశనం చేసికొని తుచ్ఛ బ్రతుకులకు లోనగుదుమా? తుదకు నా ప్రతిజ్ఞనే భంగపరచుకొని అవమానమునకు గురికామంటావా?"

"ప్రతిజ్ఞా?"

"అవును"

"ఏమని?"

"నీకు గుర్తులేదా ...? మనం చదువుకొనే రోజుల్లో పేద చుట్టరికం చూచి పెండ్లి చేసుకుంటానని ప్రతిజ్ఞ చేసితిని గదా?"

# 9

గుణ, దేవకిలు పదమూడేండ్లవయస్సు హైస్కూలులో చదువుతూ, ఒకరోజు తమ క్లాస్‌మేట్సుతో కలసి వారి స్నేహితురాలైన సరళయింటికి విందుకు వెళ్లారు.

సరళ, ఒక ధనవంతుని బిడ్డ. తండ్రి మాట జవదాటని పాతకాలపు భావాలు కల్గిన యువతీమణి. అందచందాలు గల్గిన సుందరాంగి. పద్మనయనముల పడుచుపిల్ల. మకరంద మాధురి. సరళ తన తోటి విద్యార్థి రామాన్ని ప్రేమించింది. అతడు సామాన్య కుటుంబీకుడు. సరళకు, రామానికి పెండ్లి చేయడానికి సరళ తండ్రి అంగీకరించాడు. ముహూర్తం నిశ్చయించాడు. సరళ ఆనందానికి అంతు లేదు... ముహూర్తం దగ్గిర పడింది.

తన ఆశలు ఫలించాయి. తను గాలిలో నిర్మించుకొన్న ఆశాభవనాలు నిజమై నిలిచాయి. తన ప్రేమ ఫలించింది. తొలిప్రేమ దృశ్యాలు గుర్తుకు దెచ్చుకుని మురిసిపోతుంది సరళ. తన ప్రణయం పరిణయానికి దారితీసిందని పట్టరాని సంతోషంతో ముచ్చటపడుతుంది. ముహూర్తం ఆదివారం. ఇంకా రెండురోజులే! అనుకుంటూ సరళ క్షణం యుగంలా గడుపుతుంది.

మరునాడు శనివారం ఉదయం 10 గంటలకు హైస్కూలులో గగ్గోలు ప్రారంభమయింది. ఏ యువతి

నోట విన్నా! "సరళ పెళ్ళి ఆగిపోయిందట" అనే మాటలు తప్ప వేరొక మాటలు వచ్చుట లేదు.

సరళ మిత్రులంతా ఆ మాటలు విని ఆశ్చర్యచకితు లయ్యారు. ఆమె పెండ్లి ఆగిపోవడానికి కారణం యెవ్వరికీ తెలియదు. సంతోషాన్ని గోల్పోయిన సరళ మిత్రులు చింతా క్రాంతు లయ్యారు.

సరళను కలసికొని కారణం తెలిసికోవాలని మిత్ర బృందమంతా ఒక్కుమ్మడిగా సరళ యింటివేపు నడకసాగించారు. వారి వాలుజడలు ముందు వెనుకలకు విసురుకుంటూ, గుసగుసలాడుతూ సరళ ఇంటికి చేరుకుంటారు.

వచ్చతోరణాలతో ప్రకాశించవలసిన వారి గృహం పాడుబడిన గృహంలా మారిపోయింది. ఏ గది చూచినా మనుషులెవ్వరు వారి కళ్ళకు కనుపించకపోవడం వారికి వింతగా వుంది.

అన్ని గదులు వెదక్కుంటూ మేడమీద మారుమూల గదికి వస్తారు. ఆ గదిలో ప్రవేశించినతోడనే వారి కళ్ళవెంట కన్నీటి బిందువులు బొటబొటా కారాయి. వారి దృష్టి ఆ గదిలో కూర్చున్న సరళపై పడింది.

సరళ ముఖంలో సంతోష రేఖలు లోపించాయి. ఆమె ముఖంలో విషాదరేఖలు తాండవ మాడుతున్నాయి. కలిగిన ఘోరవిచారంతో మౌనం వహించి మనస్సులో యేమో ఆలోచిస్తూంది.

ఆమె మౌనాన్ని చీల్చుకుంటూ మిత్రులందరూ ఆమె ప్రక్క జేరారు.

వచ్చిన మిత్రులను కూడా గమనించలేకపోయింది సరళ. ఆమె ముఖంలో నాట్యం చేయుచున్న విచారాన్ని వికార స్వభావాన్ని గమనించిన మిత్రులందరు మరింత దుఃఖితు లయ్యారు.

"సరళా! ఏమిటి అలా వున్నావ్" భుజాలు తట్టి పలికింది గుణ.

ఆమె చేతి స్పర్శకు సరళ హృదయం జలదరించింది. తలెత్తి స్నేహితులను పరికించి "రండి...రండి...కూర్చోండి" అన్నది. ఆమె నవ్వుదామన్నా నవ్వు రావడం లేదని ఆ మాటలతోనే స్పష్టంగా తెలిసిపోతుంది.

అందరూ సోఫాలలో చతికిలబడ్డారు.

"సరళా! నీ పెళ్ళి రామంతో కాక వేరేవారితో నిర్ణయించారని విన్నాం! నిజమేనా?" జాలిగా పలికింది జమున.

"నిజమే" అని కళ్ళు మూసుకొని గొల్లుమని ఏడ్చింది.

మిత్రులందరూ ఆమెను ఓదార్చారు.

"సరళా! మీ నాన్న యింటిలో వున్నారా?" అంది మెల్లగా జమున.

"లేరు...చుట్టాలను సాగనంపడానికి స్టేషనుకు వెళ్లారు" విచార కంఠంతో పలికింది సరళ.

"ఎవరా చుట్టాలు?"

"వాళ్ళే! నా పాలిట మృత్యుదేవతలు." తనకు తెలియని వుక్రోషంతో జవాబిచ్చింది సరళ.

"అంటే!"

"మా నాన్నగారి ఆప్తమిత్రుడు భుజంగరావట. పెద్ద ధనవంతుడట. రామం పేదవాడట. అందుచేత నన్ను భుజంగరావు కొడుక్కిచ్చి పెళ్ళి చేస్తాడట. ఆ సంబంధం మాట్లాడ వచ్చిన పెద్ద మనుషులు" కన్ను లెర్రచేసి పలికింది సరళ.

"అదెలా వీలుపడుతుంది. ముందొకరి కిచ్చి పెళ్లి చేయడానికి ఇష్టపడి శుభపత్రికలలో ప్రకటించి పంచిపెట్టి, యిప్పుడు ఆ ముహూర్తాన్ని ఆపుచేసి వేరే సంబంధం నిర్ణయించడం న్యాయంకాని పద్ధతి. మీకు కావలసినంత ఆస్తి వుంది కదా! ఆ ఆస్తితో రామం ఆస్తిపరుడు కాడా! ఆశ చూపించి అన్యాయంచేయడం మహాపాతకం. ఇలా చేయడం భావ్యమైనపని గాదు" దీనంగా నిట్టూర్చింది గిరిజ.

"ఏమే! గిరిజా! ధనంలోనే వుందే ఘనం. ధనంలేని వాడు దమ్మిడీకి కొరగాడు. డబ్బులేనివాడు యిబ్బంది పాలౌతాడు. డబ్బుంటేనే సర్వసౌఖ్యాలు కలుగుతాయి. ఆస్తి లేనివారిని పెండ్లాడితే అష్టకష్టాలు పడాల్సిందే! అదీగాక మన పెద్దవారు చెప్పినట్లు మసలుకోవడం మంచిపద్ధతి." అంటుంది జమున.

"చాలించవే నీ లాలింపులు బో చెప్పావుకాని. పెద్దలు బుద్ధిలేనిమాటలు చెప్పినా వాటిని అనుసరించాలంటావు! అంతేగా! ఇటువంటికష్టమే నీకు సంభవిస్తే నీవు సహించ గలవా? పెద్దవారు...పెద్దవారని వూరిక వాగుతావేకాని వారు చేసే తప్పుడుపనులు విమర్శించవేమి? యువతి కష్ట సుఖాలు గమనించకుండా "గ్రుడ్డెద్దు చేలోబడ్డట్టు" పురుషుడు

ఎట్టివాడైనా అదేమీ యోచించక, ఆ స్తోమం చూచాలు అమాంతంగా ముహూర్తంచూసి ముడిపెట్టారు. స్త్రీ జాతికి యెంత అన్యాయం జరుగుతోంది!" వుద్రేకంతో పలికింది గిరిజ.

సరళను తట్టి "ఆ సంబంధానికి నీవు అంగీకరించావా?" ప్రశ్నించింది గుణ.

"ఏం...చేస్తాను. ఒప్పుకోక తప్పిందికాదు. నా అభిప్రాయలు విప్పిచెప్పాను. నాకు యిష్టం లేదని బ్రతిమాలాను. యేడ్చాను ...... మొత్తుకున్నాను. తుదకు మా నాన్న పాదాలు పట్టుకుని రామానికి నాకు దూరంచేసి నా ఆశలు ఆడియాశలు చేయవద్దని గొల్లుమన్నాను. ససేమిరా! మా నాన్న యిష్టపడలేదు. మా నాన్న పట్టుదల మీకు తెల్సుగా! అసలే జగమొండి. ముందు వెనుకలు యోచించని మొండి పట్టుదలతో భుజంగరావు కొడుకునే తప్పక పెండ్లాడి తీరాలని నొక్కిచెప్పాడు. ఈ విషయం రామం తల్లిదండ్రులకు కూడా తెలియచేశాడు" అంది హీనస్వరంతో.

మిత్రుల ముఖాలు సరళ మాటలకు మాడిపోయాయి. అందరికీ ఆశ్చర్యం కలిగింది. కొంతకాలం నిశ్శబ్దంగా వుండిపోయారు. ఒకవైపు ధనవంతులపై యీర్ష్య! మరొకవైపు పేదవారిపై కనికరం వారిలో జనించాయి.

"ధనవంతులూ...ధనవంతులూ...ధనవంతులకోసమే ప్రపంచం పుట్టింది. వారికోసమే సర్వసౌకర్యాలు ఏర్పడ్డాయి. ధనవంతులు...ధనవంతులకోసమే పరితపిస్తారు...కాని... తమ అల్లుడు పేదవాడైన తమ ఆస్తితో ధనవంతుడౌతాడని తలంచరుగదా...! మన అభిప్రాయాలు...మన భావి జీవిత

సౌఖ్యాలు వాళ్ళకు అక్కర్లేదు. వాళ్ళకు కావాల్సింది ధనం" అని నిటూర్చింది గుణ.

"అవును... రేపూ...మీ నాన్నగారు అదే చూస్తారు. అంతే చేస్తారుకూడాను..." పరిహాసంగా పలికింది జమున.

"అంటే..."

"మీ నాన్న ఓ పెద్ద మాజీమంత్రి; నీకు కూడా పెద్ద జమీందార్ బిడ్డను వెదకి పెండ్లి చేస్తారు. అప్పుడు నీవైనా అంగీకరించి పెండ్లాడతావ్" అన్నది బెట్టుగా జమున.

"అది ఏనాటికీ జరగదు" నొక్కి వక్కాణించింది గుణ.

అందరూ కిలకిల నవ్వారు.

హాలంతా కిలకిల నవ్వులతో ప్రతిధ్వనించింది.

రెండు రోజులనుంచి నవ్వేమిటో ఎరుగని సరళ కూడా మైమరచి ఫక్కున నవ్వింది.

అందరినీ ఒక్కసారి అర్థంకాని చూపులతో పరికించింది గుణ.

"అవును.........నా యిష్టమే......పెండ్లి చేసుకోవాల్సింది నేను. నా పెండ్లిని గూర్చి నాకు పూర్తిగా స్వేచ్ఛ అవసరం. స్త్రీకి తన పెండ్లి నిర్ణయంలో పూర్తి స్వాతంత్రం కావాలి. పెండ్లాడి భర్తతో కాపురం చేయాల్సింది భార్యకాని, తలిదండ్రులు కాదు" ఆవేశంతో పలికింది గుణ.

"అందుకు మీ నాన్నగారు సమ్మతించాలిగా" అన్నది పరిహాసంగా జమున.

"ఎందుకు సమ్మతించడు. మాకు కావాల్సినంత ధనం కలదు. ఇంకా మాకు ధన మెందుకు. నీతీ నిజాయితీ విజ్ఞానం

విద్యాబుద్ధులు గల్గిన పేదయువకుని ప్రేమించి పెండ్లాడుతాను. ధనవంతుని అలుడు ధనవంతుడౌతాడుగా, తన మామగారి ఆస్తితో......!

"పిచ్చిదానా! ఈ కాలంలో ఆస్తికొరకు ఆశించేవారే ప్రతి ఒక్కరూ తనకున్న ఆస్తి పంపిణీ చేయడానికి ఎవ్వరూ అంగీకరించరు పేదవాణ్ణి పెండ్లి చేయడానికి మీ నాన్న సమ్మతించడు."

"సమ్మతించకపోతే సమస్యే లేదు. నిరుపేద యువకుని పరిణయం చేసుకుంటానని పట్టుపడ్తాను. ససేమిరా యిష్టపడ నని మా నాన్న పలికితే నా జీవిత సుఖానికై, నా కున్న స్వతంత్రానికై అతడు తండ్రికాని, దైవముకాని యెదిరిస్తాను. విజయం సాధించితీర్తాను" అని సగర్వంగా సమాధాన మిచ్చింది గుణ.

"నీలాంటి స్త్రీలు చాలామంది యిలాగే చెప్పి, చిట్ట చివరకు తలిదండ్రుల మాటలకు తలొగ్గి చచ్చినట్లు వారి మాటలకు దాసులయ్యారు" మరింత పురికొల్పుతూ పలికింది జమున.

"తలొగ్గకపోతే తలను తెంచుకోకపోయారు! ఎందు కలాంటి స్త్రీలు బ్రతికి? స్త్రీ జాతికే కళంకం. పవిత్రమైన శీలాన్ని, పవిత్రమైన ప్రేమను చెప్పుడుమాటలకు బలిచేయ డమా? నీచహీనులై ప్రవర్తించే ధనవంతుల ఇనుప పాదాల క్రింద నలిగి నశించేకన్నా ప్రాణాలు తీసుకొనుట మేలు. కట్నాలు, కానుకలకై ఆశించి ముద్దుమురిపాలు తీరని పండ్రెండేళ్ళ బాలికను పండు ముసలివాని కిచ్చి పెండ్లిచేస్తాను.

డబ్బు కాశించుతారేగాని, ఆ యువతి భావిజీవితాన్ని గురించి యోచించరుగదా! ధనవంతులను చేసుకొని బాధపడేకంటే దరిద్రులను చేసుకోవడం మేలు. కొంతవరకు పేదతనాన్ని రూపుమాపాలంటే పెద్ద పెద్ద ధనవంతులు పేదవారితో సంబంధాలు కుదుర్చుకోవాలి. అట్టడుగునపడి లేవలేని పేదలకు చేయూత నీయాలి." బల్లగుద్ది మరీ చెప్పింది గుణ.

"నిజం చెప్పావు గుణా. నీవు చెప్పింది అక్షరాలా నిజం. నా అభిప్రాయం కూడా అదే! నేను ఒక ధనవంతుని కుమార్తెను కాని, సరళకు జరిగిన అన్యాయాన్ని ఖండించుతాను. అలా చేయడం భావ్యంకాదు. పేదవారైనా, ఆస్తిపరులైనా శరీరంలో ప్రవహించే రక్తాణువుల్లో మార్పేమీ లేదు. ధనవంతుల శరీరాల్లో ప్రవహించేలాంటి రక్తమే దరిద్రుల శరీరాల్లో కూడా ప్రసరిస్తుంది. అభిప్రాయాల్లో మాత్రం వ్యత్యాసాలు వుండడం వాస్తవం" అంది గిరిజ.

"అందుకై నేటి యువతీయువకులు సంసిద్ధులై పెద్ద మనుషులు చేస్తున్న తప్పులను ఖండించి జయభేరి మ్రోగించాలి. ఇందుకు నేను సిద్ధమౌతాను. నేను పేదవానినే పెండ్లి చేసుకుంటాను. ఇది నా నిశ్చయం...ఇది నా ప్రతిజ్ఞ..." అంటూ గర్జించి పలికింది గుణ.

ఆ పలుకులు అందరి హృదయాలను ఆకర్షించాయి. అందరూ ఆశ్చర్యచకితులైపోయారు. ఆమె భావాలు మంద మెక్కిన వారి హృదయాలను కదిలించాయి. త్రుప్పుపట్టిన వారి బుర్రలు గిర్రునతిరిగాయి.

"మాటలతో కాదు, చేతలతో నీ ప్రతిజ్ఞను నెర వేర్చాలి ... చూస్తాంగా ... యిదిగో గుణా! నా డైరీలో రికార్డు చేసుకున్నాను నీ ప్రతిజ్ఞ...జాగ్రత్తసుమా!"అంటూ హెచ్చరించింది జమున.

"ఆల్ రైట్...నేను కూడా వ్రాసుకుంటాను" అన్నది ముసిముసినవ్వులు చిలికిస్తూ గుణ.

# 10

ప్రక్కనున్న దేవకికి తన డైరీలో రికార్డుచేసిన ప్రతిజ్ఞ చూపిస్తూ, ఆనాటి విషయాన్ని జ్ఞప్తికి తెచ్చింది.

దేవకి ముఖంలో అచ్చెరువు,ఆనందం తొంగిచూచాయి.

"అక్కా! నన్ను తెలివితక్కువదాని వన్నావు. కాని..." అంటూ ఆగిపోయింది.

"పూర్తి చేసేయ్" అంది గుణ కులాసాగా.

"చిన్ననాటి ప్రతిజ్ఞ దృష్టిలో నుంచుకొని మనం బాధలకు గురికావల్సిందేనా?"

"అందులో బాధేమీ లేదు. దేశదారిద్ర్యాన్ని నిర్మూలించాలి. ఆత్మ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోవాలి. భావి కాలానికి మార్గదర్శకులమై మన ఆశయాలను కలకాలం ప్రకాశింపజేయాలి. పాతకాలపు భావాలు కల్గిన పెద్దవారికి బుద్ధి నేర్పాలి" అంది గుణ.

"ఏమో! అది జరుగుట కల్ల. నీవు పేదయువకుని పెండ్లాడి పలుబాధలకు లోనై దారిద్ర్యాన్ని అనుభవిస్తూంటే, నేను ఐశ్వర్యంతో తులుకుట నాకు యిష్టంలేదు."

"ఫరవాలేదులే!"

"నీకల్లే వుండవచ్చు. కాని...నాకు చాలా బాధగా వుంటుంది. నీవు కష్టాలతో కాలం గడుపుతుంటే, నా కడుపు తరుక్కుపోతుంది. నీ యిక్కట్లకునే సహించలేనక్కా" అంటూ కన్నీరు కార్చింది దేవకి.

"పేదవానిని కట్టుకున్నంత మాత్రాన కష్టాలు రావు దేవకీ. దైవ మిచ్చిన కాళ్ళు చేతులున్నాయి. కష్టపడి చెమట ధారపోసి పొట్టపోసుకుంటూ హాయిగా కాలాన్ని గడపవచ్చు."

"ఏమో అక్కా..."

"పిచ్చి పిల్లా" అని నవ్వుకుంటూ లేచిపోయింది గుణ.

# 11

దేవకి అంతులేని ఆలోచనలతో అక్కడే వుండి పోయింది.

తిన్నగా వంటింటివైపు నడచి వెళ్ళింది గుణ. తన పనిలో నిమగ్నుడై యున్న నౌకరు సుబ్బయ్యను పిలిపించి గుణ.

"ఏం! తల్లీ?" అంటూ చేతిలోవున్న గరిట అక్కడ పెట్టి వచ్చాడు.

"ఇందు...యీ రెండు రూపాయలు తీసుకెళ్ళి బియ్యపు నూకలు పట్టుకురా" అంది గుణ.

"ఎందు కమ్మా?" అంటూ ప్రశ్నించాడు ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతూ నౌకరు సుబ్బయ్య.

"నూకల జావ త్రాగాలి."

"ఏంటి తల్లి...తాగాలని మీ కేం కర్మ?"

"కర్మ పట్టింది."

"ఏంటి తల్లీ...అట్టా అంటారు? గొప్పింటి బిడ్డవు. ఇప్పుడు నీ కంత కర్మ పట్టాల్సిన గతేం పట్టింది."

"కొద్ది రోజుల్లో నేనుకూడా పేదింటిదాన్ని కాబోతున్నాను గనుకనే."

"అదేంటి తల్లీ?"

"అవును...పేదవానిని పెండ్లి చేసుకుంటాను. పేద వారితో పొత్తు కుదుర్చుకుంటాను. పేదరాలినై జీవితాన్ని గడుపుతాను" అంది నిర్మల హృదయంతో గుణ.

ఆమెను అర్థం చేసుకున్న సుబ్బయ్య, ఎదురు చెప్పలేక తడబడుతూ "అయితే సరే నమ్మా" అంటూ వీధిలోకి నడిచాడు.

నిత్యమూ గుణ, దేవకిలు పొత్తుగా భుజించేవారు. కాని వేరైపోయారు.

అలవాటులేని జావను అలవాటుచేసి, మింగుడు పడని జావను ఎలాగో మింగుతూ మూడు రోజులు గడిపింది గుణ. మూడు దినాలలో నీరసించిపోయింది గుణ. స్వరం క్షీణించి పోయింది. శరీరం కృశించిపోయింది. ఆమె పాలబుగ్గలు

చొట్టలు పడ్డాయి. కనులు లోతుకు పోయాయి. ఆమెలోని కళ నశించిపోయింది.

రాత్రింబవళ్లు ఆలోచనలో నిమగ్నురాలైంది గుణ. కాఫీ త్రాగటం, పాలు త్రాగటం మానేసింది. ఆమెలో అకస్మాత్తుగా కల్గిన యీ మార్పులు దేవకి మనస్సును పురి కొల్పాయి. నిత్యమూ తనతో బాటు భోజనంచేసే అక్క ఎందుకు విడిపోయి భోంచేస్తూంది? అసలు ఏం భోంచేస్తూంది? ఎందు కీ విధంగా క్షీణించిపోతూంది ? అన్న ప్రశ్నలు ఆమెలో జనించాయి. ఎంత గాలించి యోచించినా ఆమెకు సమాధానం దొరకలేదు. ఏవిధంగానైనా యీ రహస్యం తెలుసుకోవాలని తలంచింది.

మరునాడు ఉదయం పదకొండు గంటలకు దేవకి, పడక కుర్చీలో పడుకుని నవలచూస్తూ చదువుతున్నట్లు నటించి, మరొక ప్రక్క అక్కను పరికిస్తుంది.

అక్కడే పడుకొన్న గుణ లేచి వంటింటివైపు నడక సాగించింది.

దేవకి యీ విషయాన్ని గమనించకపోలేదు...... అప్పటికి ఏమీ తెలియనిదానిలా నటించి వూరుకుంది.

గుణ రాకను గమనించిన సుబ్బయ్య "వడ్డించనా" అన్నట్లు చూచాడు.

"వడ్డించు" అన్నట్లు అక్కడేవున్న పీటవేసుకుని కూర్చుంది గుణ.

స్టీలు కంచంలో నూకజావ పోసికొని, చిన్న చిన్న స్టీలు గిన్నెలతో మాంసం వేపుడు ముక్కలు, చేపల యిగురు,

వేల్చిన కోడి గ్రుడ్లు నంజుడుకై తెచ్చి గుణముందు పెట్టాడు సుబ్బయ్య.

"సుబ్బన్నా !"

"అమ్మా !"

"నీ కెన్ని పర్యాయములు చెప్పాలి? ఈ నంజుడు పదార్థాలు వద్దని! ఊఁ......తీసెయ్యి" అన్నది కొంచెం చిరాకుగా గుణ.

"అది కాదమ్మా...అవి కూడా మీరు తినకపోతే చిక్కిపోతున్నావు. నా గుండె తరుక్కుపోతూంది......యీ దఫాకు తినమ్మా..."

"ముందు యివి యిక్కడనుండి తీస్తావా! నన్నే తీయమంటావా?" కఠినంగా పలికింది గుణ.

"నేనే తీస్తాను తల్లీ"అంటూ పొరలుచున్న విచారాన్ని లోలోన అణచుకొని నంజుడు పదార్థాలన్నీ తీసివేశాడు.

ఆత్రుతగా పెరుగూ, వుప్పూ తెచ్చాడు పాపం జాలి హృదయుడైన సుబ్బయ్య.

పెరుగు ఆవలకు నెట్టి వుప్పు కంచంలో వేసుకొని, కలుపుకుని తినసాగింది. ముద్ద నోటిలోనికి పోయిందో లేదో మరుక్షణమే కక్కింది. కారణం వుప్పు ఎక్కువయింది. ఆ జావలో కొంచెం నీళ్ళు పోసికొని తినలేక...తినలేక అతి కష్టంతో నెమరువేస్తూంది.

దేవకి మెల్లగా గుణ దాపుచేరి అంతా తన స్వనేత్ర దృష్టితో పరికించి పరీక్షించింది. ఆమె కనుదోయి మిరుమిట్లు గొల్పుతూ మిల మిల మంటున్నాయి.

ఆమె కనులలో ఆశ్చర్యం నాట్యమాడు తున్నది. ఆమె పెదిమలపై ఉద్రేకం తాండవమాడుతోంది.

"అక్కా...ఏమది ?"

"నూకల జావ."

"నీకు మతిపోయిందా, ఏమి ?"

"పోయిన మతి వచ్చింది."

"ఇది నీకు తగునా ?"

"నే నేమి అపరాధాలు చేయుటలేదుగా ?"

"ఇప్పుడు నీ కేం లోటు ప్రాప్తించిందని నూకల జావ తింటున్నావు ? జమీందారీ బిడ్డవు జల్సాగా బ్రతుకవలెగాని, జావ త్రాగి జీవించకూడదు" అంది మహా తెలిసిన దానిలా దేవకి.

"ప్రాప్తించబోయే పేద సంసార జీవితమునకు యిది నాందీ ప్రస్తావన. అసలు జమీందార్ బిడ్డ జల్సాగా బ్రతకాలని ఎక్కడ లిఖించారు ? పేద ప్రజలు అన్నంలేక అన్నమో రామచంద్రా అని ఆర్తనాదములు చేయుటయూ, మనము హాయిగా తిని ఆనందించుటయూ ? చాలించు నీ తెలివి తక్కువ మాటలు" కొంచెం కోపించి పలికింది గుణ.

"అసలు యీ జావ వండిం దెవరు ?

"సుబ్బన్న" అంది గుణ.

సుబ్బన్న కేసి కోరచూపులు చూచి పండ్లు నూరింది దేవకి. గిఱ్ఱున దేవకి సుబ్బయ్యవైపు తిరిగింది. కోడెత్రాచు లాంటి ఆమె వాలు జడ ఆమె మెడను చుట్టింది. చరచరా

నడచివెళ్ళి సుబ్బయ్య దవడల మీద యెడా...పెడా రెండు కొట్టింది దేవకి గట్టిగా.

ఆ చప్పుడు విన్న గుణకు ఆమె చెంపలు వాయించి నట్లయింది. తింటున్న కంచం వదలిపోయి దేవకిని ఆ చెంప యీ చెంత పగలకొట్టింది.

నిర్ఘాంతపోయిన దేవకి "అక్కా—" అంటూ ఆమెమీద వాలింది.

"గర్విష్టురాలా! చిన్నా పెద్దా అన్న యోచనలేకుండా, ధనవంతులమన్న అహంభావముచే నౌకర్ను కొడ్తావా? ఛీ...నీముఖం చూపకు. అతనేం పెద్దతప్పుచేశాడని యీపని చేశావ్? నేను వండమన్నాను వండాడు...యిందులో అతని తప్పేముంది. ఆ దెబ్బలు నన్ను కొట్టి నన్ను దండించకూడదూ? నీ కోపం విరగడయ్యేది!" అంటూ దూషించింది మహోవృక్రోషంతో గుణ.

"ఇన్నాళ్లకు నన్ను కొట్టావా అక్కా—" అని ఏడుస్తూ చెంపలు తడుముకుంటూ వెళ్లిపోయింది దేవకి.

"ఎన్నాళ్లకు మీ చేత దెబ్బతిన్నానమ్మా" అనుకుంటూ కన్నీరు కారుస్తూ వెళ్ళిపోయాడు సుబ్బయ్య నౌకరు.

అర్థంకాని ఆలోచనతో, పొరలి పొంగుచున్న ఆవేశంతో, రగులుచున్న హృదయావేదనతో అలాగే నిలిచిపోయింది గుణ.

# 12

తూర్పు కొండపై సూర్యుడు ఉదయించాడు. చీకటిని చీల్చుకుంటూ దేశమంతటా వెలుగు విరపూసింది. కాల చక్రం కదిలిపోయింది. ఉదయం తొమ్మిదిగంట లయింది. దిన పత్రిక చదువుతూ వాలు కుర్చీలో కూర్చున్న గుణ ప్రక్క మెల్లగా వచ్చి నిల్చింది దేవకి.

"అక్కా" అంటూ చిన్నగా గొణిగింది దేవకి. కాని ఆ మాటలకు మరింత మూతిబిగించింది గుణ. ప్రక్కనున్న కుర్చీలో కూలబడింది దేవకి. "అక్కా...ఎందుకు నాపై నీకంతకోపం. తెలియని ఆవేశంలో ఏదో చిన్న తప్పిదం చేశాను. అదీగాక వేయిమందికి సహితం పప్పు నేయి పరమాన్నాలతో భోజనం పెట్టే శక్తి సామర్ధ్యం మన దగ్గ రుండగా, నీవు నూకల జావ తింటూంటే నా ప్రాణా సహించదు. అట్టిది నా కళ్ళారా...నేను చూడలేనక్కా..." అంది జాలిని వ్యక్తపరుస్తూ దేవకి.

ఆ మాటలకు గుణ సమాధాన మివ్వలేదు.

"ఒకవేళ నీవు పేదవారిని పెండ్లాడి పేదరాలివైనా, నాన్నకు తెలియకుండా నా ఆస్తిలో సగపాలు నీకి స్తాను. ఇది నా దృఢనిశ్చయం" అని ఎంతో సవినయంగా చెప్పింది దేవకి.

జవాబు లేదు.

"నూకల జావ తిన్నంత మాత్రాన పేదింటి అలవాట్లు అలవర్చుకున్న ట్లేనా ?"

"అవును...పేదవారు భుజించు పవిత్రభోజనం యీ నూకలజావ. అందుకే ఆ భోజనానికి నేను అలవాటుపడు తున్నాను. అందులో కొంతవరకు విజయం సాధించాను" అంటూ చిరునవ్వులు చిందించింది గుణ. ఆ చిందించిన చిరునవ్వులు మరుక్షణంలో మాయమై ఆమె ముఖంలో విచారం విజృంభించింది.

"ఈ రోజు నాకు నౌకరు వండిపెట్టాడు. పేదింటి కోడలనైతే నాకు ఎవరు వండి వడ్డిస్తారు? నేనే వంటచేసు కొని భర్తకు వడ్డించాలి. కనుక నేనే స్వయంగా వంటపని చేసుకోవాలి" అంటూ లోలో[illegible]ంచుకున్న గుణ, అక్కడినుండి లేచి వంటగది చేరిం[illegible]య్యను పిలిచింది.

"నాకుకూడా వంటచేయడం నేర్పు" అంది.

"అదేంటి తల్లీ! అలా అంటారు" ఆశ్చర్యపోయాడు నౌకరు సుబ్బయ్య.

ఆ మాటలు లక్ష్యపెట్టక మళ్ళీ అడిగింది గుణ.

"మీకు తగదమ్మా! కష్ట మెరుగని సున్నిత శరీరులు మీరు. కష్టంచేస్తే మీ వళ్ళు కందిపోతుంది. మీ కళా తేజస్సు నశించిపోతుంది. పొగబాధకు మీ కళ్ళు పాడై పోతవి, ఆమా టనకు తల్లీ!" అని బుజ్జగించాడు సుబ్బయ్య.

"సుబ్బన్నా!...అధిక ప్రసంగాలు నీకు అనవసరం. ఆ బాధ నే పడతాను, భరిస్తాను. నే చెప్పినట్లు విని, నాకు నేర్పు" అంది కొంచెం మొరటుగా.

"అదిగాదు తల్లీ... యీ విషయం మీ నాన్నగారికి తెలిస్తే నాపీక నొక్కి పారేస్తాడు. నన్నీలోకంలో బ్రతుక

నివ్వకు. నామాట విని యిక వెళ్లు తల్లీ. నీకు మొక్కుతాను” అన్నాడు సుబ్బయ్య.

“సుబ్బయ్యా...నా మాట కాదనకు. నా భవిష్యత్తును గూర్చి ఆలోచించినట్లయితే నీ విలా అనవు అసలు ఆడదై జన్మించిన తరువాత ఆడవాళ్ళు చేయవలసిన పనులన్నీ చేయుట కలవాటుపడాలి. ఏనాటికి ఏమి జరుగుతుందో! కనుక నా మాటలు విని వంటపనులు నాకు నేర్పు.”

“గొప్పింటి బిడ్డకు నీ కెందుకమ్మా యీ తలద్రాత? హాయిగా కాలాన్ని వెళ్ళబుచ్చక...” అన్నాడు సుబ్బయ్య.

“అలా అనకు సుబ్బయ్యా. గొప్పవారే ఓ నాటికి పేదవారు కావచ్చు. పేదవారే ఒకనాటికి గొప్పవారు కావచ్చు. అటువంటప్పుడు అన్నిటికి అలవడుట మంచి పద్ధతి.”

“ఏమో...తల్లీ! నీవు చెప్పినప్పుడు కాదంటానా? ఏది ఎలా జరగాలో అలాగే జరుగుతుంది. సరే! రా! తల్లీ నేర్పుతా” అన్నాడు సుబ్బయ్య నౌకరు.

గుణ హృదయం పరమానందంతో నిండిపోయింది. ఆమె ముఖంలోని విచార రేఖలు విచ్ఛిన్నమై ప్రచ్ఛన్నమైన కళాతేజస్సుతో కళకళలాడింది.

# 13

మరునాడు సుబ్బయ్య బజారుకెళ్లి పచ్చజొన్నలు, మిరప కాయలు వగైరా పట్టుకొచ్చాడు. అర్థశేరుజొన్నలు సుబ్బయ్య, గుణాలు కలసి దంచి బియ్యం చేశారు. పాపం యిన్నాళ్లుగా కష్టమెరుగని గుణ సున్నితశరీరం సూదులతో గ్రుచ్చినట్లయింది. లేచిగురువంటి ఆమె లేతచేతులు కంది బొబ్బ లెక్కాయి. గుణ మిరపకాయలకారం నూరింది అమిత బాధపడుతూ. సుబ్బయ్య జొన్నసంగటి వండాడు. వంట పనులన్నీ పూర్తిచేశారు. జొన్నసంగటి రూపురేఖలు తెలియని గుణ చూడాలని ఆశతో జొన్నసంగటి వున్న రాగి తపాళాదగ్గర కెళ్ళి పై మూత తొలగించి పరికించింది. ఆమె లోలోపల ఏదో ఆలోచించుకుంది. సుబ్బయ్యను పిలచింది. సుబ్బయ్య వచ్చాడు.

"సుబ్బన్నా...ఒక్కదానికి యింత సంగ టెందుకు ?"

"ఏంటమ్మా...అలా అంటారు. గొప్పింటి బిడ్డవు నీవు జొన్నసంగటి తింటున్నారే! నేనుకూడా మీతోపాటే ఆ సంగటే తింటానమ్మా. అందుకు అంత సంగటి వండాను" అన్నాడు ఆనందంతో నౌకరు సుబ్బయ్య.

"ఆఁ...ఆఁ...నీ కేం కర్మ సుబ్బన్నా! యీ సంగటి తినాలని ? అది నేను అంగీకరించను. నీవు ప్రతిరోజూ భుజించే భోజనమే భోంచేయాలి... తెలుసా ?" అన్నది గుణ.

"అదేంటి తల్లీ! జొన్నసంగటి మాలాంటి పేదప్రజలకు పరమాన్నంలాంటిది. ఎండుమిరపకాయల కారం పప్పులాంటిది. పుట్టినప్పటినుండి నేను తినేది యీ జొన్నసంగటే తల్లీ. ఇప్పుడు తినాలంటే నా కేలాంటి కష్టంలేదు" అన్నాడు ఎంతో ఆప్యాయంగా సుబ్బయ్య.

అంతలో దేవకి విచారవదనంతో కుమిలిపోతున్న మనస్సుతో అచ్చటికి వచ్చింది. సుబ్బయ్యనొకరును చూచి "సుబ్బన్నా...అన్నం వడ్డించు" అన్నది.

"పదమ్మా గుణమ్మా; నీకూ, చెల్లిగారికి భోజనం కిడ్డిస్తాను" అని ముచ్చటించాడు.

గుణ దేవకిలు భోజనానికి కూర్చున్నారు.

సుబ్బయ్య రెండు స్టీలుపాత్రలు వారి ముందు పెట్టాడు. రెండురకాల భోజనం తెచ్చి దేవకికి వరిఅన్నం వడ్డించాడు. పప్పుతో కూడిన పదిరకాల కూరలు వడ్డించాడు. గుణకు జొన్న సంగటి, కారం వడ్డించాడు.

దేవకి ఆ అన్నం చూచి మండి పోయింది. సుబ్బయ్య వంక చూచి,

"అదేంటి సుబ్బన్నా ?"

"అది మీ అక్కగారి అన్నం...జొన్నసంగటి."

"అయితే...అదే నాకుకూడా వడ్డించు."

"సుబ్బన్నా...వద్దు. నే తినే అన్నం నా చెల్లి తినలేదు. ఆమెకు వడ్డించకు" అంది గుణ.

"సుబ్బన్నా! నా అక్కకు ఏమి వడ్డించావో! అదే నాకూ వడ్డించు. లేకుంటే నేను యీ అన్నమే ముట్టను" అంది బెట్టుసరిగా దేవకి.

తప్పనిసరయింది. దేవకికికూడా జొన్న సంగటి వడ్డించాడు.

దేవకి జొన్న సంగటి కారం కలుపుకొని ఒక్క ముద్ద తిన్నది. వెంటనే వాంతి చేసుకుంది.

"ఛీ...ఛీ...యిది మనుష్యులు తినే భోజనం కాదు. పశువులు, కుక్కలు తినేది" అంది తిరస్కారంగా దేవకి.

"అవును...అందుకేగా నే చెప్పింది. మీరు తినేది కాదని. గొప్పవారి కళ్లకు యిది పశువులు, కుక్కలు తినే భోజనంలా కనపడుతుంది. కాని యీ భోజనం పేదలపాలిట పరమ పవిత్ర భోజనం" అంది గుణ.

"అక్కా! నా మాట విని నీవు కూడా తినకు" అని తినబోయే గుణను చేయిపట్టి ఆపింది.

"అయితే...అసలు అన్నం తినకుండానే వుంటాను. పస్తు వుండటంకూడా అలవాటు చేసుకుంటాను. ప్రపంచంలో ఎంతమంది పేద స్త్రీ పురుషులు తింటానికి తిండిలేక పస్తులతో మలమలమాడి చావటంలేదు? అలాగే నేనూ వుంటాను." అని పలికింది గుణ.

"అయితే...నీతో పాటు నేను కూడా పస్తు వుంటాను."

"సుబ్బన్నా! అయితే నీవు భోంచేయి" అంది గుణ.

"అదేంటి తల్లీ! మీరు తినకుంటే నేనూ తినను" అని మారాం చేశాడు, సుబ్బన్న.

ఈ విధంగా పోటీపడి ముగ్గురూ భోజనం తినకుండా మానేశారు.

ఇంతలో ఆ వూరి చెంచయ్యశెట్టిగారి కుమార్తె కమల కుమారి జన్మదినోత్సవాహ్వాన పత్రిక తీసికొని లలిత, సుజాత, ప్రేమలతలు మందహాసానందవదనులై మల్లె, గులాబి పూల మాలలు వాలు జడలందు సొగసుగా ధరించినవారై, పరువముతో నిండిన పసుచుతెనంపు ఆ ముగ్గురు యువతులు గుణ, దేవకిల దగ్గరకు వస్తారు. వారి రాక గమనించిన గుణ, దేవకిలు పరమానందంతో వారిని ఆహ్వానించారు. అందరూ సోఫాల నలంకరించారు. కొంతకాలం కుశలప్రశ్నలు, కులాసాకబుర్లతో కాలం గడిపారు.

"మీకు ఓ పెద్ద బహుమానం పట్టుకొచ్చాను" అంది వయ్యారాన్ని వలకబోస్తూ లలిత.

"ఏమిటో! అంత పెద్ద బహుమానం?" అంది గుణ కొంచెం చలాకీగా.

"మరి చెప్పకోండి చూద్దాం!"

"అసలు తెలిస్తేగా! చెప్పడానికి?" అంది దేవకి.

"అదే ఓ గొప్ప ఆహ్వానం" అంటూ ఆహ్వాన పత్రిక యిచ్చింది లలిత.

"ఓహో! అదా అసలు రహస్యం!" అంది గుణ అంతా తెలిసికొని.

"మీరు తప్పక రావాలిసుమా!" అంటుంది సుజాత. గుణనుండి ఆ మాటలకు ఏమీ జవాబు లేదు. దేవకి, సుజాతను రహస్యంగా కనుసైగతో ప్రక్కకు పిలిచి "మా అక్క

గుణను తప్పక రావాలని పట్టుపట్టింది. మాట పుచ్చుకొని మరీ వెళ్ళండి. లేకుంటే రాదని చెప్పింది.

ఆ ముగ్గురు యువతీమణులు ఎంతగానో బ్రతిమలాడి బలవంతం చేయగా, తప్పకుండా గట్టిగా వస్తానని మాట యిస్తుంది. వారు సంతోషంతో గుణ, దేవకిలకు సెలవు చెప్పి వెళ్ళిపోయారు.

# 14

చెంచయ్యశెట్టి కుమార్తె పుట్టినరోజు ఆహ్వానపత్రిక సుందర్ జమీందార్‌కు కూడా అందజేశారు. కమల కుమారి, గుణ, దేవకిలు స్నేహితులని తెలుసుకున్నాడు సుందర్. గుణ, దేవకిలు యీ జన్మదినోత్సవంలో పాల్గొందురని ఆచూకీ తీశాడు. హృదయంలో మమకారం చెలరేగింది. సుందర్ శరీరం పులకరించింది. కామ, మోహావరవశంలో ఏవో స్వప్నాలు కంటున్నాడు. సిగరెట్టు వెలిగించాడు. మదమాత్సర్యము లనెడి మకర, తిమింగిలములు సాగర మనెడి తన హృదయంలో ప్రజ్వరిల్లుచున్నవి. ఆగ్రహంతో నిండి పోయాడు.

"నావంటి అపురూప సుందరస్వరూపి, నా అంతటి ఆస్తిపరుడు, రసపిపాసి, సుగుణశాలి దేశమంతయు గాలించినా లభించుట మహాకష్టం. అటువంటి నన్ను గుణ, దేవకిలు కాదని యెవర్ని కట్టుకుని కులుకుతారో చూస్తాను. నా కంఠమున

ప్రాణమున్నంతవరకూ వారికి పరిణయభాగ్యమే లేకుండా చేస్తాను. ఈ సారితో వారి అంతు తేలుస్తాను." నిప్పులు కక్కుతూ అన్నాడు సుందర్.

ఒక మంచి వుపాయం ఆలోచించాడు సుందర్. నౌకరును పిలచి వాడితో చంద్రిగాడు, మునిగాడు, వెంకడనే పేరు మోసిన రౌడీలను పిలిపించగా, వారు మహాజోరుగా వచ్చారు. "చంద్రిగా మీకు పని తగిలింది. ఏమంటారు ?" ముచ్చటగా ప్రశ్నించాడు సుందర్.

"ఓ...తయార్" అన్నారు రౌడీలు.

"ఈ కార్యం......మీరు సాధించారంటే ప్రతిఫలం మీకు ఐదువందల రూపాయలు యిస్తాను" అన్నాడు సుందర్.

"సరే! శెలవియ్యండి, నిముషాలమీద సాధించుకొస్తాం."

"శభాష్...సరే! వినండి చెప్తాను. రేపు యీ వూరి చెంచయ్య శెట్టి కూతురు పుట్టినరోజు విందు జరగబోతుంది. విందుకు నేనుకూడా వెళ్తాను. అక్కడికి అందాల చందమామ లాంటి చక్కని యిద్దరు యువతీమణులు వస్తారు. వారిని నేను చూపిస్తాను. వారిరువురు చిన్నకారులో వస్తారు. ఆ కారు డ్రైవరును ఏదో నెపంమీద దూరంగా గొనిపోయి స్పృహలేకుండా కొట్టివేయండి...వెంటనే మీరు నా బంగళాకు వచ్చిచేరండి" అని చెప్పి, జేబులోంచి యాభై రూపాయలు తీసి రౌడీల కిచ్చి, రేపు సాయంకాలం 5 గంటలకు చెంచయ్య యింటిదగ్గరకు రండి" అని చెప్పి వాళ్ళను సాగనంపాడు.

# 15

మరునాడు సాయంత్రం 3 గంట అయింది. గుణ నీరసంగా తన రూములోని పడకపై పడుకున్నది. అంతలో దేవకి అక్కడకు వచ్చింది. "ఏం! అక్కా! యింకా పండు కొన్నావ్? ఎందుకు టైం అయింది లే!" అంది.

"నాకు శరీరం బడలికగా వుంది. వస్తానని మాట యిచ్చాను. కనుక నీవు వెళ్ళిరా దేవకీ."

"నాకు తల నొప్పిగా వుంది. నీవు రాకుంటె నేనూ వెళ్ళకుండా మానేస్తాను" బెట్టుగా పలికింది.

దేవకి మొండిపట్టువలన గుణ వెళ్ళక తప్పిందికాదు.

కారు డ్రైవరు గోవిందుని పిలిచి ప్రయాణానికి చిన్న కారు సిద్ధంచేయమంది గుణ.

గుణ, దేవకిలు స్నానాదులు చేసి, మంచి నైలాన్ బట్టలు ధరించి దేవకన్యలవలె మిణుకు మిణుకు మంటూ మెరుస్తూ, సాయంత్రం 4-30 గంటలకు కారులో బయలుదేరి వెళ్ళారు. చెంచయ్యగారింటికి ఒక పావుగంటలో వచ్చి కారులోంచి దిగారు గుణ దేవకిలు.

అక్కడ సిద్ధంగా వున్న రౌడీలకు సుందర్, గుణ దేవకిలను, డ్రైవరు గోవిందును చూపించాడు. చేయవలసినదంతా వాళ్ళకు విశదంగా చెప్పి 'జాగ్రత్త' అంటూ సుందర్, చెంచయ్యగారింటికి ఎందుకు వెళ్ళిపోయాడు.

సుందర్ రౌడీలు ఏమీ తెలియని పెద్దమనుషులవలె డ్రైవరు గోవిందు దగ్గరకు వచ్చారు.

"ఏమండీ డ్రైవరుగారూ! మా కారు స్టార్టు అగుట లేదు. కొంచెం దయయుంచి ఆ కారు బాగుచేయండి" అన్నారు రాడీలు.

"ఎక్కడుందండి మీా కారు?" ప్రశ్నించాడు డ్రైవరు గోవిందు.

"ఇదిగో యీా మూల మలుపులో."

"అయితే పదండి" అన్నాడు, పాపం ఏమీా యెరుగని డ్రైవరు గోవిందు.

సందు మలుపు తిరిగిన గోవిందు ముఖానికి ముసుగు వేసి యిష్టమొచ్చినట్లు కొట్టి రాడీలు స్పృహతప్పి పడిపోయిన గోవిందును ప్రక్కనున్న పార్కులోకి ఎత్తుకెళ్లి ఒక బెంచి ప్రక్క పండబెట్టి పరారియ్యారు

విందు అయిపోయింది. సుందర్ ముందుగా వచ్చి తన డ్రైవరు కేదో చెప్పి కారేసుకొని వెళ్ళిపోయాడు. సుందర్ కారు డ్రైవరు అక్కడ ఆగిపోయాడు.

స్నేహితురాండ్రతో ముచ్చట్లు అయ్యాక గుణ, దేవకిలు వాలుజడలు ముందుకు వేసికొని, వయ్యారంగా నడుస్తూ వచ్చి కారెక్కారు. "పోనియ్ గోవిందూ" అని అన్నారు.

కారు మనోవేగంతో పోతోంది. దారితప్పి వేరేదారిని పోతోంది కారు.

"ఏమిటి? గోవిందూ యిటు పోనిస్తున్నావ్" అంది ఆతృతగా గుణ.

"ఈ రూటుకూడా మన యింటికి వెళ్తుందమ్మా" అంటూా మరింత వేగంగా నడుపుతూా, తిన్నగా సుందర్ జమీా బంగళాముందు నిలిపాడు కారు.

"ఇక్కడ ఆపావు ఏమిటి గోవిందా ?" అంది కంగారుగా గుణ.

కారు డ్రైవరు గోవిందు కాదు. సుందర్ కారు డ్రైవరని గుణ, దేవకిలు గమనించారు. అది సుందర్ బంగాళా అని గుర్తించారు. పెద్ద ప్రమాదంలో చిక్కుపడి పోతిమని విచారించారు. గుణ, దేవకిల శరీరం వణికి పోతూంది. శరీరమంతా చెమటతో నిండిపోయింది. వారి హృదయనాడులు వేగంగా కొట్టుకుంటున్నాయి. కుడితి కుండలో పడ్డ ఎలుకవలె గిల గిల తన్నుకుంటున్నారు. ఇంతలో అక్కడ రెడీగావున్న రౌడీలు కారులో చొరబడి గుణ, దేవకిల నోరులు గట్టిగా బిగించి వారిని ఎత్తుకొనిపోయి, సుందర్ బంగళాలో ఒక గదిలో బంధించి తలుపులు మూసి, తాళం వేసి సుందర్ దగ్గర కెళ్ళి చేసిన పనంతా చెప్పుతారు.

"శభాష్......చంద్రిగా......చాల నేర్పుగా పని సాధించావ్" అంటూ సుందర్ డబ్బునంచి చంద్రిగాడికి విసురుతాడు.

అది తీసుకొని "వస్తాం...బాబూ" అంటూ సంతోషంతో రౌడీలు వెళ్ళిపోతారు.

గదిలో బంధించబడ్డ గుణ, దేవకిల విచారం యింత యని చెప్ప శక్యముగాదు. వారి కన్నీటిధారలు పిల్లకాల్వలై పారుచున్నవి. వారి పవిత్ర శీలము భంగపడునేమో యన్న భయము వారి హృదయమును కలవరపెట్ట సాగినది. ఎంత దుఃఖించినా ఏమి ప్రయోజనము. చేసిన కార్యమునకు తగిన ప్రతీకారముచేసి పవిత్ర శీలములకు భంగము కలుగకుండా బుద్ధిబలముచే క్రూర రాక్షసుడగు యీ సుందర్ చేతులలో

చిక్కబడక తప్పించుకోనవలయు నని గుణ, దేవకిలు తలంచి విచిత్రనాటక మాడ సంసిద్ధపడిరి.

## 16

గుణ, దేవకిలు వచ్చారన్న వార్త విన్న సుందర్ హృదయంలో వుత్సాహం, శృంగారం తొణికిసలాడాయి. అతని ఒడలు పులకరించింది. అతనిలో కామరేఖలు ఉత్పన్నమయ్యాయి. తక్షణమే స్నానం చేశాడు. అందమైన సూటు ధరించాడు. అత్తరు, సెంటులు ధరించిన బట్టలపై చిలికాడు. తలను నీటుగా దువ్వుకున్నాడు. రివాల్వరును చేతబట్టుకొని పరమానంద పరవశంతో పెదవులపై చిరునవ్వులు చిందిస్తూ గుణ, దేవకిలున్న గదిదగ్గరకు వచ్చి గది తలుపులు తెరచి అహాహ...అని నవ్వుకుంటూ లోనికి ప్రవేశించాడు. ఆ నవ్వు గుణ, దేవకిల హృదయాలను బాధించింది. కాని...వారు ధైర్యాన్ని కోల్పోలేదు. సుందర్ వారిని చూచి,

"నా అందాల చిలకల్లారా! యిప్పుడు చెప్పండి మీ నిర్ణయం? మీ ప్రాణాలు నా అరచేత గుప్పిట పట్టివుంచాను. ఇంతవరకూ నా మాటను ధిక్కరించినవారు లేరు...వుంటే ...ప్రాణాలతో బ్రతుకలేరు. ఊఁ...చెప్పండి. ఆనాడు మీ నాన్న శాస్త్రికి చెప్పిన మాటలే యిప్పుడు మీరు పలికారంటే మీ ప్రాణాలు తీస్తాను. నా కేమి లోటుంది; డబ్బుకు డబ్బు... హోదాకు హోదా...నా మాట కాదంటే నల్లిని రాసినట్లు

నా పాదాలతో రాసి చంపుతాను. జాగ్రత్త." అని హెచ్చరించాడు.

ఆ మాటలకు గుణ దేవకిల నరాలు కృంగిపోయాయి. వారి శరీరంలోని రక్తం పాలిపోయింది. కాని అదేమీ బయటకు కనుపించనీయలేదు.

గుణ, దేవకిలు సుందర్‌పై ప్రేమచూపులు ప్రసరింపచేశారు.

"అక్కా...మన నాన్న ఎంతమోసంచేశాడే! ఏదో మంచి సంబంధం వచ్చిందని మనలో ఒకర్తెను సుందర్‌కు యివ్వకుండా చేశాడు. మనం అదృష్టవశాత్తు యిక్కడికే వచ్చాం! కాబట్టి నేనే సుందర్‌ను పెండ్లాడతా నక్కా" అంది దేవకి.

"అదేమిటే!...నీకన్న నేను పెద్దదాన్ని...మరి... నా హృదయం సుందర్‌ను పెండ్లాడమని కలవరపెట్టుచున్నది. నేనే సుందర్‌ను పెండ్లాడతాను" అంది గుణ.

"అదేమీ కాదు. సుందర్‌ను నేనే చేసుకోవాలి" అంది దేవకి.

"కాదు...నేనే చేసుకోవాలి."

ఈ విధంగా వాదనలాడుకుంటున్న గుణ, దేవకిలను చూచి సుందర్ ఆశ్చర్యపోయాడు. సుందర్ బుర్ర పెద్దదే... కాని అందులో వున్నది తెలివికాదు, మట్టి. అందుకే పాపం! వారి నటన నిజమని నమ్మిపోయాడు.

అప్పుడు గుణ ముందుకు వచ్చి వయ్యారం వలకబోస్తూ, పెదిమలపై చిలిపి నవ్వులు చిందిస్తూ, కొంగును సవరించుకొంటూ, కన్నులలో ప్రణయాన్ని ప్రకాశింపజేస్తూ,

ప్రణయ చూపులతో సుందర్ మహకారమును బంధింప జేస్తూ యీ విధంగా పలికింది:

"సుందర్ నిను చూచిన మహక్షణమే నా ప్రేమ బీజములు నీ హృదయమున నాటితిని. నీవే నా ప్రణయ మూర్తివి. నన్నే నీవు పరిణయ మాడవలెను."

దేవకి మరింత ముందుకు వచ్చి "సుందర్ నీవే నా హృదయరాజువు. నన్నే నీవు పెండ్లాడవలెను. నా సర్వాంగములు నిన్నే కాంక్షించుచున్నవి" అంది అనురాగమును చూపుతున్నట్లు.

పాపం! ఏమీ తెలియని సుందర్ నిర్ఘాంతపోయాడు. నిజంగా వారు మనఃపూర్వకంగా ప్రేమించారని దృఢపడ్డాడు. కాని ఏమీ చెప్పలేకపోయాడు.

"అయితే...ఒక పని చేద్దాం!" అంది గుణ.

"ఏమిటది?" అన్నట్లు ఆతృతగా చూచాడు సుందర్.

"మేం మువ్వురము యిక్కడ నిలబడతాం! నీవు కనులకు గంత కట్టుకొని ముందుగా నీవు మాలో ఎవరిని తాకుతావో! ఆమెను నీవు పెండ్లాడవలెను" అంది అతి వినయంగా గుణ.

"ఆల్ రైట్...అంతే చేద్దాం." అన్నాడు పొంగిపోతున్న ఉత్సాహంతో, సుందర్.

వెంటనే పాంటు జేబులోవున్న చేతిరుమాలు తీసి కళ్లకు గంత కట్టుకున్నాడు.

"రెడీ...వన్-టు-త్రీ"అంది పొరలివచ్చే నవ్వు ఆపుకొని గుణ.

సుందర్ ఆత్రుతతో వెదక నారంభించాడు.

గుణ, దేవకిలు మనసులో బ్రతికేమురా భగవంతుడా అనుకొంటూ...అక్కడున్న రివాల్వర్ తీసికొని వణికిపోతూ సుందర్ చేతుల్లోనుండి తప్పించుకొని బయటపడి, నిశ్శబ్దంగా తలుపుమూసి గొళ్ళెంవేసి వస్తుండగా పనిమనిషి ఎదురౌతుంది. దేవకి చేతులోవున్న రివాల్వరు చూపి బెదరిస్తుంది. రివాల్వర్ చూచిన పనిమనిషి కిక్కురుమనకుండా దిగాలుపోయింది. గుణ, దేవకిలు అక్కడున్న కారెక్కుతారు. గుణ డ్రైవ్ చేస్తుంది. ఘూర్ఖా, సుందర్ కారని గేటు తీస్తాడు. గుణ, దేవకిలు కారులో తుర్రుమన్నారు.

## 17

పాపం! తాకుదామని కళ్ళకు గంతలు కట్టుకున్న సుందర్‌కు గోడల తాకుడుతో ముఖం పచ్చడయిపోయింది. చిరాకెత్తి కళ్ళకు గట్టిన గంత లాగేశాడు. అంతా పచ్చి మోసం! తలుపువంక చూచాడు. తలుపు మూసి వుంది. తలుపు లాగాడు; రాలేదు. పెద్దపులిలా గాండ్రించాడు; సింహ గర్జన చేశాడు. కన్ను లెర్రచేశాడు. అతని హృదయం అగ్ని కణములతో మండుచున్నది. అంతలో అక్కడున్న మనిషి వచ్చి తలుపు తీస్తుంది.

"ఏరీ! ఆ చండాలపు రండలు" మండిపోతూ గద్దించాడు సుందర్.

"నన్ను బెదిరించి కా రెక్కాపోయావు బాబూ" అంది భయపడుతూ.

అంతలో కారు డ్రైవరు సుందర్ మాటలు విని చేతిలోని సిగరెట్టు పారేసి ఆత్రుతగా వస్తాడు.

"ఇంతసేపూ ఎక్కడ చచ్చావ్ ?" అన్నాడు కన్ను లెర్రచేసి సుందర్.

"కాఫీ త్రాగటానికి వెళ్లానండి" అన్నాడు వినయంగా కారు డ్రైవరు.

"ఏడ్వలేకపోయావ్" అన్నాడు రౌద్రంతో.

"చూస్తాను...నన్ను తప్పించుకొని వాళ్లు ఎక్కడికి వెళ్తారో! వాళ్ళను నాశనం చేస్తాను. వాళ్ళ బ్రతుకులు మంట గలుపుతాను" అంటూ పళ్లు నూరాడు.

# 18

గుణ, దేవకిలు స్వగృహం చేరుకున్నారు. అంతు తెలియని గోవిందుకొరకు సుబ్బయ్యను చెంచయ్యశెట్టిగా రింటికి పంపుతారు.

దెబ్బలుతిని స్పృహతప్పి పడివున్న గోవిందు స్పృహ వచ్చిన తరువాత లేచి మెల్లగా చెంచయ్యశెట్టిగా రిల్లు చేర్తాడు. ఇంతలో సుబ్బయ్యనొకరు సాక్షాత్కరించి "గోవిందు యిక్కడున్నా వేంటి ?" అని ప్రశ్నించాడు. గోవిందు జరిగినదంతా పూసగ్రుచ్చినట్లు సుబ్బయ్యకు తెలియజేసి,

"గుణ, దేవకమ్మ లేరి ? కారు ఎక్కడ ?" అని ఆదుర్దాగా ప్రశ్నించాడు.

"ఇప్పుడే కారేసుకుని యింటికివచ్చి నిన్ను వెదకి తీసుకు రమ్మని నన్ను పంపారు. "గోవిందు ఏదుర్మార్గులు నిన్ను కొట్టారు పాపం" అంటూ జాలిపడి సుబ్బయ్య "పద యింటికి పోదాం" అని అక్కడున్న జట్కాబండినిపిలచి యిద్దరు యెక్కి యింటికి వస్తారు.

వస్తున్న గోవిందును చూచి "ఎక్కడకెళ్ళావు గోవిందు" అని ప్రశ్నించింది గుణ.

"ఏమనిచెప్పను తల్లీ ! మీరు చెంచయ్య యింటికెళ్ళిన 10 నిముషాలకు ముగ్గురు పెద్ద మనుష్యులువలె వచ్చి యీ సందులో కారు స్టార్టు కావడంలేదు కొంచెం చూద్దురురండని నన్ను తీసుకెళ్ళి ముఖానికి ముసుగేసి స్పృహలేకుండా కొట్టారు" అంటూ కన్నీరు కార్చాడు.

"నీలాగానే మేము మోసపడ్డాం" అంటూ జరిగిన విషయమంతా వివరించింది దేవకి

"ఇదంతా సుందర్ మోసమే"నని చెప్తాడు గోవిందు.

డ్రైవరు గోవిందును వాళ్ళింటిదాకా సాగనంపిరమ్మని సుబ్బయ్యను గుణ, దేవకిలు పంపుతారు, సుబ్బయ్య గోవిందును తీసుకొని జట్కాబండి యెక్కిపోతాడు.

# 19

మరునాడు ఉదయం 8 గంటలకు గుణ, దేవకిలు ఒకచోట కూర్చుని యీ విధంగా మాట్లాడుకొన్నారు.

"ఏం, చెల్లీ! యీ దుర్మార్గుడు సుందర్ ఆంబోతులా మన వెంటబడి వదలనట్టున్నాడు, మనల్ని! అందుకు మనం ఏం చేద్దాం?" అని ప్రశ్నించింది గుణ.

"తగినట్లు బుద్ధి చెప్పాలి."

"ఏ విధంగ బుద్ధి చెప్పాలా" అనేదే ప్రశ్న అంది గుణ.

"అదే నాకూ అర్థం కావటం లేదు" అని పలికింది దేవకి.

ఉభయులు ఓ పదినిముషాలపాటు ఆలోచనా నిమగ్నులయ్యారు.

"ఆఁ ... తెలిసింది" అంది గుణ ఏదో జ్ఞప్తికి వచ్చి.

"ఏంటి ... తెలిసింది?"

"బుద్ధి చెప్పే మార్గం"

"ఏం టది?"

"చెల్లీ! మనం సుందర్ కొక లేఖ వ్రాద్దాము. ఆ లేఖ చదివి బుద్ధి తెచ్చుకున్నాడా! సరే ... సరి. లేదా ... తరువాత ఏం చేయాలో ఆలోచిద్దాం." అంటుంది గుణ.

"ఏమని వ్రాద్దాము?"

"వ్రాస్తానుగా చూడు. అది నీకూ యిష్టమైతేనే పంపుదాం లేదా మానేద్దాం."

"సరే..." అంది దేవకి.

గుణ యీ విధంగా లేఖ వ్రాయసాగింది :

ప్రియమైన సుందర్ జమీందార్ నామధేయునకు —
మీకు సోదరీతుల్యులైన గుణ, దేవకిలు అనేక
నమస్కారములు గావించి, దీవించి వ్రాయు లేఖ—

మీరు చేస్తున్న దుష్టచర్యలు లోకజ్ఞానము లేని
మూర్ఖులు, మంచిచెడ్డలు తెలియని అధములు, నీతి నియమ
ములు లేని నీచులు చేస్తారు. మీరుకూడా యీ రీతిగనే
ప్రవర్తిస్తే పై చెప్పినవారితో జమకట్టవలసి వస్తుంది. మనకి
పూర్వకముగా నిన్ను మేము సోదరుడుగా భావించుతున్నాము.
నీతినియమములు గల్గిన కురూపేరలను మేము పెండ్లాడ నిశ్చ
యించుకున్నాము. మీరుకూడా ఒక అందమైన పేదపిల్లను
చూచి పెండ్లిచేసుకోవడం మంచిది. అప్పుడే దేశంలో
పేదతనం నశిస్తుంది. మీరు మా వెంటబడి ఆబోతుగిత్తలా
తిరుగుట మీ కది యేమంత యోగ్యమైన పద్ధతి కాదు.
నిన్న సాయంత్రం మా డ్రైవరు గోవిందును స్పృహ లేకుండా
రౌడీలచేత కొట్టించడం, మమ్ములను మోసగించి మీ బంగళాకు
చేర్చుకొని బాధించటం మీలాంటి పెద్ద మనిషికి తగనిపని.
ఇక యిటువంటి పను లెన్నడూ తలపెట్టక మమ్ము సోదరీ
భావంతో చూస్తారని తలుస్తాం.

ఇట్లు,
*గుణ, దేవకి.*

గుణ, దేవకిలు ఆ వుత్తరం సుందర్‌కు పంపుటకు అంగీక
రించి సుబ్బయ్యనౌకరును పిలచారు. సుబ్బయ్య వచ్చాడు.
వ్రాసిన వుత్తరం ఒక కవరులో భద్రపరచి సుబ్బయ్య చేతికిచ్చి

"జాగ్రత్తగా గొనిపోయి సుందర్ జమీందార్ గారికి అంద జేయాలి. ఉత్తరం చూచిన సుందర్ ముఖం ఏ విధంగా పరిణ మిస్తుందో, అతను ఏమని పలుకుతాడో, సరిగ్గా పరికించి అతనేమి సమాధాన మిస్తాడో! తెలుసుకొనిరావాలి సుమా" అని చెప్పి సుబ్బయ్యను పంపాను.

# 20

సుబ్బయ్య ఉత్తరం తీసుకుని తిన్నగా సుందర్ జమీందార్ బంగళాదగ్గరకు వచ్చాడు. సోఫాలో పడుకొని సిగరెట్టు వెలిగిస్తూ ఆలోచనానిమగ్నుడైన సుందర్ దగ్గరకు వచ్చి "దండాలు జమీందార్ గారు" అన్నాడు సవినయంగా.

సుబ్బయ్యను చూచి సుందర్ ఆశ్చర్యపోతాడు. సుబ్బయ్య చేతిలోవున్న వుత్తరం సుందర్ కు యిస్తాడు. సుందర్ అది తీసుకొని చదువుతాడు. అతని ముఖంలో రౌద్రం చెల రేగుతుంది. దెబ్బతిన్న కోడెత్రాచులా బుస్ మంటూ లేచి ఉత్తరాన్ని విసరి నేల కేసికొట్టాడు. "సోదరీలుగా భావించాలా? ఒక పేదపిల్లను నేను పెండ్లిచేసుకోవాలా? ఎంత అహంకారం పీళ్ళకి. చూస్తాను. నేను తలచుకుంటే వేలకు వేలు అందాల చందమామలాంటి చక్కటి పడుచుపిల్లలు నా కాళ్ళ ముందు వచ్చి వాల్తారు. నేను చేసుకోవాలంటే మా నాన్న గారు చెప్పిన ఇంగ్లండ్ గొప్పింటి అమ్మాయినే వివాహం చేసి కుంటాను. మాది జమీందార్ కుటుంబం. గుణ, దేవకిలది జమీందార్ కుటుంబమనే దృష్టితో వారికై నే నాశించాను.

కాని వాళ్లకన్న అందకత్తెలు లేరని కాదు. వారి నీతి ప్రబోధ నలు నా కవశ్యకములు కావు" అని సుబ్బయ్యను తిట్టి ఆ వృత్త రాన్ని రెండు ముక్కలుచేసి అతనికిచ్చి, "యిది తీసుకుపో" అని సుబ్బయ్యను కసిరాడు. భయపడ్డ సుబ్బయ్య వెనక్కు తిరిగి చూడకుండా, నేరుగా యింటికి వస్తాడు.

సుబ్బయ్య రాకకై వేచియున్న గుణ, దేవకిలు అతను రాగానే "ఏమి జరిగింది ?" అని ఆమద్దాగా ప్రశ్నించారు.

అక్కడ జరిగిన వృత్తాంతమంతా చెప్పి వృత్తరాన్ని యిచ్చివేస్తాడు.

"అతని మూర్ఖత్వం యింకా నశించలేదు. పశువు కన్నా నీచంగా ప్రవర్తించే ఆ నరపశువుకే రీతిగానైనా బుద్ధి నేర్పాలి. ఇకనుండి మనం చాలా నేర్పుగా ప్రవర్తించాలి" అని గుణ, దేవకిలు ఆలోచించుకుంటారు.

# 21

అది సాయంకాలసమయం. పక్షులు తమ తమ గూళ్ళకు చేరుకుంటున్నాయి. వివిధ పక్షుల బారులతో ఆకాశవీధి కళకళ లాడుతోంది. కష్టజీవులు తమ తమ పనులు చాలించి గృహాలకు తిరిగి వస్తున్నారు. పడుచుపిల్లలు కూని రాగాలు పాడుకుంటూ చిన్నారి నవ్వులతో యిళ్ళకు చేరు కుంటున్నారు. పశువులు తమ పిల్లలకై ఆతృతతో నెమరు

వేయుచు వస్తున్నాయి. సూర్యుడు అస్తమించాడు. లోక మంతా చీకటిమయ మయింది.

సుబ్బయ్య రాత్రికి వంట ప్రారంభించాడు. అంతలో దేవకి వచ్చి "సుబ్బన్నా! యీ రాత్రి మనింటికి నా స్నేహితు రాలు వస్తుంది. ఆమెకు కూడా భోజనం సిద్ధం చేయి" అంటుంది. సుబ్బయ్య "సరే" నంటాడు. దేవకి వెళ్ళిపోతుంది. సుబ్బయ్య యథావిధిగా గుణకు జొన్న సంగటి, తక్కినవారికి వరి అన్నం తయారు చేశాడు. ఏదో! పనిమీద వంట గదిలోనుండి వెళ్ళిన సుబ్బయ్యను కనిపెట్టి, దేవకి వంటగదిలో ప్రవేశించి గుణకని ప్రత్యేకముగా వండిన జొన్న సంగటిని వీధిలో నున్న ముష్టివానికి వేస్తుంది. ఆ విధంగా చేశానని దేవకి లోలోన సంతోషిస్తుంది. "ఈ రాత్రి ఏ విధంగానైనా మా అక్కచేత యీ వరి అన్నం భుజింపచేయాలి" అని అనుకుంటూ, అమితానందంతో తన గదిలోకి వెళ్ళిపోతుంది.

సుబ్బయ్య వంట యింటిలోకి వచ్చి ఖాళీగా వున్న జొన్న సంగటి తపాళా చూస్తాడు. తిన్నగా గుణదగ్గరకు వచ్చి "ఏమమ్మా గుణమ్మా మీరు భోంచేశారా?" అని ప్రశ్నించాడు.

"లేదు" అంటుంది గుణ.

"మీకని వండిన జొన్న సంగటి మాయమయింది గుణమ్మా" అన్నాడు ఆతృతగా.

"ఏమైయుంటుంది?" అని ఆలోచనలో పడింది.

"'ఈపూట మనింటికి ఎవరో స్నేహితురాలు వస్తుంది మరింత భోజనం చేయ'మని మన చెల్లెమ్మ చెప్పింది. అందు

కని మరింత భోజనం చేసేను. అది తినండమ్మా" అన్నాడు సుబ్బయ్య.

"ఇది అంతా దేవకి పన్నిన తంత్రం. నా చేత జొన్న సంగటి తిననీయకుండా చేసి, వరి అన్నం తినిపింపచేయాలని చేసి వుంటుంది" అని తనలో తలుచుకొని వూరుకుంది.

"మీకు మళ్ళీ వంట చేస్తానమ్మా" అని పోబోతాడు సుబ్బయ్య.

"వద్దు సుబ్బన్నా."

"ఎంతసేపమ్మా పావుగంటలో వండేస్తాను."

"చేయవద్దు సుబ్బన్నా" అని గట్టిగా పలికింది. మారు మాటాడక నోరు మూసుకుని మరీ పోతాడు సుబ్బయ్యనోకడు.

పదినిముషాలు గతించిన తరువాత, గుణ దగ్గరకు వచ్చిన దేవకి "భోజనం చేయడానికి రా అక్కా—" అంటుంది.

"నాకు ఆకలిలేదు చెల్లీ; కడుపు నొప్పిగావుంది" అని జవాబిచ్చింది గుణ.

"రా అక్కా—, భోంచేద్దాం" అని మొండిపట్టుపట్టి బ్రతిమాలింది దేవకి.

"నాకు ఆకలిగాలేదు. కడుపులో నొప్పిగావుంది. ఫరవాలేదు. నీవు భోంచేయి" అని మరింత విసుగ్గా బదులిస్తుంది.

"పోనీ......కొంచెమన్నా తిందువుగాని రా" అని బ్రతిమాలుతుంది.

ఎంత బ్రతిమాలినా గుణ రా నంటుంది. బ్రతిమాలి ప్రయోజనం లేదని గమనించిన దేవకి, సుబ్బయ్యను పిలచి "గుణకు నీవైనా చెప్పి భోజనంచేయడానికి ఒప్పించు" అంది.

"లాభం లేదమ్మా!" అంటాడు సుబ్బయ్య.

"అక్కా! అయితే జింజర్ తెప్పించనా?" అని నయంగా అడుగుతుంది.

"నా కేమీ వద్దు. మీరు భోంచేయండి" అని సుదుతుంది.

సుబ్బయ్యచేత జింజర్ తెప్పించి అక్కను త్రాగమని బతిమాలి, తుదకు గుణచేత అది త్రాగించి తృప్తిచెందాక దేవకి, సుబ్బయ్యలు భోజనాలకు వెళ్లిపోతారు.

ఆ రాత్రి దేవకి పడకపై పరుండి గుణ ప్రవర్తనగూర్చి తదేకదృష్టితో ఆలోచిస్తూ నిదురపోయింది. అలా దేవకి నిద్రపోతూ ఒక చక్కని కల కంటుంది.

# 22

వీరసింహు డనే రాజు ఒక రాజ్యాన్ని పరిపాలిస్తుంటాడు. ఆ రాజు ప్రజలను కన్నబిడ్డలవలె ఆదరించి, ప్రేమించి, ప్రజల కష్టాలు తన కష్టాలుగా భావించి, ప్రజాదరణ పొందుతూ రాజ్య పరిపాలన చేస్తూవుంటాడు. ఆ రాజ్యము రామరాజ్యమై సకల సిరిసంపదలతోను, పాడిపంటలతోను శోభిల్లుచున్నది.

అట్టి తరి వున్నట్టుండి ఒక్కుమ్మడిగా అడవి మృగములు ఆ రాజ్యములో జొరబడి ప్రజలను, పంటలను నాశనం చేస్తున్నాయి. మహా భయంకర మృగముల అరుపులకు దిక్కులు మారుమ్రోగుతున్నాయి. ప్రజలు ఆ భీభత్సం భరించలేక

వీరసింహ మహారాజునకు మొరపెట్టుకొనగా, రాజు తన ముద్దు బిడ్డలైన జయసింహుని విజయసింహుని పిలుస్తాడు.

"రాజ కుమారులారా! మన రాజ్యమున అడవి మృగములు చొచ్చి ప్రజలను, పంటలను నానారీతుల నాశనము చేస్తున్నాయి. ప్రజలు అష్ట కష్టాలతో అల్లాడిపోతున్నారు. మీరు తక్షణమే పెద్ద సైన్యమును గైకొని అడవి మృగములను తరిమికొట్టి ప్రజలను రక్షించండి" అని చెప్పి దీవించి పంపుతాడు.

తండ్రియాజ్ఞ ప్రకారము జయ, విజయసింహులు అడవి మృగములను వేటాడ బయలుదేరుతారు. జయసింహ కొంత సైన్యం తీసికొని ఉత్తరదిక్కుకు పోతాడు. విజయసింహ కొంత సైన్యంతో దక్షిణదిక్కుకు పోతాడు. జయసింహ, విజయసింహులు ఆయా ప్రదేశములందున్న అడవిమృగాలను వేటాడుతుంటారు.

జయసింహ వేటాడి వేటాడి ఒక క్రూరమృగమును వెంటాడి తరుముకుంటూ గుట్టలు మిట్టలు దాటి వస్తాడు. తుదకు ఆ మృగాన్ని సంహరించి తిరుగుముఖం పట్టాడు. అతని శరీరం అలసిపోయింది. నీరసించిపోయాడు. నడువలేక పోయాడు. దాహమై నీరులేక నాలుక ఎండిపోయింది. ఇన్ని బాధలతో జయసింహ స్పృహలేక ఒకచోట దారిలో పడి పోయాడు.

అదే మార్గమున చింపిరిగుడ్డలు ధరించి, కట్టెలు నెత్తిన బెట్టుకుని గుణ వస్తుంది. అక్కడ పడివున్న రాజకుమారుని చూచి ఆందోళపడుతూ అతని దగ్గరకెళ్ళి ముక్కువద్ద చేయి

పెట్టి శ్వాసవున్నదా, లేదా? అని పరీక్షించింది. శ్వాస వున్నదని గ్రహించి, గుణ తటాలున లేచి తటాకమునకెళ్ళి తామరాకులో నీరు తెచ్చి అతని ముఖంపై చిలికించి, కొంచెం నీరు నోటిలో పోస్తుంది. గుణ జయసింహుని కురులను, మోమును దువ్వుతుండగా తెలివివచ్చిన రాజకుమారుడు లేస్తూ గుణ చేతిని తెలియనిరీతిగా పట్టుకుంటాడు. గుణ సిగ్గుతో తలవంచుకుని చేయి లాక్కుంటుంది.

"ఎవరమ్మా! నీవు? నా ప్రాణాన్ని రక్షించావు" అని ఆశ్చర్యంగా ప్రశ్నించాడు జయసింహ.

పండువంటి ఆమె శరీరం పులకరింప సిగ్గుతో లేచి వెళ్లి ప్రక్కనున్న జామిచెట్టు ఫలాన్ని కోసి రాజకుమారునికి తెచ్చియిస్తుంది.

ఆమె జాలిహృదయానికి, అతఃపైగల ఆమె ప్రేమాను రాగాలకు జయసింహ ముగ్ధుడైపోతాడు.

"ఎవరమ్మాయి, నీవు?" అని ప్రశ్నించాడు మైమరచిన హృదయంతో.

"ఈ అడవిప్రక్క గ్రామంలో నివసించే పేదరాలిని. కట్టెలు కొట్టుకొని పోదామని యిటువచ్చాను" అంది వినయంగా గుణ.

ఆమె అందానికి రాజు మనసు లొంగిపోయింది. పరువముతో పులకరించే ఆమె తారుణ లావణ్యములకు దాసుడయ్యాడు.

"నాకు ప్రాణదాన మొసంగిన సౌభాగ్యసుందరీ! నీ సహాయమును నే మరువలేను. నీ మహోపకారమే నన్ను

పునర్జన్ముని గావించినది” అని తనలోని ఆనందాన్ని వ్యక్త పరుస్తాడు.

ఆ మాటలకు గుణ “రాజకుమారా! యిదికూడా మహోపకారమా?” అని ఆశ్చర్యంగా, సిగ్గుగా పలుకుతుంది.

జయసింహ నవ్వాడు.

“సుందరీ! నీ పేరేమి?”

“గుణ!”

“పేరుకు తగిన సుగుణవతివి. నీ అనురాగలతలు నా హృదయ బంధీకృతులు. నీ జాలిచూపులే నా ప్రాణ రక్షణ కాపులు. నీ సౌభాగ్య రూపు రేఖలే నా హృదయ దీపికలు” అని మైమరచిన హృదయంతో పలికాడు జయసింహ.

అతని మాటలకు గుణ ముఖంలో సిగ్గు, బిడియములు నాట్యమాడుతున్నాయి. ఏదో! చెప్పాలనుకుంటుంది కాని చెప్పలేక దూరంగాపోయి చెట్టుకొమ్మను పట్టుకుని నిలబడింది.

జయసింహ ఆమె చెంతకేగి “గుణా!” అని ఆప్యా యంగా పిలిచాడు.

“ఏమి?” అన్నట్లు చూసింది.

“నీకు వివాహమయిందా?”

‘లేదు’

ఆమాటకు అతని హృదయం సంతసించింది.

గుణా నేనీదేశపు రాజకుమారుడను. నాపేరు జయ సింహ! నిన్ను గాంచినతోడనే మనసార ప్రేమించితిని. నా హృదయము నీకర్పించితి. నీవే నాప్రాణము. నిన్ను పరి ణయమాడ నిర్ణయించు కున్నాను” అంటాడు.

"అదేమిటి రాజకుమారా! నేను పేదింటిపడుచును. మీరు రాజవంశమున జన్మించిన యువరాజువు. నన్ను పెండ్లాడుటకు మీ తండ్రి సమ్మతించునా?" అని ప్రశ్నిస్తుంది.

"పేదతనం...పెద్దతనం...అని యోచించుటే పెద్ద తప్పుతనం. గుణా! పెండ్లాడవలసింది నేను. కనుక తండ్రి యిష్ట పడవలసినంత పనేముంది? నేను యిష్టపడ్డాను. చేసుకుంటాను" అన్నాడు.

"రాజకుమారా! కనిపెంచిన తలిదండ్రులను తిరస్కరించుట భావ్యము కాదుగదా!" అంది గుణ.

"గుణా! తప్పుడుపనులుచేసి తలిదండ్రుల ,తిరస్కరించుట అధర్మముకాని, మంచినే కాదను తలిదండ్రులను తిరస్కరించుట ధర్మము. కూలికిలేని పేదదానవే, కాని నీవు అంద చందములకు తీసిపోని అందాలరాశివి. మసిపూసిన మాణిక్య రూపవతివి. నా ప్రాణమును రక్షించిన ప్రేమమూర్తివి. అటు వంటి నిన్ను పరిణయమాడుటకు నా తండ్రి తప్పక అంగీక రిస్తాడు" అని ప్రేమపూర్వకంగా పలికాడు యువరాజు.

"ఏమో! యువరాజా! పెద్దవారిమాటలు పయోముఖ విషకుంభం లాంటివి." అంటుంది జాలిగా గుణ.

"గుణా! ఆకాశవాణిసాక్షిగా, భూదేవి సాక్షిగా నా తలిదండ్రులు యిష్టపడకపోయినను తప్పక నిన్ను నేను వివాహ మాడెదను. నిన్నుదప్ప నా ప్రాణమున్నంతవరకు పరులను పరిణయమాడను" అని గుణచేతిలో చేయివేస్తాడు జయసింహ.

గుణ జయసింహను పెండ్లాడుటకు యిష్టపడుతుంది. ఆమె హృదయం పరమానందంతో నిండిపోయింది. గుణ

జయసింహుల రెండు హృదయాలేకమై చిలిపిచేష్టలు పురికొల్పు చుండ చిలుకా గోరింకలవలె వారిరువురు ముద్దుముచ్చటలు తీర్చుకొనుచు నడక సాగించారు. తాళాలు ప్రమాదవశాత్తు తళతళ లాడుతూ వస్తున్న గుణ, జయసింహులను దూరాన వున్న విజయసింహుడు చూచి మూర్ఛిల్లి కొంత తడవకు లేచి చూచాడు. వస్తున్నది తన సోదరుడు జయసింహుడని గుర్తిం చాడు. పరమానందంతో అన్నను యెదుర్కొన్నాడు.

"అన్నా! నీకోసం చూచి నా కళ్లు కాయలు కాచాయి. ఇంతకాలం నీ వెక్కడున్నావు? ఈమె యెవరు?" అని ప్రశ్నించాడు తమ్ముడు.

"ఈ సుందరి నా ప్రాణాన్ని కాపాడి నన్ను పునర్జన్మునిగా చేసిన పుణ్యశాలి" అంటూ జరిగిన కథంతా చెప్తాడు.

"అయితే ఏదైనా బహుమానమిచ్చి పంపక పట్టు కొస్తున్నావేమి?" అని ప్రశ్నించాడు విజయసింహ.

"పెండ్లి చేసుకోడానికి."

"నీ కేమైనా మతిచలించిందా?"

"కాదు. మనసు కలిగింది."

"పొరబడుతున్నావు అన్నయ్యా!"

"పొరబడుటలేదు తమ్ముడూ! పురుడుతో పుట్టిన బుద్ధితో చెప్తున్నా. ఈమెను మనసార ప్రేమించాను; పెండ్లి చేసుకుంటాను. ఇది నా ధర్మము తమ్ముడూ."

"కాదు. కరుడు కట్టిన నీ కఠిన మనసును మంచి మార్గంలోనికి మరలించుకొనుట ధర్మములలోనికెల్ల పెద్ద ధర్మమన్నా" అన్నాడు కొంచెం కఠినంగా.

"తమ్ముడూ......చాలించు నీ మాటలు" కోపంతో అన్నాడు జయసింహ.

"కాకపోతే...కులం, గోత్రం తెలియని ఒక పేదపిల్లను పెండ్లి చేసుకుంటావా? రాజవంశమున జన్మించిన రాజకుమారుడవు! వచ్చిన రాజకుమార్తెను పరిణయమాడవలెగాని పేదదాన్ని చేసుకుంటానంటావేమి?"

"కులం...గోత్రం...! ఎక్కడి నుండి వచ్చిపడ్డాయి తమ్ముడూ యీ కుల గోత్రాలు?"

"మన పెద్దలు నిర్ణయించినవి!"

"అవి నిర్ణయించిన వారు పెద్దలుకాదు. శుద్ధ మొద్దులు" అన్నాడు ఆగ్రహంతో జయసింహ.

ఇద్దరూ యీ విధంగా వాదనలాడుకుంటున్నారు. గుణ నిశ్చేష్టురాలై వారివంక చూస్తుంది. అన్నయ్యతో మాట్లాడి ప్రయోజనం లేదని విజయసింహ గుర్తించి గుణవంక చూచి,

"ఇదిగో! ఓ పిల్లా! నా అన్నప్రాణాలు రక్షించి నందులకు యీ హారము తీసికొనివెళ్ళు" అని మెడలోని హారం తీసి యివ్వబోతాడు.

"మీ బహుమతి నా కక్కరలేదు." అని చిన్నబోయిన ముఖంతో దూరంగా పోతుంది. విజయసింహ ఆమె తిరస్కారానికి మండిపోతాడు.

"ఏమే కులహీనురాలా! నా అన్నను మోసగించిన మాయలాడి!" అని మొలనున్న ఖడ్గము లాగి "ఆ బహుమానము అక్కరలేకపోతే యీ బహుమానం పుచ్చుకో" అని కత్తి యెత్తి గుణ మీదకు దూకబోతున్న తమ్ముని ఆపి,

"ఓరీ! పోగొట్టుకోబోతా! గుణ మీదకు వెళ్ళావో ముందు నీ ప్రాణాలు దక్కవు" అని హెచ్చరించాడు జయ సింహా.

"నా కష్టురాకు! యిటువంటి కులటలను హతమార్చాల్సిందే కాని విడువరాదు" అని అన్నను ప్రక్కకు నెట్టాడు విజయసింహా.

ప్రక్కకు నెట్టగా జయసింహునికి పట్టరాని కోపం వచ్చింది. పళ్ళు పట పట నూరాడు. సింహగర్జన చేసాడు. మొలనున్న కత్తి లాగి తమ్ముని మీదికి దుమికాడు. అరగంటకు పైగా అన్న దమ్ములు హోరా హోరీగా యుద్ధం చేశారు. గుణ ఆ కత్తుల మెరుపులకు మూర్ఛిల్లింది. విజయ సింహుని కత్తి రెండు ముక్కలై క్రింద పడింది. జయసింహుడు సింహగర్జనతో తమ్మునిపై దూకి అతని రొమ్ములపై కూర్చుని కత్తి యెత్తాడు. కాని కత్తి అక్కడే ఆగిపోయింది. ఏమిదని చూచిన జయసింహుకు కత్తిని పట్టుకున్న గుణ కనిపించింది.

"మీరు మీ తమ్ముని చంపినట్లైతే నన్ను మీరు వివాహమాడుట దుర్లభం" అంటుంది అతి జాలిగా గుణ.

గుణ దయార్ద్ర హృదయమునకు సంతసించినవాడై తమ్ముని గుండెలమీద నుంచి లేస్తాడు. సందు చిక్కిన తమ్ముడు తిరిగి చూడకుండా తలవంచుకొని వెళ్ళిపోతాడు.

అలా వెళుతున్న విజయసింహను జాలిగాచూస్తూ గుణ, జయసింహులు రాజనగరానికి వస్తుంటారు.

పరధ్యాన్నంగా పోతున్న విజయసింహా అలసిపోయిన శరీరంతో ఒక కొండయెక్కి దిగబోతూ కాలుజారి పడి

పోస్తుతూ క్రిందనున్న చిన్న గోతిలో పడిపోతాడు. ముఖం, చేతులు, కాళ్ళు, శరీరం పచ్చడయిపోయింది. కొండ కెళ్ళిన దేవకికి అతను కనిపిస్తాడు. దేవకి అతనిదగ్గర కెళ్ళి శరీరాన్ని కదుపుతుంది. అలా కదపగా చిన్న మూలుగు వినిపిస్తుంది. అప్పుడు దేవకి అతనిని లేవదీసి అతి కష్టంతో మోసుకొని యింటికి తీసుకెళ్తుంది. తగిన వుపచారములు చేస్తూ విజయ సింహ ప్రక్క కూర్చొని అతని ముఖమువంకే చూస్తుంది. విజయసింహునికి స్పృహవచ్చి కన్నులు తెరచి తేరి పార చూస్తాడు. అప్పుడు దేవకి ముఖం వికసించింది. శరీరం పులకరించింది. ఆప్యాయంగా అతనివంకే చూస్తూ మైమరచి పోయింది. విజయసింహ దేవకి చేయిపట్టుకొని "చిన్నదానా! నా ప్రాణము కాపాడిన నాపాలిటి భాగ్యదేవతవు. నీవు లేకున్న నా ప్రాణములు యముని లిస్టులో దాఖలు చేయబడి వుండవలసిందే! నీ వెవరివి సుందరీ?" అని ప్రశ్నించాడు ఆప్యాయంగా!

"నేను దిక్కులేని ఒక అనాధను" అంది జాలిగా దేవకి.

"నీ పేరేమి?"

"దేవకి"

"దేవకన్యల మరపించు నా దేవకీ! నా. హృదయ సాక్షిగా నిన్ను పరిణయమాడ ప్రమాణము చేయుచున్నాను. నీవు సమ్మతిస్తావా?"

"నాకు అంత అదృష్టమా?"

"ప్రియసుందరీ సంకోచించనేల సంతోషింపుము. నేను రాజకుమారుడనే కావచ్చుగాక, నీవొక అనాధవేయగుగాక

మన చూపులు, మనసులు కలసిపోయినవి. వాని విడదీయ మానవుల తరముకాదు.

దేవకి హృదయం పుత్సాహంతో పొంగిపోయింది. విజయసింహ దేవకిని తన చెంతకు చేర్చుకుంటాడు.

జయసింహ, గుణను తోడ్కొని రాజదర్బారులో వున్న తండ్రి దగ్గరకు వస్తాడు. అతనిని చూచి తండ్రి "తమ్ముడెక్కడ" అని ప్రశ్నిస్తాడు.

"వెనక వస్తున్నాడు నాన్నా" అంటాడు. అతని వెంట నున్న గుణను చూచి "ఈ చిన్నది యెవరు?" అని ప్రశ్నించాడు తండ్రి.

"నా ప్రాణాలు రక్షించిన భాగ్యదేవత. ఈమెను పెండ్లిచేసికొనుటకు తోడ్కొనివచ్చితిని" అన్నాడు జయసింహ.

"ఈ చిన్నదాని కులజాతు లేమి?"

"కులము పేదకులము; జాతి...స్త్రీ జాతి" అని చమత్కారముగా జవాబిచ్చాడు జయసింహ.

ఆ మాటలకు తండ్రి మండిపోయాడు. "దిక్కులేని పేదదాన్ని చేసుకొని మన వంశమర్యాదలు మంటగలిపి నన్ను అపనిందల పాలుచేస్తావా!" అని దూషిస్తాడు తండ్రి. జయసింహ తండ్రి మాటలు సరకుచేయడు.

సరకుచేయని కుమారుని చూచి "ఇక చిలిపిచేష్టలు మాని, ఆ పేదదానికి తగిన బహుమతి నిచ్చి పంపుము" అని చెప్తాడు తండ్రి.

ఆమెనే పెండ్లి చేసుకోవాలని మొండిపట్టుపట్టాడు జయసింహ.

"అట్లయిన తక్షణమే నీవు నా రాజ్యము వదలి పొమ్ము. నీ ముఖం చూడను. నా రాజ్యమున నుండతగదు నీ యట్టి మూఢచిత్తుడు. నా సర్వరాజ్యమును విజయసింహునికే యిస్తాను. వాడినే రాజ్యపట్టాభిషిక్తుని చేస్తాను. పెద్దవాడు చచ్చాడని అనుకుంటాను. ఊం... వెళ్ళిపో..." అని వీర సింహా గద్దించాడు.

తండ్రి యాజ్ఞ ప్రకారము గుణను తీసికొని జయసింహా రాజ్యం విడచి పోతుంటాడు. మార్గ మధ్యమందు విజయ సింహా దేవకిని తీసికొని ఎదురౌతాడు. అన్నను చూచిన విజయసింహా,

"అన్నా!" అని ఆలింగనం చేసుకుంటాడు. జయ సింహా చాల సంతోషించి ఆదరిస్తాడు. తమ్ముడు జరిగిన వృదంతం అన్నకు చెప్తుంటాడు. ఇంతలో అక్కచెల్లెళ్ళు అయిన గుణ దేవకీలు వారి అదృష్టాన్ని గురించి ముచ్చటించుకుంటారు. గుణ దేవకిలు అక్కచెల్లెళ్ళని గమనించిన జయ విజయ సింహులు వుత్సాహ హృదయులౌతారు.

తదుపరి తండ్రిగారు చెప్పిన మాటలు తమ్ముని కెరి గించి విచారపోతాడు జయసింహా. "అయితే నీ విక్కడే వుండు. నేను తండ్రిని ఒప్పించుకొని వస్తాను" అని దేవకిని తీసుకొనిపోతాడు.

దేవకిని వెంటబెట్టుకొని వస్తున్న విజయసింహాను చూసి "నీ కేం వచ్చింది" అని గాణిగాడు తండ్రి.

"ఈ సుందరి ఒక అనాధ బాలిక. పేదింటి బిడ్డ. నన్ను రక్షించిన ప్రేమమూర్తి. ఈ సుందరీరత్నమునే నేను

పెండ్లాడ నిశ్చయించుకొంటిని..." అని యింకా ఏమో చెప్పబో తున్నాడు విజయసింహ.

అప్పటికే ఆవేశపూరితుడైన రాజు మరింత మండిపడి "చాలించు..." అని గద్దిస్తాడు. "అన్నకు పట్టిన గతే నీకూ పట్టింది. మీరు నా పుత్రులు కారు, పరమ శత్రువులు. నీ ముఖం చూపకు. పో..." అంటాడు.

మారు మాటాడక దేవకిని తైకొని, విజయసింహ అన్న దగ్గరకు వస్తాడు. జరిగిన కథ వివరిస్తాడు.

"పదన్నా! ప్రపంచంలో ఎంతమంది పగలు రాత్రులు కష్టించి జీవించుట లేదూ!...అలాగే మనం బ్రతుకుదాం" అంటాడు జయసింహ.

"సత్యం పలికావు తమ్ముడూ. అంతే, పద వెళ్దాం" అని అంటాడు జయసింహ.

ఈ విధంగా నలుగురూ సంతోషంగా నడక సాగించారు.

వీరసింహ, పుత్రులు పోయారన్న దిగులుతో నీరసించి పోయాడు. కొద్ది రోజుల్లోనే మంచంపట్టిన తండ్రి, కుమారుల్ని వెదకి తీసుకురమ్మని భటుల్ని పంపాడు.

భటులు జయ విజయసింహుల్ని వెదకి తీసుకొస్తారు. తండ్రి వారిని చూచి సంతోషించి, జయసింహ విజయసింహులకు గుణ దేవకిల నిచ్చి మహా వైభవోపేతంగా వివాహం చేస్తాడు.

"అక్కా" అని కలవరించి కలనుండి మేల్కొంటుంది దేవకి.

# 23

కొక్కొరో కో! యని కోడి కూసింది. దేశాన్ని ఆవరించిన చీకటిని చీల్చుకుంటూ వెలుగుకిరణాలు దేశమంతటా వ్యాపించాయి. అమ్మలక్కలు వాకిళ్ళను చిమ్మి కళ్ళాపి చల్లి ముగ్గులతో వాకిళ్ళ నలంకరించిరి. కా...కా యంటూ కాకులు అరుస్తున్నాయి. తెల్లవారింది. పడకనుండి లేచిన దేవకి కిన్నగా గుణ దగ్గరకు వస్తుంది.

"అక్కా! నీ కెంత ద్రోహం చేశాను. రాత్రి నీవు వుపవాసం చేయడానికి నేనే కారణం. నీకు వండిన జొన్న సంగటి ముష్టివాడికి వేశాను. నే నెంత పాపిష్టిదానను" అని అంటుంది.

"నీవు చేసిన పని చాలా మంచిపని చెల్లీ! వస్తులతో పడివుండే పేదవారి కష్టాలు రాత్రి నే చేసిన వుపవాసంతో నాకు అనుభవం కలిగింది. పేదవారి కష్టాలు తెలిసికొనుట కిది యొక మార్గమయ్యింది చెల్లీ!" అంది గుణ.

దేవకి రాత్రి ఆమెకు కల్గిన స్వప్న వృత్తాంతమంతయు విప్పి చెప్పింది.

"అక్కా! మన మిద్దరం ఒక కడుపున జన్మించిన అన్న దమ్ములనే వివాహం చేసుకుందాం. నీ వేమి చేస్తావో నే నదే చేస్తాను. నీ మాట జవదాటను" అంటుంది దేవకి.

"అదేమిటి చెల్లీ! నీకు నాన్నగారు మంచి సంబంధం చూసిరావడానికి విజయనగరం వెళ్ళారుగదా! నా మాదిరి

నీవు చేస్తే నేనే నీకు నేర్పా నని నాన్న నన్ను దూషించడా !" అని ఆశ్చర్యంగా అడిగింది గుణ.

"అక్కా ! నీవు వేయి చెప్పినా నా చెవి కెక్కదు. మన మిద్దరం ఒకే గర్భమున పుట్టిన అన్నదమ్ములై పేదవాళ్లుగా జీవించేవారి నే వివాహమాడితే యిల్లరికం తెచ్చుకొని మన యింట్లోనే వుందాం. మన ఆస్తి మనకు దక్కుతుంది. దానితో హాయిగా జీవించవచ్చు" అని సంతోషం వెలి బుచ్చింది దేవకి.

"నీ ఆలోచన సరిగానేవుంది. కాని మన నాన్న దీనికి అంగీకరించడు గదా !" అంది గుణ.

"నేను నాన్నను ఒప్పిస్తే సరి" అని అంటుంది దేవకి.

"ఒప్పుకుంటాడా ?" అని ప్రశ్నించింది గుణ.

"ఒప్పుకుంటాడో, తప్పుకుంటాడో ! చూస్తావుగా" అంది నవ్వుతూ దేవకి.

# 24

అంతలో రాజు జమీందార్, రామయ్య విజయనగరం నుండి తిరిగి వస్తారు. రాజు గుణదేవకిలను సంతోషంతో పిలుస్తూనే దేవకి వద్దకు వచ్చి "అమ్మా దేవకీ ! నీవు చాల అదృష్టవంతురాలవు" అని నవ్వుతూ తల దువ్వుతాడు రాజు.

దేవకి సుబ్బయ్యను పిలచి "నాన్నగారు వూరి నుండి వచ్చారు స్నానానికి యేర్పాటు చేయ"మంటుంది. స్నానానికి

యేర్పాటు చేసిన సుబ్బయ్య స్నానానికి రమ్మని రాజు జమీందార్‌ను పిలుస్తాడు. స్నానానికి వెళ్తున్న రాజును చూచి "బావా! నేను యింటికి వెళ్తాను. భోజనాలన్నీ పూర్తయాక శుభవార్త సావధానంగా అమ్మాయిలకు వినిపించు." అంటాడు రామయ్య.

"అలాగే బావా" అంటాడు రాజు.

రాజు స్నానం చేసి భోజనం చేసాడు. కొంతకాలం విశ్రమించిన తదుపరి గుణ దేవకిలను యిరు ప్రక్కల కూర్చుండబెట్టుకొని మందహాసమును చిందించుచూ,

"గుణా!...నీ చెల్లికి చూసిన సంబంధం మంచిదంటే నమ్మ. దేవకికి చూసి నతగాడు జడ్జి పని చేస్తున్నాడు. మన కన్న ఎక్కువ గౌర మర్యాదలు గల్గిన కుటుంబం. ఆస్థిపాస్తులా! మన కనుకూలంగానే యున్నవి. దేవకిని యీ సంబంధాని కివ్వడానికి ఒప్పుకొచ్చాను. అదే నగరంలో జిల్లా కలక్టరుగా వుద్యోగం చేస్తున్నాడు. అతను చాల అందగాడు, మంచివాడు, నీవు సరే అంటే ఆ సంబంధం నీకు కుదుర్చుకొస్తాను" అని ముసి ముసిగా నవ్వుతుంటాడు. ఆ మాటలు వింటున్న గుణ కోడెత్రాచువలె బుస్ మంటూ లేచి "నా కక్కర్లేదు" అని చిరాకుగా వెళ్ళి దూరంగా కూర్చుంది.

అంతావిన్న దేవకి వాడిపోయిన లేత మొగ్గవలె దిగాలుపోయి కూర్చుంది.

విచారంగావున్న దేవకిని చూచి "ఏమిటమ్మా దిగులుగా వున్నావు" అంటాడు ఆప్యాయంగా రాజు. ఆమాటవిన్న దేవకి రెండు చేతులతో ముఖాన్ని కప్పుకొని ఏడ్చింది.

"ఎందుకు తల్లీ ! ఏడుస్తావు !" అని ముఖానికి కప్పు కొనిన చేతులు తీస్తాడు.

"నాన్నా ! నేను ఒక విషయం చెప్తాను, కోప్పడతా రేమో !" అని అంది.

"లేదమ్మా ! చెప్పు తల్లీ" అంటాడు ఆతృతగా.

కొంచెం ధైర్యం తెచ్చుకొన్న దేవకి తండ్రి వంకా, అక్కవంకా ఒక సారి చూచి,

"నాన్నా! మీరు నాకు కుదుర్చుకొనివచ్చిన సంబంధం ఏమాత్రం యిష్టంలేదు." అంది నిక్కచ్చిగా.

"ఏం ! ఎందుకని ?" మండిపోతూ ప్రశ్నించాడు.

"అక్కా నేనూ కలసి పేదకుటుంబములో ఒకే కడుపున పుట్టిన అన్నదమ్ములను వివాహమాడి యిల్లరికం తెచ్చుకొని మన యింట్లోనే వుండాలని నే నిర్ణయించాను. అది నీవు కూడా ఆలోచించు నాన్నా" అంది. ఆ మాటలు విన్న జమీందార్ రాజు హృదయం భగ్గున మండిపోయింది. అతని నెత్తిపై నిప్పులుపోసి నట్లయింది.

"అక్కడ మాటిచ్చి అంతా నిర్ణయించాక నీవు కాదంటావా ! ఛీ...ఛీ...ఎంత అప్రతిష్ఠ. నా పరువు మర్యాద నీవైనా కాపాడుతావని కొండంత ఆశతో కాచుకుకూర్చున్నా. నా ఆశలు అడియాశలుచేశావు. ఎంత పని చేశావు దేవకీ ! నా కొంప కూల్చావు. నే కుదిర్చిన సంబంధానికి యిష్టపడబోకని గుణ నీ కేమాత్రమో గుణపాఠం నేర్పివుంటుంది." అన్నాడు ఆగ్రహావేశాలతో రాజు.

"నేనేమీ నేర్పలేదు...ఆ విధంగా నేర్పబోనుకూడా. నే నెలాగూ పేదవాణ్ని చేసుకుంటాను. చెల్లికి మాత్రం ఒక గొప్ప సంబంధమే చూచి చేయమని నా అభిప్రాయం." అంది దీనకంఠంతో గుణ.

"లేదక్కయ్యా! నేను మాత్రం గొప్పింటి సంబంధానికి సమ్మతించను, సమ్మతించబోను. మన మిరువురము ఒకే పేద సోదరులను చేసుకోవాలి" అని స్పష్టంగా పలికింది దేవకి.

"నా కొంప నిలువున ముంచేరే! నా బ్రతుకు సర్వ నాశనం చేశారే! నా వంశప్రతిష్ఠలు భగ్నం చేశారు" పట్టలేని విచారంతో కన్నీరు కార్చుతూ తల పట్టుకుని లేచి మరణించిన భార్య చిత్రపటం దగ్గర కెళ్లి మరింత దుఃఖంతో విలపించి కుమిలిపోతాడు.

"దేవి! మరణించి నీ వే పరలోకసౌఖ్యాన్ని పొందు తున్నావు. బ్రతికి బిడ్డ లొనర్చిన అవమానముతో నే ననేక బాధలు అనుభవిస్తున్నాను. పదిహేను సంవత్సరములు నీవు నాతో కాపురముచేసి యున్నావు. అప్పుడు కూడా నే నిట్టి బాధల ననుభవించియుండ లేదు. పదునాలుగు సంవత్సరముల వరకు సంతానం లేక అనేక పూజాపుణ్యాలు చేసి యిద్దరు కవలపిల్లలను కని కాలంచేశావు. చనిపోయేముందు నీవు చెప్పిన ప్రకారమే రెండోపెళ్ళి చేసుకోనక పిల్లల్ని అల్లారుముద్దుగా పెంచి పెద్దచేశాను. నీ మాట ప్రకారమే మంచి గొప్పవారి సంబంధం చూసి, నిర్ణయించి పెండ్లి చేయబోగా నీ బిడ్డలు నామాట కాదని వారి యిష్టప్రకారం ముష్టివారిని పెండ్లాడ వలె నని మొండిపట్టుపట్టారు. న న్నొక పిచ్చివానిని చేశారు

చూడు నీ బిడ్డలు. ఈ లోకాన్ని విడచిపెట్టే ఆఖరిక్షణాల్లో నీవు చెప్పినమాటలు నిలబెట్టుకోలేని నిర్భాగ్యుని చేయాలని తలపెట్టారు నీ ముద్దుబిడ్డలు. నన్నేమి చేయమంటావో ఒక్క మాట చెప్పు దేవీ!...ఒక్కమాట మాట్లాడు దేవీ!" అని తల గోడకేసి కొట్టుకొని భోరున యేడుస్తాడు.

అంతలో రామయ్య వస్తాడు. దిగులుగా చెంపను చేయిపెట్టుకొని కూర్చున్న రాజును చూసి "ఏమిటి బావా! ఏంజరిగింది?" ఆశ్చర్యంగా ప్రశ్నిస్తాడు.

"కొంప కూలింది. దేవకి కూడా నా మాట తిరస్కరించింది. వాళ్ళు పేదవాళ్ళను కట్టుకుంటూరట! కలిగిన వాళ్ళను చేసుకోరట! మనం యిచ్చి వచ్చిన మాటలు మంటగలుపుతారట. బావా! యిక మన పరువు మర్యాదలు గంగపాలుకాక తప్పదు. ఒక వారంలో పెళ్ళివారు వస్తారే! యిప్పుడు నన్నేం చెయ్యమంటావు" అని వుద్రేక పడతాడు రాజు.

"శాంతించు బావా! నేను చెప్పిచూస్తాను వుండు" అని ఓదార్చి, గుణ, దేవకిల దగ్గరకు వచ్చి" గుణా! నీ మూలంగా దేవకి జీవితం కూడా పాడు కావాల్సిందేనా? చెప్పమ్మా. ఎందుకు మీరీవిధంగా మొండితనం చేస్తారు? మీ నాన్నను చూడండి! మీ కొరకు ఎంతగా కుమిలి పోతున్నాడో! నా మాటవిని పెంకితనం మాని తండ్రిని సంతోష పెట్టండి." అంటాడు రామయ్య.

ఆ మాటల నందుకొని దేవకి యిలా చెప్పసాగింది.

"మామయ్యా ! మేము చదువుకొనే రోజుల్లో మా స్నేహితురాలగు సరళకు తన తండ్రి ఒక పేదవానితో సంబంధం కుదిర్చి పెండ్లి నిశ్చయించాడు. ఆ సందర్భంలో పెండ్లి రెండు రోజులుందనగా ఆస్థిపరుడొకరు వచ్చి సరళను తన కుమారున కివ్వమని అడుగుతాడు. అప్పుడు సరళ తండ్రి అంగీకరించి పేదవాని సంబంధాన్ని వదిలేసి తప్పుడు మార్గం త్రొక్కి సరళ ప్రేమను భగ్నం చేస్తాడు.

ఆ మాటలు స్నేహితులు చెప్పుకొను సమయాన గుణ సరళ తండ్రిని యెత్తి పొడుస్తుంది. అప్పుడు "ఏమే గుణా ! మీా నాన్న మాజీ మంత్రి కదా ! మంత్రి కుమారునితో పెండ్లి నిశ్చయించిన నిన్ను ఒక రాజకుమారుడు వివాహమాడతానని వస్తే కాదంటాడా ? నీవు యిష్టపడకపోతావా ?" అంటుంది మా స్నేహితురాలైన జమున.

"నేను మంత్రి కుమారునీ పెండ్లాడను, మహారాజు కుమారునీ పెండ్లాడను. మనసార ప్రేమించి మనసిచ్చిన పేద యువకుని పరిణయ మాడతా"నని చెప్పింది అక్కా. ఆ మాటలకు జమున "ఓయబ్బో ! మాటలకు చేష్టలకు చాలా వ్యత్యాసం వుంది. నీ మాట నమ్మటం మహా కష్టం" అంది.

అప్పుడు అక్క తప్పక పేదవానినే చేసుకుంటానని ప్రతిజ్ఞ చేసి చెప్పుతుంది.

"చూస్తాంగా నీ ప్రతిజ్ఞాఫలం" అని జమున తన డైరీలో ఈ విషయం వ్రాసుకుంది. అక్క కూడా తన డైరీలో వ్రాసుకుంది. అందుకని అక్క ఆ వాగ్దానం నిలబెట్టుకోవాలని పట్టు పట్టింది. కనుక మే మిరువురము వేరుగాగాక ఒకే గర్భ

మున జన్మించిన పేద సోదరులను పెండ్లాడుతాము." అని అసలు కథ బయటపెట్టింది.

"అట్లాగా !" అని అంటాడు.

"అవును మామయ్యా ! ధనవంతుల బిడ్డలను చేసుకొని పరాయి గృహాలకు వెళ్ళి మా నాన్నకు దూరమైపోకుండా పరమపావన హృదయులైన పేదవారిని పెండ్లాడి మా యింట్లోనే వుండిపోయి, మా కున్న ఆ స్థితో జీవిస్తూ తండ్రిని తగినరీతులకాపాడి పోషించుచు సుఖప్రదమైన జీవితం గడుపుట మా నాన్నకు ఇష్టం లేదా !" అని నిర్మలహృదయంతో పలికింది గుణ.

ఆ మాటలు విన్న రాజు ఆశ్చర్యపోతాడు. అంతా విన్న రామయ్య "అయితే మీరు విచారించకండి. మీ నాన్నను ఒప్పించి మీ యిష్టప్రకారమే అన్నీ జరుగునట్లు చూస్తాను. మీరు అలా చల్లగాలికి షికారు పోయిరండమ్మా" అని గుణ, దేవకిలను సాగనంపుతాడు రామయ్య. తరువాత జమీందారు రాజును తోడ్కొని రామయ్య తిన్నగా వాళ్ళింటికి వస్తాడు; సావధానంగా యిద్దరూ కూర్చుంటారు.

"బావా ! పిల్లలింత మొండిపట్టు పట్టేరు. ఇందుకు ఏం చేద్దాం ?" అంటాడు రామయ్య.

"ఏమని చెప్పను బావా ? నా ప్రయత్నాలు విచ్ఛిన్నం యగుటే గాక, నా గౌరవమర్యాదలు కూడా నశించాయి. తలయెత్తుకుతిరిగే యోగ్యతకూడా నాకు దూరంచేశారు" అని నిట్టూర్పువదిలాడు రాజు.

"అట్లనకు బావా! ఏదో ఒక మార్గ మాలోచించి అమ్మాయిలకు నచ్చచెప్పాలి" అన్నాడు రామయ్య.

అప్పుడు రాజు, రామయ్యచేతులు బట్టుకొని,

"బావా! వాళ్లను సవ్యమైన మార్గంలో పెట్టుటకు నీవే ఒక దారి చూడాలి. ఈ భారం నీపై వుంచాను. నామాట దక్కించు" అని బ్రతిమలాడాడు.

పదినిముషాలు ఆలోచించి రామయ్య యిలా అన్నాడు: "బావా! నాకు చిన్న ఆలోచన తట్టింది."

"ఏమిటి బావా?" అని ఆప్యాయంగా చూస్తాడు రాజు.

"చెప్తాను విను. ఒకే కడుపునపుట్టిన అన్నదమ్ములై, గొప్పింటి బిడ్డలైయున్న ఒకగౌరవ కుటుంబాన్ని చూద్దాం. ఈ కథంతా వారికి చెప్పి పేదవారుగ నటించి మనల నాదుకోమని బ్రతిమాలి చెప్పుదాం. వారిని కొంతకాలంపాటు మనింట్లోనే వుండేటట్లు యేర్పాటు చేద్దాం. మన అమ్మాయిలతో అన్యోన్యముగా వుండులాగున చేసినమీదట పెండ్లిచేసి, ఆమ్మాయిలను అత్తవారిళ్లకు సాగనంపితే బాగుంటుంది" అన్నాడు రామయ్య.

"పెండ్లయ్యాక అసలు విషయం తెలిస్తే ఎట్లా బావా!"

"అనుభవించి తీరాల్సిందే. నిజం తెలుసుకున్నా ఏంచేస్తారు. దెబ్బ తగులుతుంది అని తెలుసుకున్నాక కని పెట్టుకు తిరగాలి. తగిలినతరువాత అనుభవించక ఏంచెయ్యాలి?" అన్నాడు రామయ్య.

"మంచి ఆలోచనే బావా! నా కష్టాలు కడ తేరేటట్లు చేశావు. అంతే చేద్దాం. ఈ భారంఅంతా నీదే. మంచిరోజులు

చూచి సంబంధం వెదకడానికి బయలుదేరు" అంటాడు అత్యానందంతో రాజు.

"నేను ఒక్కణ్ణేకాదు బావగారు. ఇద్దరం బయల్దేరాలి. ప్రయత్నించిన కార్యం జయప్రదం చేసుకురావాలి. తరువాత విజయనగరంవారికి అమ్మాయిలు యిష్టపడ లేదని ఒక వుత్తరం వ్రాసేయండి" అనిచెప్పి, తనగదిలోవున్న పంచాంగం చూచి "బావా! రేపే మంచిరోజు!" అన్నాడు రామయ్య.

"అయితే రేపే బయల్దేర్దాం" అన్నాడు ఖుషీగా రాజు.

"సరే అట్లాగే" అన్నాడు రామయ్య.

రాజు, రామయ్యల ముచ్చట్లు ముగిశాక, రాజు తన స్వగృహానికి వెళ్ళిపోయాడు.

అందరూ ఆ రాత్రి భోజనాలు చేసిన తరువాత రాజు గుణ, దేవకిలను పిలిచి "అమ్మాయిలూ! నేనూ, రామయ్యా కలసి జమీ పనిమీద పొరుగూరు వెళ్ళుచున్నాము. రేపటి దినమే ప్రయాణం. అందుచేత మీరు జాగ్రత్తగా వుండండి. మీ యిష్టమే నెరవేరుస్తాను" అంటూ చెప్పాడు.

"అలాగే నాన్నగారూ!" అని గుణ, దేవకిలు బదులు చెప్పి, యెవరి గదులలోకి వాళ్ళు వెళ్ళిపోతారు.

మరునాడుదయం 8 గంటలకు,రామయ్య, జమీందార్ రాజు యింటికి వస్తాడు. రామయ్య కూడా గుణ దేవకిలకు జాగ్రత్తగా వుండమని చెప్తాడు. రాజుతో ప్రయాణమై యిద్దరూ కలసి వెళ్ళబోవు ముందుగా గుణ, దేవకిల దగ్గరకు వచ్చి "అమ్మాయిలూ! మీరు కోరినప్రకారమే ఒకే అన్న దమ్ములు, పేదవారిని, చక్కనివారిని చూసి మీకు వివాహం

చేయడానికి తీసుకొస్తాము. మీకు యిష్టమేనా ?" అన్నాడు రామయ్య.

"ఇష్టమే" అన్నట్లు ముసిముసినవ్వులు నవ్వుతూ సిగ్గుతో తలలు వంచారు గుణ, దేవకిలు.

సుబ్బయ్య నౌకరును యిల్లు భద్రంగా చూడమని చెప్పి రాజూ, రామయ్యా వెళ్ళిపోతారు.

# 25

అది సుందర్ జమీందారు భవనం. రాజు జమీందార్ తన కుమార్తెలకు సంబంధం చూడడానికి వూరు విడచి వెళ్ళాడని గమనించాడు సుందర్. తన్ను నిరాకరించాడని వారిపై పామువగ పట్టాడు. కుట్రాలోచనాతత్పరుడై గుణ, దేవకిలను రాజు వచ్చేలోగా చంపాలని నిశ్చయించుకున్నాడు. ఉగ్రుడైపోయిన సుందర్ యిదే తగిన సమయమని తలంచి రౌడీలయిన చంద్రిగాడి ముఠాను పిలిపించాడు. ఈ రోజు రాత్రే రాజు జమీందార్ యింటిలో ప్రవేశించి గుణ, దేవకిలను ఖూనీచేసి రావాలి. ఆ తరువాత జరిగేది నేను చూసుకుంటానని రౌడీలకు నచ్చచెప్పి ధైర్యంతో వారిని పురికొల్పాడు. "వాళ్ళు నన్ను కాదని పరాయివాళ్ళను పెండ్లాడతారట. వాళ్ళ కెంత ధైర్యం. వారి నేవిధంగానైనా యీ రాత్రి ఖూనీచేసి రావాలి" అని చంద్రిగాణ్ణి ప్రోత్సాహపరచి, కొంత డబ్బు యిచ్చి ఒప్పించుతాడు. చంద్రిగాడు ముఠా డబ్బు

కోసమని అభము, శుభ మెరుగని గుణ, దేవకిల గొంతులు కోయడానికి సిద్ధమౌతారు. అవును; డబ్బులోనే వుంది గొప్ప తనం. డబ్బుంటే చాలు కొండమీది కోతిని రమ్మన్నా కిక్కురుమనకుండా వస్తుంది. డబ్బా...డబ్బా...డబ్బుగల వాడిదే పైచేయి. లోకుల నెత్తులపై చేతులుపెట్టి కోట్లు: కోట్ల రూపాయలు సంపాదించి నీచమైన పనులకు దిగజారు తారు పెద్దవారు. కూటికి లేని పేదల పొట్టలుకొట్టి మేడలు, మిద్దెలు కట్టి కులుకుతారు యీ పెద్దవారు.

అవి అమావాశ్య రోజులు. కారుచీకట్లు ఆవరించాయి. అర్ధరాత్రి 12 గంటల సమయం. చంద్రిగాడి ముఠా, జమీందార్ రాజు భవనాన్ని ముట్టడించారు. నల్ల దున్నలవలె వున్న ఆ రౌడీలు కత్తులు, గొడ్డళ్లు తీసికొని కన్ను పొడుచుకున్నా కానరాని ఆ నిశిరాత్రిలో భవనంచుట్టూ గుట్టుగా పచార్లు చేస్తున్నారు.

గుణ, దేవకిలు మైమరచి నిద్రించుచున్నారు. సుబ్బయ్య నౌకరు హాలులో గురకలుపెట్టుతూ నిద్రపోతున్నాడు. వరండాలో కుక్క గొలుసుతో కట్టివేయబడి వుంటుంది. చంద్రిగాడు తన ముఠాలో ఒకణ్ణి పిలిచి,

"లోనికి పోవడానికి యెక్కడైనా మార్గం వుందేమో చూడరా" అంటాడు. భవనంచుట్టూ తిరిగినా, లోనికి పోవు మార్గం కనబడదు. అన్ని తలుపులూ మూసి వుంటాయి. లోనికి పోనడానికి మార్గం చూడబోయినవాడు తిరిగివచ్చి "లాభం లేదు. అన్ని తలుపులూ మూసివున్నాయి. లోనికి పోయే మార్గమే లేద"ని చెప్పుతాడు. అందరూ కలసి మెల్లగా నడుస్తూ

పది అడుగులు వచ్చాక చంద్రిగాడు హఠాత్తుగా ఆగి, అక్కడ గోడకున్న కిటికీ చూసి "దీనిగుండా లోనికి పోవుట సులభం, ఇదే మంచిమార్గం" అని చెప్తాడు. వాళ్లవద్ద నున్న పరికరాలతో కిటికీ చువ్వలు నిశ్శబ్దంగా వూడపీకేస్తారు. తర్వాత ఒక్కొక్కరే కిటికీ గుండా లోనికి ప్రవేశిస్తారు. దురదృష్టవశాత్తు వాళ్లు ప్రవేశించినది సామాగ్రి నిల్వయుంచిన గది. దాని గుండా లోపలికి ప్రవేశించవలెనన్న ఒకే ఒక ద్వారం వుంది. ఆ ద్వారానికి లోపలిప్రక్క గడి బిగించబడివుంది. ఇంత ప్రయత్నించీ వాళ్లు లోనికి ప్రవేశించినా అసలు స్థలానికి పోవడానికి దారి లేకపోయింది. ఏమి చేయాలో వారికే గోచరించలేదు. నిరాశతో అక్కడే కూలబడ్డారు. ఇంతలో ఒకడు "తలుపు తట్టిచూద్దాం" అంటాడు.

"తలుపు తట్టినంతమాత్రాన తలుపు తీస్తారని నమ్మకమేమిటి ?" అంటాడు చంద్రిగాడు.

"ఎవరో పిలుస్తున్నారని నిద్రమైకంతో వచ్చి తలుపు తీస్తారు. వెంటనే మనం లోనికెళ్ళి చేయాల్సినపని గప్‌చుప్‌గా పూర్తిచేసుకోవచ్చు" అంటాడు.

"అదీ నిజమే!" అని అందరూ ఒక నిర్ణయానికి వస్తారు. చంద్రిగాడు తలుపు తట్టుతాడు. కాని ఎవరూ కదిలాడరు. ఆ విధంగా మూడు నాలుగుసార్లు తట్టాక, కుక్క మొరుగుతుంది. కుక్క అరుపు విన్న గుణ మేల్కొంటుంది. తలుపు తట్టిన శబ్దం విని వీధివైపువున్న ద్వారందగ్గరకు వస్తూంది. కాని శబ్దం వెనుకప్రక్క నుండి వినిపిస్తుంది. నిద్ర

నైకంతో కళ్ళు నలుపుకుంటూ వెనుకకు తిరుగుతుంది. ఇంతలో దేవకికూడా లేచివస్తుంది.

"తలుపు తియ్యండి" అన్న శబ్దం వినిపిస్తుంది.

"సామాగ్రియున్న గదిలోనుండి తలుపు తీయమని పిలుస్తున్నారే! ఎవరైనా బంధువులు వస్తే వీధిద్వారంవైపు వస్తారు. వీ ళ్లెవరైయుంటారా ?" అని ఆలోచించింది దేవకి. అంతలో సుబ్బయ్య వస్తాడు "ఏమిటమ్మా! యిక్కడున్నారు" అని అడుగుతాడు.

"ఎవరో తలుపు తీయమని పిలుస్తున్నారు" అంటుంది దేవకి.

"ఎప్పుడు తలుపు తెరుస్తారా" అని తొందరపడు తున్నారు కాడీలు.

"సామాగ్రిగదిలోనుండి పిలవడ మేమిటా" అని అనుమాన పడ్డ సుబ్బయ్య. వణకుతున్న శరీరాన్ని అదుపులో పెట్టుకుంటూ "ఎవరు మీరు ?" అని ప్రశ్నించాడు కొంచెం ధైర్యంగా.

"ముందు తలుపుతీయండి. కొంపమునిగింది" అంటాడు.

ఏం ! జరిగిందో అన్నభయంతో సుబ్బయ్య తలుపు తీయబోతాడు.

"సుబ్బయ్యా ! తలుపుతీయకు" అని అతన్ని ఆపుతుంది దేవకి.

"తీయనీయవే దేవకీ" అంటుంది గుణ. అక్కవద్దకు వచ్చి "అక్కా ! తలుపు తీయమనే శబ్దాన్ని బట్టి ఆలోచిస్తే, ఆనాడు మనలను బంధించి గొంపోయిన సుందర్ జమీందారు

రౌడీలుగా వున్నారు. ఆనాడు సుందర్‌తో మాట్లాడిన వాడి గొంతుమాదిరి వుంది" అంటుంది దేవకి.

గుణ కూడా కొంచెం ఆలోచించి సుందర్ రౌడీలే యని గుర్తించి, పోలీసులకు ఫోన్ చేద్దామంటుంది. ఆ మాటలు విన్న రౌడీలు అక్కడనుండి పారిపోవాలని ప్రయత్నిస్తారు. వచ్చిన దారినే కిటికీగుండా ఒక్కొక్కరుగా బయటకు దుముకుతుంటారు. గుణ, దేవకిలు పిస్టలూ, టార్చిలైటూ తీసికొని మేడపైకి వచ్చి టార్చిలైటు వేసి చూస్తారు. సామాగ్రి గదిలో నుండి కిటికీగుండా బయటపడి పారిపోతున్న రౌడీలను చూస్తారు. చంద్రిగాడి సాయంతో దుముకబోతున్న రౌడీని పిస్టలుతో దేవకి గురిచూసి కాళ్లమీద కాలుస్తుంది. ఆ దెబ్బకు గింగిరాలు తిరుక్కుంటూ బయటప్రక్క పడ్డ రౌడీ పత్తా దొరకడు. చంద్రిగాడు కిటికీగుండా దూరి బయటకు దూకేలోగా మళ్ళీ ఢాంమ్మని పేల్చిన గుండు చంద్రిగాడి చేతికి తగులుతుంది. ఆ దెబ్బతో తోకముడిచిన కుక్కవలె పారిపోతాడు.

"భలేపని చేశాం! ఇంక యెప్పుడూ మన జోలికి రాకుండా బుద్ధిచెప్పాం! దుర్మార్గుడైన సుందర్ జమీందార్‌కి కూడా తగినట్లు బుద్ధి చెప్పాలి. అప్పుడే అతడు మంచిమార్గానికి వస్తాడు. రౌడీలకు బాగా దెబ్బలు తగిలాయి. ఇక మన ఛాయలకు రాకుండా చేశాం!" అని గుణ, దేవకిలు నవ్వుకుంటారు.

సుబ్బయ్య నౌకరు గుణ, దేవకిలను జాగ్రత్తగా వరుండమని వెళ్ళి హాలులో పండుకుంటాడు.

# 26

చంద్రిగాడి ముఠా చావుపదుగులు తీసి సుందర్ బంగళా చేర్తారు. చంద్రిగాడు మూలుగుతూ భుజాలు, రొమ్ము తడువుకుంటాడు. ఆతృతగా సుందర్ వచ్చి,

"ఏం జరిగింది?" అని ప్రశ్నించాడు.

"కొంప మునిగింది" అంటాడు మూలుగుతూ చంద్రిగాడు.

"ఏమి జరిగిందో సరిగా చెప్పండ్రా!" మళ్ళీ అడుగుతాడు కొంచెం విసుగ్గా.

"సుందర్ బాబూ! నీకూ, నీ డబ్బుకూ వెయ్యి దండాలు. ఇంకెప్పుడూ వాళ్ళజోలికి వెళ్ళం. ప్రాణాలతో బయట పడ్డాం ఇవిగో! యిటు చూడు బాబూ, నా కాలు! చంద్రిగాడి చేయి! మేడమీదనుండి పిస్తోలు గురిచూచి కాలిస్తే మాకు తగిలిన దెబ్బలు. బుద్ధివచ్చింది బాబూ! మమ్మికమీాదట పంపకు; నీకు పుణ్యం వుంటుంది" అని ఏడుపుముఖంతో ఒకడు మొత్తుకుంటాడు.

"ఛీ!...చెప్పుకోవడానికి మీకు సిగ్గులేదురా! హాత మార్చి రండర్రా అంటే, ఆడాళ్ళచేత దెబ్బలుతిని వస్తారా!" అని కోపంతో పలుకుతాడు.

"లేదు బాబూ! నీకు పున్నెముంటుంది. వాళ్ళ గొడవే మాకు చెప్పకు" అంటాడు చంద్రిగాడు.

"చేతగాని సన్నాసులారా! వాళ్ళపని నేను పట్టాను; పట్టి తీర్తాను. ఊఁ...పొండి...యింక నా ముందెందుకు?"

అని రౌడీలను తరిమికొడ్తాడు సుందర్. తరువాత లోనికిపోయి ఉగ్రుడై పళ్ళు పటపటా కొరుకుతాడు. "ఈసారికూడా తప్పించుకున్నారు. ఎట్లాగైనా వాళ్ళను నా వలలో చిక్కించు కోవాలి" అని పరిపరివిధాల యోచనాతత్పరుడై కలిగిన పరాభవమునకు సిగ్గు, బిడియము చెందుతూ, ఒక ప్రక్క గుణ, దేవకిలను చిక్కించుకొనుమార్గం, మరొక ప్రక్క కలిగిన పరాభవం తలంచుకొంటూ మంచంమీద వాలుతాడు.

నాలుగు దినాలు గతించిన పిదప గుణ, దేవకిల పేర ఒక టెలిగ్రాం వస్తుంది. ఆ టెలిగ్రాం అనకాపల్లి నుండి వాళ్ల స్నేహితురాలైన వనజ యిచ్చింది. అందులో యిట్లా వుంది:

"ప్రియ స్నేహితులగు గుణ, దేవకిలకు. మిమ్ము చూచి చాల రోజులయింది. అందుచేత రేపు అనగా యీనెల 24 వ తేదీన మీ వూరి మీదుగా ఢిల్లీ వెళ్లుతున్నాను అందుచేత 25 వ తేది మెయిల్‌కు, మీ రిరువురు కలసి మీవూరి స్టేషనుకు రావాలి. మిమ్ములను చూడాలని చాల ప్రీతిగావుంది.

ఇట్లు,
వ న జ.

ఆ టెలిగ్రాం చదివిన గుణ, దేవకిలు సంతోష పూరితులై మరునాడు స్టేషనుకు వెళ్లి తమ స్నేహితురాల్ని చూడాలని యిరువురు నిశ్చయించుకుంటారు. స్నేహితురాలుకు పిండివంటలు తయారు చేయాలని యింకేవో తీసుకురావాలని తలంచుకున్నారు. ఆ రోజు కొంచెం వుత్సాహంగా వున్నారు. వాడినపూలు వికసించాయా అన్నట్లు వారి ముఖాలు పద్మముల

వలె ప్రకాశించాయి. గుణ, దేవకీలు మొదటివలె కళ కళ లాడి పోతున్నారు.

# 27

సంబంధం చూడాలని ప్రయాణ మయిన రాజూ, రామయ్యలు పట్టణాలన్నీ తిరిగి తిరిగి తుదకు సికింద్రాబాద్ పట్టణం చేరుతారు. వారికి పరిచితులైన వారినెల్ల గుణ, దేవకీల సమాచారాన్ని సంప్రదించి, సికింద్రాబాదులో ఒక లక్షాధికారిణి వుందని, ఆమెకు యిద్దరే కుమారు లున్నారని తెలిసికొని వారింటికి వెళ్ళుతారు. రాజు తన పుట్టుపూర్వోత్తరాలు విన్నవించి గుణ, దేవకీల పెండ్లివిషయం తెలియచేస్తాడు. గుణ, దేవకీల గుణగణాలు, విద్యాబుద్ధులు అన్నీ విన్నవించిన పిదప,

"నా గుణ, దేవకీలను మీ పుత్రులకు యిచ్చి వివాహం చేస్తాను" అంటాడు రామయ్య.

లక్షాధికారిణి అన్ని విషయాలు గ్రహించి,

"ఏమండీ! మీ సంబంధాన్ని అంగీకరించడానికి నాకేలాంటి అభ్యంతరము లేదు. నా కుమారులతో కూడా మాట్లాడి మీకు మాట యిస్తాను" అని సంతోషంగా సెలవిచ్చింది.

రాజూ, రామయ్యలను లక్షాధికారిణి అయిన శాంతాదేవి భోజనానికి తీసుకెళ్తుంది.

భోజనం చేసిన అనంతరం రాజు, రామయ్యలు, శాంతాదేవి కూడి ముచ్చటించుకుంటారు. శాంతాదేవి తన కుమారులయిన సుకుమార్, రాజేంద్రలను పిలిపిస్తుంది. సుకుమార్, రాజేంద్రులు వస్తూ అమ్మవద్ద యున్న నూతన వ్యక్తులను పరికించి, వారికి వినయపూర్వక నమస్కారాలు చేస్తారు. ఆ నమస్కృతు లందుకొన్న రాజూ, రామయ్యలు చిరునవ్వు లొలికిస్తూ తిరిగి నమస్కారాలు చేస్తారు. శాంతా దేవి, కుమారులు అక్కడవున్న సోఫాల నలంకరించారు. కొంతకాలం కుశలప్రశ్నలు కురిపించారు. పిదప శాంతా దేవి అసలు విషయం కుమారులకు తెలియపరుస్తుంది. పాపం! పెండ్లిమాట తల్లి చెప్పీచెప్పకుండానే, పెండ్లికై పరితపించే ఆ నవయువకుల శరీరం పులకరించింది. వారి హృదయం ఆనందంతో నిండిపోయింది. కాని బయటకు మాత్రం కొంచెం బెట్టుగాకనిపించారు. కారణ మేమిటా యని యోచిస్తే కట్నంకోసం! అని రూఢిపడింది.

"శాంతాదేవిగారూ, నాకు వున్నది ఇద్దరు కుమార్తెలు. వారి సుఖమే నా సుఖము. వారికి మంచిసంబంధం చూసి పెండ్లి చేయాలని నిశ్చయించుకున్నాను. చేసుకున్నవారికి నా ఆస్థి నంతా కట్నంగా యివ్వాలని నిర్ణయించుకున్నాను." అని ఏదో చెప్పబోయి ఆగుతాడు రాజు.

ఆ మాటలు విన్న శాంతాదేవి పుత్రులు గుణ, దేవకి లను చేసుకోటానికి యిష్టపడతారు.

"అమ్మా! క్షమించాలి" అని వినయంగా పలుకుతాడు రాజు.

"ఏమండీ !" అని అంటుంది ఆశ్చర్యంగా శాంతాదేవి.

"ఇందులో ఒక రహస్యం యిమిడియుంది. అందుకు మీరు యిష్టపడగలరని మనఃపూర్వకంగా నమ్ముతున్నాను" అన్నాడు దీనంగా రాజు.

శాంత, సుకుమార్, నరేంద్రులు ఆ మాటలకు ఆశ్చర్యపోతారు. ఏమిటా రహస్యమని ప్రశ్నించారు శాంత పుత్రులు.

"నా కుమార్తెలు పేదవారిని మాత్రమే పరిణయ మాడతామని పట్టుపట్టారు. కాని అందుకు నా మనసు అంగీకరించలేదు. కనుక మీ రిరువురు నా మాట మన్నించి పేద వారుగా నటించాలి. కొంతకాలం మా యింట్లోనే వుండి నా పుత్రికలను ప్రేమించండి. తదుపరి మీరు వివాహం చేసుకొని తగిన కట్నాలు గైకొని మీ యింటికి భార్యల సమేతముగా రావచ్చును. ఆమీదట మీరు గొప్పవారని తెలిసినా ఫరవాలేదు. గొప్పవారలై పేదవారిగా చింపిరిగుడ్డలు ధరించి హీనంగా యుండాలా ? అని చింతించకండి. ఇంటిలో మాత్రమే అట్లా నటించి బయటమాత్రమే విధంగానైనా యుండవచ్చు. అభ్యంతరమేమీ లేదు" అని ఎన్నోవిధాల ప్రాధేయపడి మనవిచేస్తాడు రాజు జమీందార్.

రామయ్య కూడా పదేపదే నచ్చచెప్పిన పిదప, తల్లీ కొడుకులు అందుకు అంగీకరించుతారు. ప్రయాణానికి యేర్పాటులన్నీ సిద్ధం చేసుకొని, మరునాడుదయం ప్రయాణమై బయలుదేరారు.

# 28

గుణ, దేవకిలు 25 వ తేది ఉదయంలేచి కాలకృత్యాలు పూర్తి చేసుకున్నారు. తలలు చక్కగా దువ్వుకున్నారు. మంచి వస్త్రములు ధరించారు. కనులకు కాటుకదిద్దారు. ముఖాలకు పౌడరు అద్దుకున్నారు. మల్లెమాలలు తలకొప్పు లందలంకరించారు. నొసటిని కుంకుమ బొట్టులు పెట్టుకున్నారు. అపురూప సుందరీమణులైన వారి అందం పరికించు ప్రతియువకుని ఒడలు పులకరింపజేయుననుట నిస్సందేహం. వారి తారుణ్య లావణ్యములు గాంచి నపుంసకుడైనా పుంసకుడుగా మారకుండునా ! యన్నదే ధర్మసందేహం ! ఆలాంటి సౌందర్య రూపులైన గుణ, దేవకిలు స్నేహితురాలైన వనజను చూడడానికి సిద్ధమై, కాఫీ ఫలహారములు సేవించి, ఉదయం 11 గంటలకు వారి వూరి రైల్వే స్టేషనుకు ప్రయాణమై వచ్చారు.

రైల్వేస్టేషనుకు వచ్చిన గుణ, దేవకిలు ఉదయం 11 గంటల మెయిల్ 40 నిమిషాలు లేటుగా వస్తుందని తెలుసుకున్నారు. ఏమీ తోచని గుణ, దేవకిలు కలసి వనజ విషయం ముచ్చటించుకుంటూ ప్లాటుఫారంమీద అటూ, యిటూ పచార్లుచేస్తూ కాలాన్ని కులాసాగా గడుపుతుంటారు. పోకిరి విద్యార్థులు వారిని చూసి పోజులేస్తూ, యెత్తిపొడుపు మాటలు పలుకుతూ పకపకా నవ్వుతూ, వారిని వెంటాడుతుంటారు. విద్యార్థు లనగా విద్యను ఆర్జించువారే కాని, చెడువర్తన నేర్చుకొనుట కాదు.

తలిదండ్రులు రాత్రింబవళ్ళు కష్టించి, చెమటోడ్చి సంపాదించిన డబ్బుతో కుటుంబాన్ని పోషించి, కొంత మిగిల్చి బిడ్డలు సుఖపడాలనే దృష్టితో చదువుకొనమని ఆ మిగిల్చిన డబ్బులిచ్చి పట్టణాలు పంపుతారు. కాని పట్టణంలో చదువు కొనడానికి వచ్చినవారు కొంతమంది తెచ్చిన డబ్బుతో దుర్బుద్ధులకు పాలైపోతారు. తుదకు పరీక్షలు తప్పి దేనికీ పనికిరాక పాడైపోతారు. అంతా డబ్బులోనేవుంది. డబ్బు లేనివాడు యిబ్బందులకు పాలౌతాడు. డబ్బున్న బాబు డంబాచారంగా తిరిగి తిరిగి, తుదకు గోదారి పాలౌతాడు.

ఆ విధంగానే గుణ, దేవకిలు 35 నిమిషాలు కాలం వెళ్ళబుచ్చుతారు. మెయిల్ రావడానికి 5 నిమిషాలు మాత్రమే వ్యవధివుంది. మెయిలుకై వేచియున్న ప్రయాణీకులు మూటా ముల్లె సర్దుకుంటున్నారు. గుణ, దేవకిలు మెయిల్ రాకకై యెదురుచూస్తూ నిలబడియున్నారు. స్టేషనంతా కోలాహలంతో నిండిపోయింది. అందరి ముఖాలు మెయిలుకై నిరీక్షిస్తున్నవి.

నల్లని పొగలు గ్రక్కుతూ, "చిక్ చిక్" అను మ్రోతలుచేయుచు భయంకర రాకాసిరూపము గలదై చెవులు గింగురుమనునట్లు కూతలువేయుచు రైలుపట్టాల మీదుగా ధూమశకటం ధూమ్ ధామ్‌లతో వచ్చి స్టేషనులో నిలిచింది. నిలచీనిలువకముందే "కూలీ...కూలీ" అంటూ కేకలువేయ మొదలెట్టారు కూలీలు. బండి ఎక్కేవారూ, దిగేవారూ ఆ సమయంలో సందుచూసుకుని జేబులు ఖాళీచేసేవారు, బిస్కట్లు, బీడి, సిగరెట్లు అమ్మేవారితో స్టేషను క్రిక్కిరిసి కిటకిట లాడుతోంది.

గుణ, దేవకిలు స్నేహితురాలైన వనజ కొరకై లేడీస్ కంపార్టుమెంటులన్నీ చూస్తూ వస్తుండగా వనజ కనపడుతుంది. ఆశ్చర్యంగా వారు ఆ కంపార్టుమెంటు యెక్కుతుంటారు. వారిని చూసి వనజ అపరిమితానందంతో గుణను కౌగిలించుకుంటుంది.

"హల్లో మైడియర్ ఫ్రెండ్సు! ఎన్నాళ్ళకు మిమ్మ కలుసుకోగలిగాను" అంది వనజ చిరునవ్వులొలికే మోముతో.

"ఏమే వనజా! అంతా కులాసా?" అంటుంది గుణ.

"వనజా! ఎంతగా మారిపోయావే!" అంటుంది దేవకి.

ఈ విధంగా కుశలప్రశ్నలతో ముగ్గురూ బల్లమీద కూర్చుంటారు.

"వనజా! ప్రయాణ విశేషాలేమి?" ప్రశ్నించింది గుణ పెదవులపై నవ్వుతో.

"నేను చాలాకాలంనుండి ఢిల్లీ చూడాలని అనుకుంటున్నా. అంతలో అదృష్టవశాత్తు మా మేనత్త పుత్రుని వివాహం ఢిల్లీలో చేయ నిశ్చయించుకున్నారు" అంటుండగా,

"పెండ్లి కుమార్తెవు నీవు కాదుగదా?" అని పరిహాసంగా ప్రశ్నించింది.

"నేను కాదులే! ఆ పెండ్లికి మా అత్త నన్ను రమ్మని బలవంతంచేస్తే మా నాన్నగారంగీకరించారు. అందు నిమిత్తం ఢిల్లీ ప్రయాణమయ్యాను" అంటుంది వయ్యారంగా వనజ.

ఇంటి దగ్గరనుండి తెచ్చిన పండ్లూ, పిండివంటలూ దేవకి వనజ కిస్తుంది.

"ఇదేమిటే యివన్నీ ఎవరు తెమ్మన్నారు" అంది నవ్వుతూ వనజ.

"బహుమానం! పాపం దూరప్రయాణం చేస్తున్నావని తెచ్చాం! తీసికోవే" అని బలవంతంగా వనజకు యిస్తారు.

"ఏమే గుణా! మీ నాన్నగారు మీ పెండ్లి ప్రయత్నంలో యేమైన వున్నారా? లేక తమరే ఎవరినన్నా ఎన్నుకొని యున్నారా?"

"వివాహ విషయం గురించే మా నాన్నగారూ, మా మామయ్యా కలసి వెళ్ళారు. బహుశః ఒక నెలలో వివాహాలే జరుగవచ్చు" అని నవ్వుతూ పలికింది గుణ.

"మీ వివాహాలకు మాబోటివారికి శుభవార్త చెవిని వేస్తారా?"

"తప్పకుండా!"

"ఇంతకీ సంబంధం జమీందారులతో నేనా?"

"కాదు" అంది గుణ.

"ఎవరితో మరి?" ప్రశ్నించింది వనజ.

"పేదవారితో" అంది దేవకి.

"మీ నాన్న అంగీకరించాడంటావా?"

"ఆఁ...అంగీకరించాడు...అల్లుళ్ళను వెదకి తెచ్చుకోడానికి కూడా వెళ్ళారు" అంది గుణ.

"వనజా! ఆనాడు సరళ పెండ్లి సందర్భంలో మా అక్క పేదవాడినే చేసుకుంటానని జమునతో ప్రతిజ్ఞ చేసింది కదా! ఆ ప్రతిజ్ఞానుసారంగానే అక్కతోబాటు నేనూ పేదవానిని పెండ్లాడ నిశ్చయించుకున్నాను" అంది దేవకి.

"అంతేకాదు. దేశంలో పేదరికాన్ని నిర్మూలం చేయాలని కంకణంకట్టి, ముందువారికి మాదిరి చూపించాలని

నిశ్చయించుకున్నాం. ధనవంతులు, దరిద్రులు అనే భేదాభిప్రాయాలు నశించాలంటే యిదే మార్గం" అని వుద్రేకంతో పలికింది గుణ.

"చిన్ననాటి ప్రతిజ్ఞ యింకా మనసులో బెట్టుకొని దానిని సార్థకం చేయనున్నా వన్నమాట, గుణా! నీ వంటే నే నేమో అనుకున్నా. సామాన్యురాలవు కాదన్నమాట" అన్నది వనజ.

ఈ విధంగా ముచ్చటలతో వనజ, గుణ, దేవకిలు వుండిపోయారు. ఇంతలో హైదరాబాదు ప్యాసింజరు వచ్చి స్టేషనులో ఆగింది.

గుణ, దేవకిలు "యిక వస్తాం" అంటూ పెట్టెలోనుండి దిగారు.

"మా పెండ్లికి పది రోజులముందే ఆహ్వానం పంపుతాం. తప్పక రావాలి సుమా" అంటారు గుణ, దేవకిలు.

"అలాగే" అంటూ ఓ. కే. చెప్తుంది వనజ. తిరిగి గుణ, దేవకిలు ఓ. కే. చెప్పుతుండగా, మెయిలు సాగి పోతుంది.

గుణ, దేవకిలు మెయిలు పోతుండగా ప్లాటుఫారం మీద నిలబడి వనజకు చేతులు వూపుతుంటారు. మెయిలులో వున్న వనజకూడా చేతులు వూపుతుంది. మెయిలు దూరంగా వెళ్లింది. గుణ, దేవకిలు నవ్వుకుంటూ వాలు బ్రిడ్జి యెక్కుతుంటారు.

హైదరాబాద్ ప్యాసింజరునుండి రాజూ, రామయ్యా, శాంతాదేవి, సుకుమార్, నరేంద్రులు దిగి అద్దెకారులు నిలిచియున్న దగ్గరకు వచ్చి టాక్సీ మాట్లాడుతుంటారు.

ఓవర్ బ్రిడ్జిమీద నడుస్తున్న దేవకి అకస్మాత్తుగా ఆగి, "అక్కా! అటు చూడు! నాన్నగారూ, రామయ్యా అనుగో!" అని గుణకు చూపుతుంది.

"గుణ చూసి, "ప్రక్కనున్న వా రెవరే!" అంటుంది ఆశ్చర్యంగా.

"పెళ్ళికొడుకులు గాబోలు. ఆమె వాళ్ళ తల్లి గాబోలు!" అంటుంది దేవకి.

వాళ్ళను గుణ, దేవకిలు పరీక్షించి చూసి, గొప్పింటి వారని గమనిస్తారు. వాళ్ళ సూటు, బూటు, ఆమె ధరించిన నగా నట్రా గాంచిన గుణ, దేవకిలు తండ్రి చేయనున్న మోసం తెలుసుకుంటారు.

# 29

టాక్సీ మాట్లాడుకొని రాజూ, రామయ్యా, తల్లీకొడుకులూ యెక్కి వెళ్ళిపోతారు. గుణ, దేవకిలు వాళ్ళ చినకాపు యెక్కి తిన్నగా యింటికి బయలుదేరారు.

"ఏమే దేవకీ! యీ సంబంధాన్ని గురించి నీ అభిప్రాయం? నీకు యిష్టమైతే మాత్రం తప్పకుండా వివాహం చేసుకోనవచ్చు" అంది గుణ.

"ఏమిటక్కా! అట్లంటావు!" అన్నది దేవకి.

"అవును. నేను మాత్రం యీ సంబంధానికి అంగీకరించను" అని నిక్కచ్చిగా పలికింది గుణ.

"నేనూ అంగీకరించను. నీ యిష్టమే నా యిష్టం. ఒకే అన్నదమ్ములనుమాత్రం చేసుకోవాలి. మనం విడిపోకూడదు" అంది దేవకి.

ఇంతలో కారు యింటిముందుకు వచ్చింది. కారు నాపి యిద్దరూ దిగి యింటిలోనికి తండ్రిగారి కోసం, రామయ్య కోసం, వచ్చిన చుట్టాలకోసం యిల్లంతా గాలించారు. కాని కనిపించలేదు. సుబ్బయ్యను తండ్రిగారు వచ్చారా అని అడుగుతారు. రా లేదని సుబ్బయ్య బదులిచ్చాడు.

వాళ్ళకన్న ముందుగా బయలుదేరివచ్చిన తండ్రిగారు, తదితరులు యెక్కడ మకాంచేశారో అని గుణ, దేవకిలు ఆలోచించ మొదలెట్టారు. చిట్టచివరికి రామయ్యగారింటికి వెళ్లారు గాబోలు. అక్కడనుండి యింటికి వస్తారేమో అని దృఢనిశ్చయం చేసుకొన్నారు గుణ, దేవకిలు.

"దేవకీ! ఈ సంబంధం నిర్ణయం కాకూడదు. అందుకు మనం ఏమి నాటక మాడాలా అనేదే పెద్ద సమస్య" అంటుంది ఆలోచనలోపడ్డ గుణ.

"అదే నే, ఆలోచిస్తున్నాను!" అన్నది దేవకి. పది నిమిషాల తరువాత, దేవకి "ఆఁ...నాకు ఒక చిన్న ఐడియా వచ్చింది" అన్నది నవ్వుతూ.

"ఏమిటది ?" అన్నది జున్నుగడ్డ కాజేయాలని పొంచిన నక్కలా చూస్తూ గుణ.

"ఏమీలేదు. వచ్చిన పెండ్లికొడుకులవద్ద, వారి తల్లి వద్ద నీవు మూగదానిలా, నేను మెల్లకన్నుదానిలా నటించాలి. వచ్చినవారు పేదవారైతే మనల్ని చేసుకోడానికి యిష్టపడతారు. ఆస్తిపరులైతే అంతే లేచివచ్చినదారి వెతుక్కుంటారు" అంది దేవకి.

"చాలా బాగుంది దేవకీ నీ ఐడియా!" అని ముచ్చటగా పలికింది గుణ.

ఇద్దరూ నవ్వుకుంటారు. తరువాత వంటగదిలో వున్న సుబ్బయ్యను పిలిచి, వాడి చెవిలో ఏదో చెప్పిన తరువాత వచ్చే అతిథులకు కూడా జొన్నసంగటి, పచ్చడి చేయమని చెప్పి, ఒప్పించుకుని వెళ్ళి, వారి గదిలో కూర్చుని అంతులేని ఆలోచనలో గుణ, దేవకిలు నిమగ్నమయ్యారు.

# 30

రామయ్య యింటిదగ్గర శాంతాదేవిని, సుకుమార్, నరేంద్రులను పేదవారిగా తయారుచేస్తారు. పేదవారన్నా కొంచెం మెరుగుగా వుంటారు. కాని వీరు అంతకన్నా హీనంగా తయారయ్యారు. చూచిన ప్రతిఒక్కరూ వారిని పేదవారనే తలంచుతారు. కాని గొప్పవారుగా భావించలేరు. ఆ విధంగా వారిని తయారుచేసిన రాజూ, రామయ్యల చాకచక్యాన్ని గుర్తించి తలంచాలి. అటువంటివారు దేనికైనా తెంపు చేస్తారనుట నిస్సందేహం.

ఆవిధంగా తయారుచేసి వారిని జమీందార్ రాజు, యింటికి తోడ్కొని వస్తూవుంటారు.

వారి రాక మేడ పై అంతస్థు నుండి దేవకి గమనించి గుణను పిలచి చూపిస్తుంది. ఇద్దరూ ఆశ్చర్యపోతారు.

"అక్కా! చూశావా! మనం స్టేషనులో గాంచి నప్పుడు ఆ ముగ్గురు విలువైన బట్టలు, నగలు ధరించి యిప్పుడు కానికి కొరగాని పేదవారులా తయారయ్యారేమి" అంది దేవకి.

"ఇదంతా మనలను మోసంచేయడానికి నాన్నా, మామయ్యలు వేసిన ప్లాను. వాళ్లకు పేదవారి వేషంవేసి పట్టపగలే మనల్ని గ్రుడ్డివారిని చేయతలంచారు. వారి ఎత్తుకు పైయెత్తు వేయాలి. వారికి తగినట్లు బుద్ధినేర్పాలి" అంటుందిగుణ.

"అవు నక్కా! మనం కూడా తగిన నాటకం ఆడాలి. అక్కా! నీవు మూగదానిలా, నేను మెల్లకన్నుదానిలా నటించాలి" అంది దేవకి.

ఇద్దరూ యీ విధంగా మాట్లాడుకొంటూ లోనికి వెళ్ళి పోయారు. రాజూ, రామయ్యలు అతిథులను యింటిలోనికి తోడ్కొని వచ్చారు. రాజు సుబ్బయ్యని పిలిచి వచ్చిన బంధువులకు కాళ్ళకు నీళ్లు యివ్వమన్నాడు. సుబ్బయ్య నీళ్ళివ్వగా కాళ్లు కడుగుకొని అక్కడవున్న సోఫాలలో వారుకూర్చున్నారు. సుబ్బయ్యను చూసి "అమ్మాయి లెక్కడ ?" అని ప్రశ్నించాడు రాజు.

"మేడపైన వున్నారు బాబూ" అన్నాడు సుబ్బయ్య.

"అమ్మాయిలు భోజనం చేశారా ?"

"ఇప్పుడే భోంచేసి మేడమీదికి వెళ్లారు బాబు" అన్నాడు సుబ్బయ్య.

రాజు సుబ్బయ్యకు వచ్చిన అతిథులను చూపి "వారికి స్నానం యేర్పాట్లు, భోజనం వగైరా యేర్పాట్లన్నీ కడు జాగ్రత్తగా చేయాలి సుమా!" అంటాడు.

"చిత్తం బాబూ"

సుబ్బయ్య, జమీందార్ చెప్పిన ప్రకారం వచ్చిన అతిథులకు వలసిన యేర్పాట్లన్నీ చేస్తూ రాజు దగ్గరికి వచ్చి "బాబూ! అతిథులకు సరిపడునంత భోజనం మాత్రం వుంది. మీకుకూడా వంట చేయ్యమంటారా?" ప్రశ్నించాడు.

"వాళ్లకు అన్ని యేర్పాట్లూ చేయి. నేనూ, మా బావా మా యింటి దగ్గర భోం చేస్తాములే" అంటాడు రామయ్య.

"అలాగే బాబయ్యా" అని వెళ్లాడు సుబ్బయ్య.

రాజూ, రామయ్య కలసి మేడపైకి వచ్చారు.

"ఏమమ్మా గుణదేవకిలూ ఏం చేస్తున్నారు?" అంటాడు నగుమోముతో రాజు.

అప్పుడే తండ్రిని చూసిన వారివలే నవ్వుకుంటూ నాన్న మామయ్యలను సమీపించి ప్రయాణవిశేషాలు ముచ్చటిస్తారు.

మీరు కోరిన ప్రకారం పేదవారిని, అందమైనవారిని, ఒకే గర్భాన పుట్టిన అన్నదమ్ములను వెదకి తీసుకొచ్చాము. మన హాలులో వున్నారు. సుబ్బయ్య వారికి స్నానం యేర్పాట్లు చేస్తున్నాడు." అన్నాడు అనురాగ కంఠంతో రామయ్య.

"ఏమమ్మా! మామయ్య చెప్పింది విన్నారుగా! ఇప్పు డైనా వారిని వివాహం చేసుకోడానికి సమ్మతిస్తారా?" అన్నాడు ఆప్యాయంగా రాజు.

"అలాగే పెండ్లాడతామని" గుణ, దేవకిలు యిద్దరూ అంగీకరిస్తారు.

"అమ్మాయిలూ మీనాన్నా నేనూ కలసి మాయింటికి వెళ్లుతున్నాము. వచ్చిన వారికి తగిన మర్యాదలు చేయండి" అని చెప్పాడు రామయ్య.

"అమ్మాయిలూ! వచ్చిన అతిథులకు అన్ని యేర్పాట్లూ సక్రమంగా చేయండి. వారి తల్లి కూడా వచ్చింది. జాగ్రత్తగా మర్యాదలు చేయాలి సుమా!" అని రాజు గోణిగాడు.

ఈ విధంగా గుణ, దేవకిలకు నచ్చ చెప్పి బావమర్దులు వెళ్ళిపోతారు.

సుబ్బయ్య శాంతాదేవికి, సుకుమార్, నరేంద్రులకు భోజనం వడ్డించి వారిని పిలుస్తాడు. వారు వచ్చి భోజనాలవద్ద కూర్చుంటూనే ఆశ్చర్యపోతారు. కారణం. వారికి వడ్డించినది జొన్న సంగటి, పచ్చడి మాత్రమే. సుబ్బయ్య గుణ, దేవకిలు చెప్పిన ప్రకారం చేశాడు.

"ఏమయ్యా! యిదేనా రోజూ మీ జమీందారి కుటుంబం భోంచేసే ఆహారం?" ప్రశ్నించాడు ఏమీ తెలియని సుకుమార్.

"అవును బాబయ్యా!" అంటాడు సుబ్బయ్య తడబడుతూ.

"ఇది మనుషులు భుజించే భోజనమేనా?"

"చిత్రం బాబయ్యా!"

"కాదు సుబ్బయ్యా' పరిహాసంగాఅంటాడు సుకుమార్.

"చిత్రం"

"పశువులు కూడా అసహ్యించుకుంటవి యీ భోజనం చూస్తే!"

"దేశంలో దరిద్రులై బ్రతుకు వేలాది పేద డొక్కల కిదే బాబయ్యా పరమాన్నం" అంటాడు సుబ్బయ్య.

ఇంతలో ప్రక్కనున్న తల్లి సైగ చేస్తుంది అల్లరి చేయ వద్దని సుకుమార్ కు.

తల్లి సైగ గమనించిన సుకుమార్ కిక్కురుమనకుండా భోంచేయ సిద్ధమై ఒక్క ముద్ద కలుపుకొని అతికష్టంగా కనులు మూసికొని నోటిలో వేసికొని వంటబట్టక వెంటనే వాంతి చేసుకుంటాడు.

నరేంద్రుడుకూడా తినలేక తినలేక నంజుతూవుంటాడు.

అవును! ఎట్లా తింటారు! సింహం బక్కచిక్కిన జంతువులు దాని ప్రక్కచేరిన వాటిని ఆకలి బాధతో మాడి చచ్చినా తినడానికి యిష్టపడక దాని గోళ్ళతో చీల్చి తీయబడిన ఏనుగు మెదడునే కోరునట. ఆ విధంగానే పేదల రక్తమాంస ములనందలి సారమును పీల్చి పిప్పిచేసి పొట్టలు గొట్టి జీవించు పెద్దమనుష్యులకు జొన్నసంగటిమీద ఆశ కలుగుతుందా?

ఎట్లాగో! వారు సతమతమై భోజనాలు ముగించారు. తాంబూలం వేసుకొని తల్లి కొడుకులు గదిలో కూర్చుని ముచ్చట్లు ప్రారంభించారు.

ఇదంతా సుబ్బయ్య తెలియనట్లు గమనిస్తూనే యున్నాడు.

"అబ్బాయిలూ! అమ్మాయిల దగ్గరికి వెళ్ళి వారి రూపు రేఖలు, గుణగణాలు అన్నీ పరిశీలించి వారిని ప్రశ్నిస్తుంటాను. అప్పుడు మీరు నెమ్మదిగా పైకి వచ్చి ఆ అమ్మాయిలను చూడండి" అంటుంది తల్లి.

"అది కాదమ్మా! మనకు భోజనం అటువంటిది వడ్డించారేమిటి?"

"అవున్రా నాయనా! మిమ్మల్ని పెండ్లాడబోయే అమ్మాయిలు మీతో సరసమాడాలని ఆ విధంగా చేశారు. పెండ్లాడబోయే వరులతో చతురము మొదలెట్టి అన్నిటికి సహించగలరా? లేదా? అని పరీక్షిస్తున్నారు" అని తల్లి నచ్చచెప్పుతుంది.

"అదా సంగతి!" అంటూ మట్టి బుర్రలు వూపుతారు.

"సరే! నే వెళ్తాను. తరువాత మీరు రండి" అని శాంత గుణ, దేవకిలున్న మేడ పై గదిలోనికి వెళ్తుంది.

శాంత రావటం గమనించిన గుణ, దేవకిలు మూగ దానిగాను, మెల్లకన్ను దానిగాను నటిస్తారు.

"అమ్మాయిలూ! ఏం చేస్తున్నారు" అంటూ వారిని సమీపించింది.

ఎవ్వరూ పలకరు.

దేవకి మెల్లకన్ను పెట్టి శాంతకేసి ఒకే దీక్షగా చూస్తుంది. అంతలో పెళ్ళికుమార్తెలను చూడాలని కుతూహ

లంతో సుకుమార్, నరేంద్రులు వచ్చి చాటుగావుండి అక్కడ వున్న కిటికీగుండా గుణ, దేవకిలను చూస్తుంటారు.

శాంతాదేవి గుణను చూసి "నీ పేరేమి అమ్మాయి ?" అంటుంది.

మూగదానిలా గుణ 'మే...మే' అంటుంది. అప్పుడు దేవకి మెల్లకన్నును బాగా చూచేలా మొగంపెట్టి గుణను చూపిస్తూ "దానిపేరు గుణ, నా పేరు దేవకి. మా యిద్దరి పేర్లు కలిపితే గుణ, దేవకిలు."

"మానాన్నగారు అలా వీధిలోకి వెళ్లారు. వస్తారు కూర్చోండి." అని ఏమీ తెలియని అమాయకురాలులా పలుకుతుంది దేవకి.

ఆ మాటలు, వారిపోలికలు గమనించిన తల్లీకొడుకుల హృదయాలు అసహ్యం, అహంభావాలతో అలంకరించాయి. ఇక క్షణమైనా వారికక్కడ వుండాలని యిష్టపడలేదు.

"మే...మే..." అని మళ్లీ గుణ వెర్రిగా అంటుంది.

"సరే నమ్మా" అంటూ నిట్టూర్చింది శాంతాదేవి.

దేవకి యింకా కొంచెం వికారంగా నటించి ఏమో చెప్పబోతుంది. కాని శాంతాదేవి వారి దగ్గర నిలువలేక వెనక్కి తిరిగింది. పాపం! పెండ్లి కూతుళ్ళను చూడాలని వచ్చిన సుకుమార్, నరేంద్రులు వారి స్వభావాలకు, చూపులకు తాళజాలక మెల్లగా తప్పుకొని తరలిపోయారు.

తల్లీ, కొడుకులు తిన్నగా వారి గదికి వచ్చారు.

"అమ్మా! ఆ అమ్మాయిల ఆకారాలు, వికార భావాలు చూచి ఎవ్వరూ యిష్టపడనందుననే వాళ్ళ తండ్రి

మన దాపుచేరి మనల్ని మోసపుచ్చి వారిని అంటకట్టాలని ప్రయత్నించాడు. ససేమిరా! ఆ చిన్నదాన్ని నేను చేసుకోను. వెంటనే వెళ్లిపోదాం రండి" అని ఉగ్రుడైపోతాడు సురేంద్రుడు.

"అమ్మా! నాకు మాత్రం పెద్దపిల్లను చేస్తే సగపాలు చేసుకోవాలని వుంది. కాని నాకు యీ యింటిలో వుండడానికి యిష్టం లేదు. వెళ్దాం పద!" అంటాడు సుకుమార్.

సరే! మీ యిష్టప్రకారమే వెళ్దాం! నాకుమాత్రం యిష్టమంటారా? వాళ్లను చూసినప్పుడే నా కయిష్టం కలిగింది. వాళ్ళ తండ్రిగారు వచ్చిన తదుపరి చెప్పి వెళ్ళిపోదాం! ముందుగానే జాగ్రత్తపడ్డాము. అంతేచాలు!" అంటుంది శాంతాదేవి.

"సుకుమార్, నరేంద్రులు తక్షణమే బయల్దేరి పోవాలి" అని తల్లిని బాధపెట్టుతుంటారు. తల్లి వారిని ఓదార్పుతో ఆపుతుంటుంది.

అంతలో రాజూ, రామయ్యలు పెండ్లి ముచ్చట్లు ముచ్చటించుకుంటూ కులాసానందాలతో యింటి గుమ్మంలో కాలు పెట్టారో లేదో, శాంతాదేవి యెదురై వారిని గదిలోనికి తోడ్కొని పోతుంది.

"ఏమండీ! మీకు చాల ప్రయాస కలిగించాం అనుకుంటా!" అంది శాంత.

"ఇదిగూడా పెద్ద ప్రయాసగా భావించితే యింకా జరుగవలసినదంతా ముందే వుందిగా" అన్నాడు రామయ్య.

"అవు నవును" అన్నాడు ముసిముసిగా నవ్వుతూ రాజు.

"అదికాదండీ! అసలు సంగతి వినండి. ఇప్పుడే మీ అమ్మాయిలను చూశాం! మా పెద్దవాడు మాత్రం చేసుకోడానికి యిష్టపడ్డాడు. కాని మా చిన్నవాడుససేమిరా! మీ చిన్నపిల్లను చేసుకోనంటున్నాడు" అంది శాంతాదేవి.

ఆ మాటలు విన్న రాజు మారు మాట లేకుండానే మూర్ఛిల్లిపోయాడు.

రామయ్య ఏమి చెప్పాలో తెలియక గుడ్లు అప్పగించి చూస్తుంటాడు.

మూర్ఛిల్లిన రాజును రామయ్య సుబ్బయ్యలు పడక మంచంపై పరుండబెట్టి ముఖంపై చల్లటి నీళ్ళు చల్లుతుంటారు.

అంతలో శాంతాదేవి వచ్చి రామయ్యను పిలిచికొని కొడుకులతో రామయ్య యింటికి వెళ్తుంది.

"రామయ్యగారు! మీరు వచ్చేముందు మీ మేన కోడళ్ళను నేనూ నా పిల్లలూ చూశాం. వారికి యిష్టం లేదని నొక్కి చెప్పారు. వాళ్ళకు యిష్టంలేని వారితో నేను పెండ్లి యే విధంగా చేయను" అంటుంది శాంతాదేవి.

"అట్లనకండి శాంతాదేవిగారూ! ఎట్లైనా మీరూ మీరూ సమ్మతించి నా బావగారి ప్రాణం కాపాడాలి" అని ప్రాధేయపడతాడు రామయ్య.

"లాభంలేదు రామయ్యగారూ! పెద్దవాడు అంగీకరించాడు కాని చిన్నవాడు సుతరామూ చేసుకోనని పట్టుపట్టాడు, ఇద్దరకూ ఒకేసారి పెండ్లి చేయాలనుకున్నాను. కాబట్టి దయచేసి మామీద ఆశపెట్టుకోబోకండి" అంటుంది శాంత.

రామయ్య ఏమీ చెప్పలేక మట్టిముద్దవలె నేలపై చతికిల బడిపోయాడు.

తల్లి కొడుకులు ధరించిన పాతగుడ్డలు తీసివేసి వారి విలువైన వస్త్రాలు, నగలు ధరించి ఎప్పటివలె గొప్పవారిగా తయారై ప్రయాణానికి సిద్ధమై రామయ్య చెంతచేరి "వెళ్లి వస్తాం! మీ బావగారితో కూడా చెప్పండి" అని వెళ్ళిపోతారు.

# 31

మరునాడు రాజు, రామయ్యలు ఎలక్షనులో ఓడి పోయిన సభ్యులవలె దిగాలుపోయి కూర్చున్నారు.

"ఏమిటి బావా! మనం యే సంబంధం పట్టుకొచ్చినా శుభప్రదం కాకుండా యిలా అవకతవకపాలై విచ్ఛిన్నమౌతున్నాయి?" అంటాడు రామయ్య.

"అదంతా నా కర్మ!" అంటాడు రాజు.

"నీ కర్మగాదు బావా! అది నీ అమ్మాయిలరాత!" అంటాడు రామయ్య.

"వాళ్ళ రాతకాదు బావా! నా నొసటిని బ్రహ్మ వ్రాసిన గీత అనే చెప్పాలి." అంటాడు కుమిలిపోతున్న రాజు.

"ఇంతకీ! యిప్పుడు యేమిచేద్దాం?"

"బావా! అమ్మాయిలేమో పేదవారిని తప్ప ఎవరినీ పెండ్లాడమని పట్టుపట్టారు. వాళ్ళ యిష్టానుసారంగా కూటికి

లేని దరిద్రులకిచ్చి నా పరువు మర్యాదలు పోగొట్టుకో వాల్సిందేనా ?" అంటాడు రాజు.

"తప్పదు బావా !"

"అంతేనంటావా ! మన దేశంలో దరిద్రుల సంఖ్య హెచ్చుగావుంది. యీ వార్త ప్రకటిస్తే తేనెటీగలవలె మన భవనాన్ని ముట్టడిస్తారు. కాని చూస్తూ చూస్తూ నా బిడ్డల్ని నా చేతులారా వారిచేతుల్లో పెట్టాలంటే నా మనసు అంగీకరించదు బావా !" అంటాడు కన్నీరుకారుస్తూ రాజు. ఇంతలో గుణ, దేవకిలు వారిదగ్గరికి వస్తారు.

"ఏమిటి నాన్నా, మామయ్యాలు యింకా ఆలోచనలోనే కాలం గడుపుతున్నారే ! మంచిరోజు చూసి త్వరలో ముహూర్తం నిశ్చయించక" అంటుంది అసలు సంగతి తెలియ నట్లు గుణ.

"మరి ఆలోచించకపోతే ఎట్లా ? పెండ్లికి డబ్బు ఎంత ఖర్చుచేయాలా ? అని అంచనా వేస్తున్నారు గాబోలు" అంటుంది మరింత జోరుగా దేవకి.

"అంచనా కాదు చంచలమైన మనస్సులను చెంతకు తెచ్చుకుంటున్నాం" అని రామయ్య, జరిగిన విషయమంతా గుణ, దేవకిలకు వివరిస్తాడు.

"ఆఁ..." అంటూ దిగాలుపోయిన వారిలా నటించి కుర్చీలలో కూలబడతారు గుణ, దేవకిలు.

"అమ్మాయిలూ ! యికనైనా నామాటవిని పెద్దలత్యాధి కారులను చేసికొని లక్షణంగా బ్రతకండి" అంటాడు ఆప్యా యంగా రాజు.

మళ్లీ మొదటిదారికే వచ్చాడని గమనించిన గుణ, దేవకిలు ధైర్యం వహించి తండ్రిమాటను సహించక వారి నాన్నను మంచి మార్గానికి మరల్చడానికి ప్రయత్నం చేస్తారు.

"నాన్నా! లక్షాధికారి...లక్షాధికారి అని కలవరిస్తావు. కాని లక్షాధికారి లక్షణం గమనించావా! వారిలో వున్న గర్వం, కుట్ర, కుతంత్రం, వ్యభిచారం, దుర్మార్గం యింత యని గణింప మానవులకు అసాధ్యం. అట్టి వారితో సంబంధం ఏనాటికైనా బంధాలుగా మారి బ్రతుకుల్ని ఉరికంబాలకు గురిచేస్తాయి. భిక్షాధికారికి భిక్ష పెట్టటం ధర్మం కాని వున్న వాడికి మరింత పెట్టుట ధర్మంకాదు. ఏటి తీరమున వున్న వృక్షాలకు వలసిన నీరు పుష్కలంగా ఏటినుండి లభిస్తుంది. అటువంటి చెట్టుకు మరింత నీరు పోయుట నిష్ప్రయోజనమే గాని నీరు లేక మలమల మాడి చచ్చు మరియొక చెట్టునకు నీరుపోసి పెంచిన అది చిగిర్చి కొమ్మలుగల్గి కొంతకాలానికి పూలూ, పిందెలు కలుగుతుంది. మరికొంత కాలానికది మంచి ఫలాలతో నిండి ప్రతిఫలము నిచ్చుగదా! ఆ విధము గనే మనం చాలా ఆస్తిపాస్తులు కలిగిన ధనవంతులం. మన ఆస్తి పాస్తులను మరింత ఆస్థిపరుడికి కట్టబెట్టి వాళ్ళతో సంబంధం కుదుర్చుకొని అశాంతితో జీవించేకన్నా, తినుటకు తిండి, కట్టుకొన బట్టలు లేక మలమల మాడి చచ్చు పేదవారిని ఆదరించి వారితో సంబంధం నిర్ణయం చేసికొన్న నీకు భావి జన్మలో పుణ్యం కలుగుతుంది. తగిన ప్రతిఫలం కూడా లభిస్తుంది.

"ఆస్తిపరులై పుట్టి దయా, దాక్షిణ్యాలు చూపక దాన ధర్మాలు చేయక మరణించిన ముందు జన్మలో వారు కుక్కలై,

వారు నిర్మించిన భవనాల చుట్టు తిరిగినా రక్షించి ఆదరించు వారుండరు. బ్రతికినన్నాళ్ళూ పదిమందిచేత మంచివాడనిపించు కొనుట మంచిది కాని పరమ నీచుడు అనిపించుకొనుట పాడి కాదు.

"ధనవంతులు దరిద్రులను భేదాలు ఆస్తిపాస్తులవలన కలిగినవే కాని దేవుడు కల్పించినవి కావు.

"నాన్నా ! నీవు ఒకానొకప్పుడు మంత్రి పదవిలోవున్న వాడవు. లోకం పోకడ నీకు మాకన్న యెక్కువ తెలుసు. అట్టివాడవగు నీకు యెక్కువ చెప్పవలసిన పనిలేదు. కాని, ఒక మాట చెప్తాను వినండి. బావిలోపడి పైకి యెక్కిరాలేక క్రిందికి జారిపోవువానికి చేయూత నియ్యాలి కాని, పైకి రాగల వానికి చేయూతనొసంగిన అది నిష్ప్రయోజనముగదా. అధికులు అధములు, ధనవంతులు దరిద్రులను భేదాభిప్రాయాలు నరుల దృష్టిలో నుండిపోయిననాడే దేశం సర్వసంపదలతోను రాణించ గలదు" అంటుంది సగర్వంగా గుణ.

ఆ ప్రబోధ సారమును చవిచూచిన రాజూ,రామయ్యలు ఆశ్చర్యపులకిత శరీరులై సంతోషసాగరమందు మునిగిపోయిరి. వారి కనులకు కప్పబడిన ధనగర్వాంధకారము పటాపంచలై పవిత్ర తేజోవికాస జ్ఞాననేత్రములై ప్రకాశించుచున్నవి. ధన వంతులు దరిద్రులనే భేదాలు వారి హృదయములనుండి దూర మైనవి. గుణ మాటలు శ్రద్ధతో విన్న రాజు "అమ్మా గుణా! నీ హృదయ మెంత నిష్కల్మషమైనదమ్మా! నీ కరుణా కటాక్షములు, నీ దయార్ద్రసభావాలు యెంత తేజోనీయమైన వమ్మా! నీ సాభిప్రాయ సిద్ధాంతములు నాకే కాదు లోకము

నకే నీతిగరపుననుట అతిశయోక్తికాదు. అనన్యము. నీ నీతి ప్రబోధసూత్రములు శిరోధార్యమేగాని నిషేధింప వీలుకాదు" అంటాడు పరమానందభరితుడైన రాజు.

"నాన్నా ! మనకు కావలసినంత సంపద, గౌరవమర్యాదలు వున్నవి. వాటితో మనం పేదవారిని కనికరించి పైకి తీసుకొనివస్తే, భగవంతుడుకూడా మనమీద తన చల్లని కృపాశీర్వాదములు అనుగ్రహిస్తాడు. అందుచేత మాకు నచ్చినవారిని, ఒకే యింటి అన్నదమ్ములైనవారిని మేమే వెదకి వివాహం చేసికుంటాం. అందుకు మీరు వేరుగా తలంచక మమ్మే మన్నించవలెను" అంటుంది గుణ.

"పేరుకు తగిన సుగుణవతివై నా గౌరవము నిలబెట్టావు గుణా ! తప్పక నీవు చెప్పినట్లే పేదవారినే పెండ్లాడవచ్చు. మీ మాటకిక నా జన్మలో వ్యతిరేకించబోను" అంటాడు గుణ తలను నిమురుతూ రాజు జమీందార్.

గుణ, దేవకిల హృదయాలు ఉత్తేజమైన కాంతి కిరణాలతో ప్రకాశించాయి. వారి మోములు ప్రభాత సమయమున విచ్చిన పద్మములవలె విశాల భావాలతో వికసించాయి.

"గుణ అని పేరు పెట్టినందుకు నీ బిడ్డ గుణవంతురాలైంది బావా !" అంటాడు రామయ్య.

"అవును బావా ! గుణ చెప్పినది సత్యం. ఇప్పుడు పుణ్యం చేసుకుంటే, ముందు జన్మలో భగవంతుడు కనికరించుతాడు" అంటాడు రాజు.

ఈ విధంగా మాట్లాడుకుంటూ గుణ విశాల భావాలకు ముగ్ధులౌతూ, రాజూ రామయ్యలు అక్కడనుండి వెళ్ళిపోతారు.

గుణ, దేవకిలు భోజనాలు చేసి మేడపైకి వెళ్ళిపోతారు. గుణ దీర్ఘమైన ఆలోచనలో నిమగ్నమై యుంటుంది. అంతలో దేవకి వచ్చి "ఏమి టక్కా! యింకా ఏదో ఆలోచిస్తున్నావు?" అని ప్రశ్నించింది నవ్వుతూ.

"ఏమీ లేదు చెల్లీ! సుంకర్ జమీందారును మనం కలుసుకోవాలి. అందుకు మార్గ మేమిటా అని యోచిస్తున్నా!" అంది గుణ.

"అదెట్లా సాధ్యమౌతుం దక్కా?"

"సాధ్యం చేసుకోవాలి!"

"అంత పనేమి వచ్చింది?"

"చెల్లీ! సుందర్ మనమీద పామువగ పట్టాడు. కాబట్టి మనం వాడిదైన వాడి విషపుకోరలను పెరికి, సరియైన మార్గానికి తీసుకురావాలి" అంది గుణ.

"అట్లా చేయాలంటే మార్గం?"

"చెప్తాను విను మరీ! మనం ముందు పురుష వేషాలు ధరించి, సుందర్ దగ్గరకెళ్ళి 'మమ్ము రాజు జమీందార్ రమ్మని కబురంపగా, మా తండ్రిగారు బొంబాయినుండి మమ్ములను యిక్కడకు పంపేరు. రాజు జమీందార్‌కు యిద్దరు కుమార్తెలున్నారని, వారు ఒకే గర్భాన పుట్టిన సోదరులనే పరిణయమాడ తలంచారని తెలుసుకొని మేము పెండ్లాడ నిశ్చయించుకున్నాము. ప్రథమంలో మీరు వారిలో ఒకర్ని చేసుకో తలంచారని, అందుకు వారు యిష్టపడ లేదనీ, అందుకు మీరు కోపించి బొంబాయిలో వున్న ఒక అమ్మాయిని ప్రేమించి పెండ్లాడబోతున్నారని మాకు

మా నాన్నగారు చెప్పారు. కాని యీ అమ్మాయిలమీదే మీకు ప్రేమవుంటే, మా అన్నగా నటించి ఆ అమ్మాయిని పరిణయమాడవచ్చును" అని నచ్చచెప్పి, కొంత డబ్బుకూడా కాజేసి, ఒక పేదపిల్లను తెచ్చి సుందర్‌కు పెళ్లి చేద్దాం" అంటుంది గుణ.

"ఒకవేళ మనల్ని సుందర్ గుర్తుపట్టిన అప్పుడు మన గతి ఏంకావా లక్కా—" అని బెదిరిపోయిన జింకలా చూస్తుంది దేవకి.

"దేవకి భయపడవలసిన పనిలేదు. గుర్తుపట్టకుండు లాగునే మనం వేషం వేయాలి. సుందర్‌ను ఒప్పించాలి" అంటుంది గుణ.

"సరే!" అని ఒప్పుకుంటుంది దేవకి.

# 32

మరునాడు గుణ, దేవకిలు పురుష వేషాలు ధరించారు. వారినిగాంచి, వారు స్త్రీలు అనిగానీ, ఫలానావారు అనిగాని గుర్తుపట్టలేనంత రీతిగా వారు వేషాలు వేశారు. వారి సూటు, బూటు, హేటులు, వారి నడకా, వారి పోజులూ చూస్తే నవయువక విద్యార్థులవలె కళ్ళకు గోచరమగుదురు. నిజంగా బొంబాయినుండి వచ్చారే అని నమ్మక తప్పదు. ఈ విధంగా తయారైన గుణ, దేవకిలు తిన్నగా సుందర్ యింటికి వెళ్లారు.

సుందర్ జమీందార్ భవనానికి వచ్చిన గుణ, దేవకిలు సుందర్ జమీందార్‌కు కబురుచేస్తారు. లోనికి రమ్మని అతని ఆజ్ఞ రాగానే, గుణ, దేవకిలు లోనికి వెళ్తారు. సుందర్ దినపత్రిక చదువుతూ వచ్చినవారిని ఎదురుగావున్న సోఫాలో కూర్చో మని చెప్పుతాడు. మారువేషంలో వున్న గుణ, దేవకిలు అక్కడ కూర్చుంటారు.

"మీ రెవరు? ఎక్కడి నుండి వచ్చారండి" అని అంటాడు సుందర్.

"మేము బొంబాయినుండి వచ్చాం. రాజా జమీం దార్ కుమార్తెలను చూడవచ్చి ఒక చిన్న సందేహం కలిగి మీదగ్గరకు వచ్చాం" అంటుంది గుణ.

ఆ మాటలు విన్న సుందర్ జమీందార్ హృదయం అగ్నిగోళమైంది.

"రాజు కుమార్తెల విషయం మీ కెట్లా తెలిసింది!" ప్రశ్నించాడు సుందర్.

"ఆ అమ్మాయిలు మా చెల్లి స్నేహితులు. అందువల్ల వారిని గూర్చి తెలిసికొంటిమి" అంది గుణ.

"ఓహో...అలాగా! ఏమి టా ధర్మసందేహం?" ప్రశ్నిం చాడు గుర్రుగా సుందర్.

"ఏమీ లేదండీ! రాజా జమీందార్ పెద్దకుమార్తె అయిన గుణను నేను పెండ్లాడ నిశ్చయించుకుంటిని. మా తమ్ముడు బొంబాయిలో ఒక యువతిని ప్రేమించి పెండ్లిచేసు కుంటానని వాగ్దానం చేశాడట. అందునిమిత్తం దేవకిని చేసు కోనని మొండిపట్టు పట్టాడు. వాళ్ళేమో ఇద్దరూ అన్నదమ్ములై

యుంటేనే తప్ప, అన్యులను పరిణయమాడమని ఖండించి చెప్పుతున్నారట. ఏమండీ, మీకు పుణ్యముంటుంది. మీరైనా మా తమ్మునికి నచ్చచెప్పి యీ పెండ్లికి ఒప్పించండి" అంది గుణ.

"చాల్లే ... వూరుకోవయ్యా పెద్దమనిషీ ! ప్రేమించి హృదయాలు రెండూ ఏకమై యుంటే, వాటిని వేరుపరచుట భావ్యమా ! అట్లు చేయుట యితరులకు శక్యమా ! మన సిచ్చిన పిల్లకు మాట నిచ్చి మరల్చుకొనుట మానవ మాత్రులకు న్యాయమా ? ఇక నీ ధర్మ సందేహాన్ని కట్టిపెట్టి, వచ్చినట్లే తిరిగిపోవయ్యా" అన్నాడు పెద్ద నీతిపరుడువలె సుందర్.

"ఏమండీ ! మీరైనా నచ్చచెప్పి ఒప్పిస్తారనుకుంటే, నాకే బుద్ధిచెప్పారే ! అయితే ఒక్కమాట చెప్తాను వినండి."

"ఏమిటది ?"

"నేను చిన్నమ్మాయి దేవకిని చేసుకోవాలని నిశ్చ యించుకున్నాను. కనుక నాకు మీరు చిన్న సహాయం చేసి పెట్టాలి" అంది గుణ.

"ఏమిటా సహాయం ?"

"మీరు నా అన్నగా నటించాలి."

"అదెట్లా సాధ్యం! అయినా అంత పనేమివచ్చింది?" ప్రశ్నించాడు.

"చెప్తాను వినండి. కొంచెం మీరు వేషం మార్చుచేస్తె, నిజంగా నా తమ్మునివలె వుంటారు. అప్పుడు మీరు గుణను, నేను దేవకిని వివాహమాడ వీలు చిక్కుతుంది" అంటుంది గుణ.

ఆ మాటలు విన్న సుందర్ హృదయం ప్రేమలతలచే బందీకృతమైంది. అతనిలో యెక్కడలేని సంతోషం ఉద యించింది. "సరే! అలాగైతే తప్పకుండా వేషం వేస్తాను. ఆ విధంగానే చేద్దాం. ఎంత డబ్బుఅయినా ఖర్చు చేద్దాం!" అంటూ లక్ష రూపాయలకు చెక్కు వ్రాసి "ఇదిగో" అని గుణకు యిస్తాడు.

అది గుణ తీసికొని అభివందనం తెల్పుతుంది.

"ఏమండీ! మన పెండ్లి గుట్టుగా జరిగిపోవాలి. ఈ విషయం ఎవరికీ తెలియకుండా వుండాలి. అందుకని మన పెండ్లి ముహూర్తాలు దేవాలయమందు జరిపించాలి సుమా!" అంటుంది గుణ.

"అ దెట్లానండీ! నేను హోదాగా బ్రతికినవాడను. పెద్దమొత్తం ఖర్చుచేసి బహిరంగంగా, బ్రహ్మాండంగా వివాహం చేసికోవాలని నిర్ణయించుకున్నాను" అంటాడు సగంచచ్చిన పాములా సుందర్.

"ఆవిధంగా జరుగకూడదు. ఈ విషయం ఎవరికీ తెలియకుండా గుట్టుగా వుండాలంటే, గుళ్ళో పెళ్ళి చేసుకోవాలి. వివాహం అయిన పిదప మనం ఎట్లా, ఏమి చేసినా ఫరవా లేదు" అంటుంది గుణ.

"సరే! మీయిష్టప్రకారమే చేయండి!" అంటాడు సుందర్.

"అయితే వెళ్ళి వస్తామండీ!" అంది గుణ. "మాటల్లో మరచేను, మీ పేర్లేమో తెలియచేస్తారా?"

"నాపేరు గుణరాజ్, నాతమ్ముని పేరు దేవరాజ్"
అంది గుణ.

"మంచిది పోయిరండి."

"గుడ్ బై" చెప్తూతూ గుణ, దేవకిలు వెళ్ళిపోతారు.

సుందర్ పరమానంద హృదయుడై తనలో తాను నవ్వుకుంటూ "నన్ను పెండ్లాడ నిరాకరించిన పడతియే నా పాదాలపై వ్రాలుతుంది. నా ఆశ ఫలించింది. అంతే చాలు. వారి వరతులు వారి మాటలు గాలిలోని పొట్టువలె చెదరి పోవుట తథ్యం. గుణ యిక కొన్నాళ్ళకు నా ప్రాణసతి, నా చరణదాసి, నా హృదయరాణి అవుతుంది గాబోలు. వారికి తగిన ప్రాయశ్చిత్తం జరగాల్సిందే. ఎవరైనా మంచిగా చెప్పితే వినరు. తగిన ప్రతీకారం చేస్తేనే దారికి వస్తారు. అందుకు యిదే తగిన మార్గం! ఎక్కడ పెండ్లి జరిగితేనేమి, నాకు కావాల్సింది గుణ" అనుకొని మురిసిపోతాడు పాపం! అసలు ఏమి జరుగనున్నదో అతనికి తెలిస్తేగా.

అంతలో సుందర్ జమీందారుదగ్గరకు కారుదున్నలవలె వున్న నలుగురు బలిష్టులైన రౌడీలు వచ్చి, "మీరు చెప్పిన పని యెప్పుడు చేయమంటారు?" అని అడుగుతాడు, వారిలో ఒకడు.

సుందర్ జమీందారు గుణ, దేవకిలను బంధించి, రహస్యంగా తన దగ్గరకు చేర్చాలని క్రితంలో యీ నూతన రౌడీ గ్రూపుతో చెప్పాడు. అందువల్ల వారు వచ్చి, ఆ సంగతి అడిగారు.

"అదేమీ చేయవద్దు. ఆ పని లోగుట్టుగా నేను సరి చేసుకోబోతున్నాను. ఆ విధంగాగాని జరుగకపోతే, మిమ్మల్ని పిలిపిస్తాను" అని వచ్చిన రౌడీలను సుందర్ సాగనంపాడు.

"గుణ యింక కొన్నాళ్ళకు నా పాదాలపై పడనుంటే, మరల యీ ప్రయత్నం యెందుకు?" అని లోలోన అనుకుంటాడు.

# 33

అది రాజు జమీందారు భవనం. మేడపై గదిలో వుండి, రామచిలుకలవలె ముచ్చట్లు ప్రారంభించారు గుణ, దేవకిలు.

"అక్కా! సుందర్ మనకోసం ఎంత తహతహలాడుతున్నాడే. మనం అంటే చాలు, పడిచస్తాడు. ఎందుకే యీ మూర్ఖునికి మనమంటే యింత ఉన్మాదం?" అంటుంది దేవకి.

"అతనికి చాదస్తం పట్టిందిలేవే! వాడి తిక్క తిన్నగా కుదిరేమార్గం చెప్తాను. ఒక పేదపిల్లను పట్టుకొనివచ్చి, అచ్చంగా నా వలె మేకప్ చేసి సుందర్‌కు పెండ్లిచేయాలి" అంది గుణ.

"అవును అక్కా! అట్లా చేస్తేగాని పట్టిన చాదస్తం పోయి సాధుత్వం కలుగదు" అంటుంది దేవకి.

"ఇందుకు మనం ఏమి చేద్దాం?" అంటుంది గుణ.

"అక్కా! యింకొక పల్లెటూరి పేదపిల్లను పట్టుకు రావాలి" అంది దేవకి.

"అవునవును...అంతే చేద్దాం! మనం ప్రయాణం చేసే టప్పుడు మొగవేషాలే వేసికొని పోవాలి. అవసరమైతే డ్రస్ మార్చడానికి వలసిన చీరెలు, జాకెట్లు బ్యాగ్‌లో తీసుకు వెళ్దాం" అంటుంది.

"ప్రయాణం యెప్పుడు?"

"రేపే, ఉదయం 8 గంటలకు."

# 34

అది చిలుకపల్లి గ్రామం. పూరికొంపలతో పూరు కళకళలాడుతుంది. పాడిపంటలతో ఆ పల్లెటూరు ప్రకాశించుచున్నది. వంకలు తిరిగిన కంకర డొంకలతో గ్రామ మావరింపబడినది. ఆ గ్రామము సకల సంపదలతో తుల తూగినను పేదకొంపలు లేకపోలేదు. అన్నమో రామ చంద్రాయని మొత్తుకొనువారు లేకపోలేదు. ఆ గ్రామాన కల దొక కడుపేద కొంప. భర్తపోయాక మరీ కూటికిలేని పేదరాలైంది లక్ష్మమ్మ. అంతా పోగా అర యెకరం పొలం, ఒక పాడియావు మాత్రం మిగిలాయి. ఆమెకు యిద్దరు కుమారులున్నారు. వారు నవయువకులు. పెద్దవాని పేరు వేణు. చిన్నవానిపేరు గోపాల్. ఉన్న అర యెకరం పొలంలోని పంట వర్షాలు లేక మాడిపోయింది. తల్లీ, కొడు

కులు నానా బాధలపాలై కృశించిపోయారు. ఉన్న ఆవును తల్లి అమ్మివేసింది.

ఒకనాడు తన పుత్రులను పిలిచి "నాయనలారా! మనకు జీవితం గడవాలంటే చాలా కష్టంగా వుంది. మీరు చూస్తే పెండ్లిచేసికొని భార్యలతో కాపురము చేయవలసిన వారైతిరి. పది తరగతులవరకు చదివితిరి. పట్టణంపోయి ఏదైనా ఉద్యోగము సంపాదించుకొని డబ్బు సంపాదించి ఒక యింటివారై సుఖించడం మంచిది" అంటుంది తల్లి.

"అమ్మా! పట్టణం పోవాలన్నా చేతిలో చిల్లి గవ్వ కూడా లేదు. ఏవిధంగా మేము పట్టణం వేళ్ళేది" అంటాడు వేణు.

"మన ఆవును 100 రూపాయలకు అమ్మితిని. అవి తీసుకొని పొండి బాబూ" అంటుంది, వచ్చే దుఃఖాన్ని ఆపుకొంటూ తల్లి.

"సరే, తల్లీ! నీ యిష్టప్రకారమే చేస్తాము" అంటారు వేణు, గోపాలుడు.

మరునాడు వేణు, గోపాలు లిరువురు బట్టలు సర్దుకొని సంచిలో పెట్టుకొని తల్లి కృపాశీర్వాదములను గైకొని యిల్లు విడచి పట్నం బయలుదేరారు. ప్రయాణమై వెళ్తున్న బిడ్డలను చూసి కన్నీరు కార్చుతుంది తల్లి. కొడుకులు యెడమైపోవు కొద్దీ తల్లి హృదయం వేగముగా కొట్టుకొనుచున్నది. కంటికి కనిపించునంతవరకు కనురెప్ప లార్పక తనవితీర చూచి తిరిగి యింటికి వచ్చి కుక్కి మంచములో కూలిపోయింది.

వేణు, గోపాల్ కలిసి మార్గంలో ఈ విధంగా వాదించు కుంటూ పోతారు.

"అన్నయ్యా! యీ మానసిక బాధ నే సహించ లేను. మిలటరీలో చేరి సిపాయినై మాతృదేశ రక్షణకై పాటు పడతాను" అంటాడు గోపాల్.

"తమ్ముడూ! మిలటరీలో చేరితే యిప్పటి బాధలకు రెట్టింపు అనుభవించాల్సి వస్తుంది. దినగండము నూరేళ్ళ ఆయుష్షురా! నా మాట విని పట్నంలో ఏదో చిన్న పని చూసు కొని మన బ్రతుకులు, మన తల్లి బ్రతుకు రక్షించుకోవాలి" అని వేణు బ్రతిమాలుతాడు తమ్ముణ్ణి.

"అన్నా! యీ బాధలు భరించేకన్న యుద్ధంలో చచ్చుటే మేలు. పేదల బ్రతుకులు ఎండకు మాడిపోయే లేత పూతలతో సమానం. అన్నయ్యా! ఈ ధనవంతుల యినుపపాదాల క్రింద పడి నలిగి నశించి కృశించేకన్నా, మిలటరీలో చేరి ప్రాణత్యాగం చేయుట మేలు" అంటాడు గోపాల్.

"తమ్ముడూ! ధనవంతుల యినుపపాదాలను జ్ఞాన మనెడి అగ్నిచే కరగించి, సరియగురీతిగా సాగదీయాలికాని, బెదిరిపోవలదు" అంటాడు.

అంతలో, పల్లెటూరి పేదపిల్లను పట్టుకురావాలని ప్రయాణమైన గుణ, దేవకిలు ఎదురౌతారు. వారి ముఖాలు వీరు, వీరి ముఖాలు వారు చూచుకుంటారు. వేణు, గోపాల్‌లు మొగవేషంలో వున్న గుణ, దేవకిలను చూచి, గొప్పవాళ్ళ

దర్జా యీ విధంగానే వుంటుందిగదా అని మనసులో అను కుంటాడు.

"తమ దేవూరండి?" అని ప్రశ్నించింది గుణ.

"మాది చిలుకపల్లి గ్రామము" అంటాడు వేణు.

"తమ దేవూరండి?" అని ప్రశ్నించాడు గోపాల్.

"మాది విజయనగరం" అంటుంది దేవకి.

"మీరు ఎక్కడికి ప్రయాణమయ్యారండి?" అంటాడు వేణు.

"ఈ గ్రామమేనండి" అంది గుణ.

"బంధువు లున్నారా?"

"లేరు."

"ఏం పనిమీద వెళుతున్నారు?"

"ఒక అమ్మాయిని చూసి, పెండ్లి సంబంధం కుదుర్చు కోడానికి" అంది గుణ.

"ఇదేమండీ! పట్టణంలో దొరకని పిల్ల, పల్లెటూరులో దొరుకుతుందా? అయినా, పట్టణం పిల్లలకన్న పల్లెటూరి పిల్లలు నాజూకుగా వుండరు" అంటాడు వేణు.

"పల్లెటూరి పిల్లే యిష్టమండి!"

"మీరేనా చేసుకునేది?"

"నేను కాదు; నా స్నేహితుడు" అంది గుణ.

"ఓహో, అలాగా!" అంటాడు వేణు.

"ఒక సిగరెట్టు వుంటే దయచేస్తారా!" అంటాడు దేవకిని చూస్తూ గోపాల్.

"అలవాటు లేదండి" అంటుంది దేవకి.

"పోనీ ముక్కుపొడి కొంచెం పెట్టండి."

"అలవాటు లేదండి."

"పట్నంవాసులు బీడీ,సిగరెట్లు దంచేస్తారంటారు! మీరు అలవాటు లేదంటారేమండి" అంటాడు ఆశ్చర్యంగా గోపాల్.

"కాల్చేవాళ్ళు కాలుస్తారు! కాని, మాకు అలవాటు లేదు" అంటుంది దేవకి.

"ఏమండీ! మీరు మా కొక చిన్నసహాయం చేసిపెట్ట గలరా?" అని ప్రశ్నించాడు వేణు.

"ఏమిటండీ?" అంది ఆశ్చర్యంగా గుణ.

"మా నాన్న చనిపోయాడు. మా తల్లి వుంది. నేనుపెద్ద వాణ్ణి. నాపేరు వేణు. వీడు నా తమ్ముడు; పేరు గోపాల్. పది తరగతులవరకు చదివేము. కూటికిలేని పేదవారము. పట్నం వెళ్లి ఏదైనా పనిచేసుకొని పొట్ట పోషించుకోవాలని బయల్దే రాము. మా పేద మొరలాలకించి మీ ద్వారా ఏదైనా చిన్న ఉద్యోగం యిప్పించగలిగితే, మీ పేరుచెప్పుకొని యింటిలో దీపం పెట్టుకుంటాం" అని కడుపులో వున్న ఆవేదనంతా జాలిగా గుణకు మనవి చేస్తాడు.

ఆ మాటలకు గుణ హృదయం నీరైపోయింది. వేణు గోపాలుర కన్నీటి బిందువులు గుణ, దేవకిల హృదయాల ప్రేమ బంధువులైనవి.

వారి ఆర్తనాదములు గుణ, దేవకిల హృదయములకు ప్రేమద్వారములైనవి. పేదవారలగు వేణు, గోపాలుర హృద యములందు గుణ, దేవకిలు వారి ప్రేమ బీజములను నాటిరి. వారిని మనసార ప్రేమించిరి. వారితో ముద్దుమురిపములాడ

వలెనని బుద్ధిపుట్టినది. కాని ఏమి చేస్తారు. మొగవేషంలో వుండిపోయారు. వీరిద్దరినే గుణ, దేవకిలు పెండ్లి చేసికొనవలెనని ఒకరికొకరు సంజ్ఞలు చేసికొన్నారు. దేవుడే యిదియంతయు కల్పించాడని లోలోన మురిసిపోయారు.

"ఏమండీ! మీరు ముందు మా మరొక పేదపిల్లను చూసిపెట్టండి, మీ అభీష్టం మేము కూడా తప్పక నేర వేరుస్తాము" అంటుంది గుణ.

"అయితే మాయింటికి వెళ్దామురండి. మా అమ్మతో యీ విషయం చెప్పి ఎక్కడనున్నా వున్నదేమో కనుగొంటాం" అంటాడు వేణు.

"అయితే పదండి!" అంటుంది గుణ.

అందరూ ప్రయాణమై చిలుకపల్లి గ్రామం వెళ్ళి వేణు, గోపాలుర యింటికి వెళ్తారు. వాళ్ళను చూసి తల్లి ఆశ్చర్యపోతూ! "ఏమిటిరా పట్నం పోకుండా తిరిగి వచ్చారు" అంటుంది.

అప్పుడు వేణు "అమ్మా! వీరు పెద్దవారు. పట్టణవాసులు వీరు మాకు పని చూపిస్తామన్నారు. ముందు వీరికొక అంద మైన గుణగణాలు గల ఒక పేదపిల్ల కావాలంట. అందుకని నిన్ను కనుక్కుందామని వీరిని వెంట తీసుకు వచ్చాము" అంటాడు.

తల్లి ఆ మాటలకు సంతోషించి వచ్చిన గుణ, దేవకి లకు కాళ్ళకు నీళ్ళిచ్చి మంచంవాల్చి పరుపువేసి చేయవలసిన పల్లెటూరి మర్యాదలన్నీ చేసింది. ఆమె అభిమానమునకు గుణ, దేవకిలు అభివందనాలు తెలుపుతారు.

"నాయనలారా! మావూరి ప్రక్క గ్రామంలో అందముగల చదువుకొన్న మంచి గుణముగల ఒక అమ్మాయివుంది. పాపం! మాలాగే వారు పేదవారు అగుట చేత ఆ అమ్మాయికి పెండ్లి యీడువచ్చినా సంబంధాలు రాలేదు. కాని యీ మధ్య నాలుగురోజుల్కితం ఒక పండు ముసలివానితో సంబంధం కుదుర్చుకున్నారని విన్నాను. పాపం! ఆ పిల్లగతి చూడు ఏమైందో! కట్నం యివ్వలేరనే దృష్టితో ఆ పిల్లను చేసుకోడానికి ఎవ్వరూ ముందుకు రాలేదు. తుదకు పండు ముసిలాడితో పచ్చని పడుచుపిల్ల కాపురంచేసే గతి పట్టింది" అని నిట్టూర్పు వదలింది లక్ష్మమ్మ.

"అయితే! మేము వెంటనే వెళ్ళి ఆ సంబంధాన్ని నిలిపి ఆ అమ్మాయిని తోడ్కొని వస్తాం" అంటూ ఆవేశంతో లేచింది గుణ.

"మీకెట్లా సాధ్యమౌతుంది బాబూ!" అంటుంది లక్ష్మమ్మ.

"సాధించితే సాధ్యము కానిదంటూ యీ లోకంలో వుందా! మా సర్వశక్తులా కష్టపడి ఆ పిల్లను తీసుకొస్తాము" అంటుంది గుణ.

"మేముకూడా వస్తాం" అంటారు వేణు, గోపాలురు. కాని గుణ, దేవకిలు "మీరు వద్దులెండి, ఆ అమ్మాయిని తీసికొని మీ యింటికే వస్తాం. అప్పుడు అందరంకలసి పట్నం పోదాం" అని వారికి నచ్చచెప్పి బయల్దేరారు.

"అక్కా! వేణు, గోపాలురు మనకు తగినవారు. వారినే మనం పరిణయమాడాలి" అంటుంది దేవకి.

"చెల్లీ! వారిని చూసిన ప్రథమ చూపులలోనే నా ప్రేమాంజలి వారి హృదయముల దాచితిని. వారే మన ప్రాణప్రియులు; వారే మన హృదయాల రాజులు" అని ప్రేమానురాగాలతో పలుకుతుంది గుణ.

ఈ విధంగా ముచ్చటించుకుంటూ, ఆ బీదపిల్ల యింటి చిరునామా తెలిసికొని వారింటికి వెళ్తారు. ఆ పేద అమ్మాయి పేరు పద్మ; ఆమె తల్లి పేరు అక్కమ్మ.

అక్కమ్మ యింటికి వచ్చిన గుణ, దేవకీలను చూచి "ఏ ఊరు బాబూ!" అంటుంది.

"మాది పట్నం" అంటారు గుణ, దేవకీలు.

"ఎవరింటికి వచ్చారండి?" అంటుంది అక్కమ్మ.

"ఇక్కడ ఒక అమ్మాయి వుంది. ఆమెకు పెండ్లి ముహూర్తం నిర్ణయించారు. వారి యిల్లు యిదేనా?" అని అంటుంది గుణ.

ఆ మాటలు విన్న పద్మ, వారగా వేసియున్న తలుపు సందులోనుండి గుణ, దేవకీలను చూస్తుంది.

"ఇదేనండి" అంటుంది అక్కమ్మ కొంచెం భయపడుతూ.

"ఆ అమ్మాయి నీ కేమాతుంది!"
"కూతురు"
"నీ పేరు?"
"అక్కమ్మ"
"మీా అమ్మాయి ఎక్కడవుంది?"
"ఇంటిలో వుందండి."

"అయితే లోనికి పోదాం పదండి" అంటుంది మొగ వేషంలో వున్న గుణ.

అక్కమ్మ కిదంతా అయోమయంగా వుంది. భయ పడుతూ గుణ, దేవకిలను లోనికి గొనిపోతుంది. అక్కమ్మ కూతురు కారుచున్న కన్నీరు తుడుచుకుంటూ తలవంచుకొని ప్రక్కనున్న మొత్తె నానుకొని చేతులు నలుపుకుంటూ నిల బడిపోయింది. అక్కమ్మా, ఆమె కూతురు వచ్చినవారు పురుషు లనే భావించుకొన్నారు. అక్కమ్మ వారికి చేయవలసిన మర్యాదలన్నీ బహు చక్కగా చేసింది.

తరువాత అక్కమ్మ కొంచెం ధైర్యంవహించి "తమ దేవ్వూరో శెలవిస్తారా ?" అని ప్రశ్నించింది.

"మాది విజయవాడ. కొంచెం పనిబడి యిటు బయలు దేరాం" అంది దేవకి.

"అక్కమ్మా నీ కుమార్తె పేరేమి?" ప్రశ్నించింది గుణ.

"పద్మ ముహూర్తం యెప్పుడు ?" ప్రశ్నించింది గుణ.

"రేపే బాబూ!" అంది విచారంగా అక్కమ్మ.

"మీా అల్లుడిగార్రి వయసు షుమారుగా ఎంత వుంటుంది ?"

ఆ మాటలు విన్న అక్కమ్మ హృదయం పగిలి బ్రద్ద లైనట్లయింది. తలవంచుకొని కన్నీరుకార్చి ఏడ్వ మొదలెట్టింది. అక్కమ్మ. పద్మ వచ్చే యేడ్పు ఆపుకొనలేక మరొక గదిలోకి వెళ్ళి ముఖానికి గుడ్డఅడ్డంపెట్టుకొని కన్నీరుమున్నీరుగా ఏడ్వ సాగింది. అక్కమ్మ నోటినుండి మాట రాలేదు.

వారి మనోవేదన గుర్తించిన గుణ, దేవకీలకు ఎక్కడ లేని జాలి వారిపై కలిగింది. అప్పుడు గుణ, దేవకీలు అక్కమ్మను ఓదార్చి, వారి నిజ స్వరూపాలను చూపిస్తారు. అక్కమ్మ ఆశ్చర్యపోతుంది.

"అక్కమ్మా! మేమూ మీలాంటి ఆడవారమే! మీరు విచారించవలదు మీకు సహాయం చేయడానికే వచ్చాం. ఏమమ్మా, యింత అందమైన చినదాన్ని వయసు మళ్ళిన ఒక పండుముసలాడికి యివ్వడానికి నీకు చేతు లెట్లా వచ్చాయి. లోకంలో యువకులే లేరనుకొన్నావా? నీ పిల్లను యెవరూ చేసుకోరనుకొన్నావా ? కనిపెంచిన కన్నతల్లివి నీవే నీ చేతులారా నీ బిడ్డ జీవితాన్ని బలిచేయ ప్రయత్నించుట న్యాయమా. నీకు మతి పోయిందా యేమి" అంది ఆవేశంతో గుణ.

"కాదు తల్లీ ! కాదు. మా రాతలే అవిధంగా వుండాయి" అంటూ దుఃఖించిది అక్కమ్మ.

# 35

పద్మ తండ్రి బడిపంతులు. మంచిబుద్ధిమంతుడు. పద్మ యస్. యస్. యల్. సి. వరకు చదువుకుంది. ఆమె పండ్రెం డవయేట తండ్రి కాలం చేశాడు. తండ్రి మరణించి యిప్పటికి ఎనిమిది సంవత్సరాలు. అనంతరం ఆస్థంతా అప్పుల పాలైంది. అక్కమ్మ, పద్మలు పేదరికం పాలయ్యారు. ఒక్కయిల్లు

మాత్రమే మిగిలింది. పద్మకు ఎన్నో సంబంధాలు వచ్చాయి. కాని కట్నం దగ్గరే, వచ్చిన సంబంధాలు వెనక్కి పోయాయి. అక్కమ్మ కట్నంయివ్వలేక సతమతమై పోతుంది.

అవును. ఈ రోజుల్లో పెండ్లికొడుకులు కన్నెలను కాదు ప్రేమించి పెండ్లాడేది. కట్నాలను. అందచందాలు, గుణగణాలు, చదువు సంధ్యలు అన్నీవున్నా, కట్నం యివ్వలేనంటే ఆ కన్నెను కన్నెత్తైనా చూడరు యీ నాటి పురుషులు.

'కట్నం' అనేపదం పేదకన్నెల కంఠాలకు ఉరిత్రాడు. పేద పడతుల పాలిట మృత్యుదేవత.

అక్కమ్మ కట్నం యివ్వలేక, ఒక ముసలితాత ఎదురిచ్చి పద్మను పెండ్లిచేసికుంటానంటే, గతిలేక పద్మను ఆ తాత కివ్వడానికి అంగీకరించి ముహూర్తం పెట్టించింది.

ఈ సంగతులన్నీ వివరంగా తెలుసుకొనిన గుణ, దేవకిలు విచారగ్రస్తులైపోతారు.

"ఏమమ్మా, లోకం గొడ్డుపోయిందని పడుచుతనపు పరువముతో పరవశించే పసిడిఛాయల పడతిని, ఒక వయసు మళ్ళిన మూడుకాళ్ళ ముసలితాత కిచ్చి పెండ్లిచేసి, నీ బిడ్డ ముద్దుమురిపాలు ముసలి మగనితో తీరకపోగా, పరపురుషుల సంయోగముచేత పాడై, వ్యభిచారిగా తయారై పుట్టినింటిని, మెట్టినింటిని అపకీర్తిపాలు చేయమని యీ సంబంధం నిశ్చయించావన్నమాట. స్త్రీజాతి నీచజాతికాదు. పతియేప్రత్యక్ష దైవమని పూజించి పతివ్రతలను పేరుగడించు కున్న పరమ పావనమైన జాతి. నారీ హృదయం నిర్మలమైనది. ఇంతి మనసు

సంతసముగా వుంటేనే సంసారనావకు చుక్కానివైయై నావను సరియగు రీతిగాదరిజేర్చును. కనుక యిప్పటికైనా కన్ను తెరచి స్త్రీ లోకమును తిలకించి, యీ పెండ్లిని నిలుపుచేసి నీబిడ్డ జీవితాన్ని కాపాడుకొనుము” అంటుంది గుణ.

“వీలులేదు తల్లీ” అంటుంది అక్కమ్మ.

“వీలు చూపించడానికే వచ్చాం? కానీ కట్నం లేకుండా మా బంధువు మీ అమ్మాయిని చేసికుంటాడు. అతడు చాల అందగాడు. నవయువకుడు. ఆస్తిపరుడుకూడాను. నీ పిల్లకు తగిన యువకుడు” అంటుంది దేవకి.

“ఈ మాట వింటే మావూరి జనులు సహించక మమ్మ వెలివేసి అపకీర్తిపాలు చేస్తారు తల్లీ. ఏదో జరిగి పోయింది; అంతే జరుగనివ్వండి” అంటుంది అక్కమ్మ.

‘‘పిచ్చిదానా! వూరివారు వెలివేస్తారని భయపడి, ముక్కుపచ్చలారని నీ బిడ్డ నిర్మలజీవితాన్ని మంటగలుపు తావా? నీకు వచ్చిన భయమేమీ లేదు. మేమున్నాం. ఊరి వారిని ఒప్పించే బాధ్యత మాది’’ అని అభయ మిచ్చింది గుణ.

“ఎట్లా తల్లీ! నాకు చాల భయంగా వుంది” అంటుంది అక్కమ్మ.

“నీవు భయపడవలసిన పనిలేదు. అన్నీ మేము చూస్తాం” అంటూ గుణ, దేవకిలు విచార సాగరంలో మునిగి తేలుతున్న పద్మదగ్గరకు వెళ్ళారు. గుణ పద్మప్రక్క జేరి,

“చెల్లీ! యీ ముసలాడిని పెండ్లిచేసికొనుట నీకు యిష్టమేనా?” అంటుంది.

ఆ మాటలు విన్న పద్మ గోరుచుట్టుపై రోకలి పోట న్నట్లు మరింతగా కన్నీరు కారుస్తూ కనులు నలుపు కుంటూ ఏడ్వసాగింది.

"ఏడ్వకు పద్మా నీకేమీ, భయంలేదు" అంటూ ఓదార్చి అసలు విషయంచెప్పమని గుణ దేవకీలు పద్మను అడుగుతారు.

పద్మ పొరలివచ్చే దుఃఖాన్ని లోలోన అణచి పైచికొని "మా నాన్నగారు వున్నప్పుడు మేము కూడా పట్నంలోనే వుండేవారము. మాకు ఆస్తికూడా వుండేది. నేను యస్. యస్. యల్. సి. వరకు చదువుకున్నాను. కాని మా దురదృష్టవశాత్తు నా పంద్రెండవ యేటనే మానాన్న మరణించాడు. ఆస్తంతా అప్పులపాలైంది పట్నంలో పొట్ట పోషించుకొనలేక పల్లెటూరు చేరితిమి. నన్ను పెండ్లి చేసికో వాలని చాలమంది వచ్చారే కాని, కట్నం యివ్వలేని వారమని తిరిగిపోయారు. ఈ పెండ్లి నాకు యిష్టంలేదు. అయినప్పటికీ ఒప్పుకొనక తప్పలేదు. ఏమి చేయను. ఇది నా జాతకఫలం" అని నిట్టూర్పు వదిలింది.

"పద్మా! నీకు వచ్చిన ఆపదేమీలేదు. నా మాట విను. రేపు పెండ్లిరోజున నీ బదులు నేను పెండ్లికూతురునై పెండ్లి పీటపై కూర్చుంటాను. నీ వేమీ కంగారుపడవలసిన పనిలేదు. నిన్ను ఒక ధనవంతుడు, యువకుడు, అందగాడైన వానికిచ్చి పెండ్లిచేస్తాము. నీ కేమైనా కష్టాలు సంభవించితే అవి నా కష్టములుగా భావించి నిన్నాదుకుంటాను. నిన్ను

నా ప్రాణముగా చూచుకుంటాను" అని పద్మకు అభయ మిస్తుంది గుణ.

పద్మ వారి మాటలకు లోబడి "సరే! అలాగే చేయండి" అంటుంది.

గుణ, దేవకి, పద్మలు కలసి అక్కమ్మ దగ్గరికే వస్తారు.

"ఏమమ్మా అక్కమ్మా, ఈ పెండ్లి నీ కుమార్తె పద్మకు యిష్టం లేదట. అందుకని నే నొక ఉపాయం చెప్తాను వినండి. ఎలాగైనా యీ ముసలి పెండ్లి జరుగకుండా మీకు అపకీర్తి లేకుండా చేస్తాను. నీకు యిష్టమేనా?" అంటుంది గుణ.

"అంతకన్నా కావాల్సిం దేముంది" అంటుంది అక్కమ్మ.

"అక్కమ్మగారూ! రేపు మీ అమ్మాయి బదులు నే పెండ్లికుమార్తెనై పెండ్లిపీఠ మలంకరించుతాను. అప్పుడు ఆ ముదుసలి పెండ్లికొడుకు నా మెళ్ళో తాలిగట్టబోతాడు. అంతలో వెంటనే నేను లేచి, యీ ముసలాడిని నేను చేసికో నంటాను. పెండ్లికి వచ్చినవారంతా చేసికోవల్సిందే అని బలవంతం చేస్తారు. అప్పుడు నా చెల్లి దేవకిని నాకు అక్కగా సభవారికి తెలిపి యీమెను మీలో యెవ్వరైనా ముందుగా పరిణయమాడిన వారికి ఐదువేల రూపాయలు కానుకగా యిస్తానంటాను. అప్పుడు దేవకి సౌందర్య రూపురేఖలకు ముగ్ధులై చేసికుంటామని ముందుకు వస్తారు సవయువకులు. అప్పుడు నీవు పెండ్లికుమార్తెగా ముస్తాబై పెండ్లిపీటమీదికి రావలెను" అంటుంది గుణ.

"నేనా" అని ఆశ్చర్యపోతుంది అక్కమ్మ.

"అవును, నీవే. మన స్త్రీజాతి యీ విధంగానే నాశనమైపోతూంది. అట్లా నశింపకుండా చూడవలెనంటే యిదే మార్గం. నేను చెప్పినప్రకారం చేయవమ్మా, తరువాత నే చూచుకుంటాను. నీ కుమార్తెకొరకైనా నీవు యీ స్వల్ప త్యాగం చేయాలి" అని చెప్పి గుణ అక్కమ్మను ఒప్పిస్తుంది.

పెండ్లికుమారుడైన శేషయ్యగారికి పెండ్లికి కావలసిన యేర్పాట్లన్నీ చేయించి పెండ్లిముహూర్తమునకై ఎదురు చూస్తున్నాడు. తెల్లబడిన వెంట్రుకలకు రంగుపూతలు పూసి నలుపుచేసుకున్నాడు. సొట్టబుగ్గలు కొంచెం సరిచేసుకున్నాడు. ఊడిపోయిన పళ్ళసందులలో బంగారుదంతాలు బిగింపు చేసుకున్నాడు. అత్తరు, సెంటు, సువాసన నూనెల విషయం చెప్పనక్కరేలేదు. అన్ని హంగుల్తోనూ ముసలితాత పెండ్లి కుమారుడయాడు.

గుణ, దేవకిలు పెండ్లికుమార్తెలకు కావలసిన వస్త్రాదులన్నీ సమకూర్చుకొన్నారు.

# 36

మరునాడు తెల్లవారుఝామున నాలుగు గంటలకు ముహూర్తమనగా ఒకగంట ముందుగనే బాజా భజంత్రీలు మ్రోగాయి. బంధుమిత్రులు, పెద్దలు, పేరంటాళ్ళు వగైరాలతో పెండ్లి పందిరి కళకళలాడుతోంది. పందిరినిండా పచ్చ తోరణాలు, రంగు కాగితాలు అందంగా అలంకరించ

బడ్డాయి. పురోహితులు ముహూర్తమునకు కావలసినవన్నీ సిద్ధపరచి పెండ్లికుమారుని వచ్చి పెండ్లి పీటపై కూర్చుండ మని తెలియ జేస్తారు. పాపం, పెండ్లి కుమారుడైన ముసలి శేషయ్యగారిని యిరువురు యువకులు పట్టుకొని తీసికొని వచ్చి పెండ్లి పీటపై కూర్చుండబెట్టారు. పెండ్లి కుమార్తెయగు గుణను యిద్దరు పేరంటాళ్లు తీసికొనివచ్చి శేషయ్యగారి ప్రక్కనున్న పెండ్లి పీటపై కూర్చుండ బెట్టారు. పురోహితులు మంత్రపఠనం వల్లించారు. వధూవరులచే కొన్ని మంత్రాలు చెప్పించి మంగళసూత్రం శేషయ్యగారి కందించి వధువు మెడలో మూడు ముళ్ళతో ముడివేయమన్నారు. పెండ్లి కుమారుడైన శేషయ్యగారు హుషారుగా లేవబోయాడు. కాని కాళ్లుపట్టుకుపోయి మోకాళ్లు నొప్పులు మొదలెట్టాయి. పాపం ఒక చేతిని క్రిందానిచ్చి పైకి లేచాడు, కొంచెం ఓపిక చేసుకొని. గుణ మెడలో మంగళసూత్రం కట్టబోయాడు. కాని గుణ తటాలున లేచినిలబడి "అయ్యయ్యో! పెండ్లికొడుకు ముసలివాడని నాకు తెలియదే! అక్కమ్మ కూతురు పద్మ చేసుకోనంటే నేను చేసికుంటానన్నాను. ముందుగానే ముస లాడని తెలిసివుంటే ముహూర్తానికి వచ్చేదానినే కాదు. ఆ మంగళసూత్రం, ఆ ముసలితాత చేతుల్లో వుంటే, నా గొంతు కది ఉరిత్రాడులా నాకళ్ళకు గోచరమగుచున్నది.

"నే నీ పెండ్లి చేసుకోను" అంటూ గొడవ చేస్తుంది గుణ. పందిరిలో వున్నవారంతా ఆమె అందచందాలకు ఆమె తారుణ్యలావణ్య చెలువములకు ముగ్ధులై, ముసలివరుడైన శేషయ్య అదృష్టవంతుడని తలపోస్తారు. గుణ అల్లరిని చూసి,

"తప్పక యీ పెండ్లి జరగాల్సిందే! గుణ పెండ్లి చేసుకోని తీరాల్సిందే. ముసలివాడైనా, మూగవాడైనా, పడచు వాడైనా మొగవాడేగదా!" అంటారు ఏకకంఠంతో.

గుణ చేసికోనని పట్టుపడుతుంది.

"అదేమీ! వీలులేదు! ఎక్కడా యీ విధంగా పెండ్లి పీటలమీదనుండి లేచి పెండ్లిని నిరాకరించిన పెండ్లి కుమార్తెను మేము గాంచలేదు. ఏ చరిత్ర పుస్తకాలలోను, యిటువంటి విచిత్రసంఘటన మేము చూడ లేదు చదువలేదు" అని వాదించి, తప్పక పెండ్లి జరగాలని అందరూ గట్టిగా పట్టు పట్టారు.

అప్పుడు గుణ అందరినీ సముదాయించి "అయ్యలారా! మీరు చెప్పినది గ్రహించితిని. కాని నేను వచించునది కూడా కొంచెం శాంతం వహించి ఆలకించాలి" అని మనవి చేసి, ప్రక్కనే వున్న దేవకిని "అక్కా యిలా రా" అని పిలిచి దేవకిని అందరికి చూపించి, "ఏమండీ! యీమె నా అక్క. అక్కకు పెండ్లికానిదే చెల్లెలు వివాహమాడుట అధర్మము, అన్యాయము గదా. కాబట్టి లోకరివాజుగా నా అక్కపెండ్లి కానిదే నేనూ వివాహమాడను. అందుకై ముందుగా నాఅక్కను మీలో యెవరైనా ఒకరు పెండ్లి చేసికొనవలెను. చేసు కున్నవారికి 5 వేల రూపాయలు యిస్తాము. తరువాత నేను యీ శేషయ్యగారిని పెండ్లి చేసికుంటాను" అంటుంది.

దేవకిని చూసి అందరూ ముగ్ధులైపోతారు. దేవకి, పండువంటిచిన్నది. అందాల పసిడిబొమ్మ. అపురూప సుందరి. పాల బుగ్గల పడతి. వయ్యారిభామ. త్రిలోక సుందరి.

ఆమెను చూసిన పండుముసలికైనా ఒడలు పులకరించు ననుటలో సందేహములేదు. ఆమెను చూచి''నాకు నాలుగు వేలు యిస్తే చాలు" అని ఒకరూ, "నాకు మూడు వేలు యిస్తే చాలు'' అని మరొకరూ, "నాకేమీ యివ్వనక్కరలేదు. వూరకనే చేసుకుంటాను" అని యింకొకరూ యీ విధంగా పోటీలు పడ్డారు. చిట్ట చివరికి వూరకనే చేసుకుంటానన్న యువకుడు ముందుకు వస్తాడు. ''సరే! అలాగే చేసికొమ్మని గుణ అంగీకరించిది. యువకుడు పెండ్లి కుమారుడుగా తయారౌకు కాబోయేవాడు వువ్విళ్లూరుకుంటూ. దేవకిని పెండ్లి కుమార్తెగా తయారుచేయడానికి గుణ లోనికి పంపుతుంది. నూతన వరుడు వచ్చి పెండ్లి పీటనలంకరించాడు. లోనికి వెళ్ళిన దేవకి లోనే వుండిపోయింది. అంతక్రితమే పెండ్లి కుమార్తెగా ముస్తాబై తయారుగా వున్న ముసలి అక్కమ్మకు ముసుగువేసి నెమ్మదిగా అమ్మలక్కలు పట్టుకొనివచ్చి పెండ్లి మంటపమునందలి పీటపై కూర్చుండ పెట్టారు. పందిరిలో వున్నవారంతా దేవకి అందాన్ని తలచుకుంటూ నివ్వెరపోతారు. ఏమి జరుగుతుందా అని రెప్పవాల్చక చూస్తుంటారు. బ్రాహ్మణులు మంత్రపఠనం చేసి యువకుని చేతికి మంగళసూత్రం అందించారు. యువకుడు అత్యానందంతో మంగళ సూత్రాన్ని అందుకొని పెండ్లి కుమార్తె మెడలో ముడివేయ బోతూ, వధువు ముఖం పరికించి పిచ్చి వాడిలా "యిదంతా మోసం! యీ ముసలి దానినా నే పెండ్లి చేసుకునేది? ఈమె నాకు తల్లిలాగ వున్నదే! ఇదంతా పచ్చి మోసం! నాకు లక్షరూపాయలు యిస్తానన్నా యీ

పెండ్లి నేను చేసుకోను. ఈపెండ్లి కొకదండం, మీ కొక దండం ఈ పెండ్లే నా కక్కరలేదు"అని అక్కడనుండి వెళ్ళి పోతున్న అతన్ని, గుణ ఆపుచేసి "తప్పక యీ ఆమెనే నీవు పెండ్లి చేసుకు తీరాలి" అంటుంది.

"నేను చేసికోనంటే చేసికోను" అంటాడు, నూతన వరుడు.

"ఏమయ్యా! స్త్రీల కొకధర్మము, పురుషుల కొక ధర్మమా! నీతి న్యాయములు స్త్రీ పురుషులకు సమాన మార్గమున వర్తించుటకు వీలులేదా? స్త్రీ పురుషులు వేరైనంత మాత్రమున, శాస్త్ర సమ్మతమైన సిద్ధాంత ధర్మ సూత్రములు కూడా వేరు కావలెనా? ఏడతి పతి పాద సేవకురాలైనంత మాత్రాన, మోహ దాహము తీరని ఒక పడుచు కన్యను దేహముడిగి పండు బారిన ఒక ముసలి తాతకు కట్టబెట్టుట భావ్యమా? ఆడపిల్లల గన్న తల్లి దండ్రులు యిది సహించి శిరసావహించగలరా! మానాభిమానములు నశింప మానవజాతి సహించదు. పడుచు కన్నెలను యిటువంటి పెండ్లిబాధలకు గురిచేసిన భారతమాత ఉపేక్షించి వూరకుండ బోదు" అని గుణ నూతన వరుని చూచి, "నీవు ఆమెను పరిణయమాడిన, యీ తాతను హృదయపూర్వకముగా నేను వివాహం చేసికుంటాను" అంది.

ఈవిచిత్ర సంఘటనను కనులారగాంచి ఏమిచేయుటకూ తోచక పెద్దలుదిష్టిబొమ్మలవలెవుంటారు. గుణ నీతి నియమా లకు,నిర్మల హృదయభావాలకు ఆశ్చర్యచకితులై, ఎవరికివారే లేచి ఇంటికి మార్గాలువెతుక్కుంటూజారుకున్నారు. శేషయ్య

గారుకూడా "నా పెండ్లి సర్వనాశనం అయింది" అని తల పట్టు కొని వెళ్ళిపోతాడు. అప్పుడు అక్కడవున్న గుణా, అక్కమ్మా కలసి సంతోషంగా యింటి లోనికి వెళ్ళి, పద్మ, దేవకిలను కలిసి కొని మరింత ఆనందపడతారు. గుణయొక్క దీక్షాలోచనకు అందరూ ఆమెను ప్రశంసిస్తారు. పద్మ భానోదయమున వికసించిన పద్మమువలె ప్రకాశించిపోయింది. కారుచీకట్లను చీల్చుకొను వెలుగువలె పద్మ ముఖములోని విచార రేఖలు మాయమై సంతోష రేఖలు చిగురించాయి. ఆమె హృదయ దీపికలో అడుగంటిన ఆశాజ్యోతి కళకళలాడి పోతుంది. ఆమెలో చిగురించిన సంభ్రమాశ్చర్యములు యింతయని వర్ణింప సాధ్యముగాదు.

# 37

మరునాడుదయం కాఫీఫలహారములు సేవించి గుణ, దేవకి, పద్మ, అక్కమ్మలు కూర్చుని వుంటారు. అంతలో శేషయ్యగారు పెండ్లిఖర్చులు వసూలుచేసుకురమ్మని యిద్దరు కులపెద్దలను అక్కమ్మ యింటికి పంపుతాడు. ఆ కులపెద్దలు అక్కమ్మవద్దకు వచ్చి పెండ్లిఖర్చులు అడుగుతారు. అప్పుడు గుణ "అట్లానా! పెండ్లిఖర్చులు కావాలా! కోర్టుకువెళ్ళి దావా వేసికోండి" అంటుంది. ఆ మాటలకు పెద్దలు కోర్టుకు వెళ్లిన వారికే నష్టమని తిరిగి వెళ్ళిపోతారు.

తరువాత గుణ, "ఏమమ్మా! పద్మను మేము తీసికొని వెళ్లి ఒక ధనవంతుడు చక్కని యువకుని చూసి కల్యాణం చేస్తాము. మేము బీదవారిని చేసుకుంటాము. మాకు చాల ఆస్తి వుంది. అందువల్లనే మే మీ విధంగా చేస్తున్నాము. నీవు ఏమీ భయపడవలదు. నీ భుక్తికోసం యీ 2 వందల రూపాయలు నీయొద్ద అట్టిపెట్టుకొనుము. తరచు వుత్తరాలు వ్రాస్తుంటాము"అని అక్కమ్మను ఒప్పించుకొని, పద్మను తీసికొని గుణ, దేవకిలు ఎప్పటివలె మొగవేషాలు ధరించి తిన్నగా చిలుకపల్లి గ్రామములో వున్న లక్ష్మమ్మ యింటికి వస్తారు. పద్మతో మేము స్త్రీలమని ఎవరికీ చెప్పవద్దని చెప్పుతారు. వేణు, గోపాలుర కోసం పరితాపంతో దిక్కులు పారజూచారు. లక్ష్మమ్మ వారికి చేయవలసిన మర్యాదలన్నీ చేసి "ఏంజరిగింది బాబూ!" అని అడుగుతుంది.

"అక్కడ యిద్దరు అమ్మాయిల సాయంతో ఆ పెండ్లి నాపుచేసి పెండ్లికుమార్తెను తీసికొనివచ్చాం. ఈమెను మా పట్నంలోవున్న ధనవంతునికిచ్చి పెండ్లిచేస్తాం! మీ అబ్బాయిలను పంపండి. పట్నంలో ఉద్యోగాలు చూపించుతాము. ప్రతి నెలాఖరుకు డబ్బు నీకు పంపేమార్గం యేర్పాటు చేస్తాం" అంటుంది గుణ. ఆ మాటలకు లక్ష్మమ్మ సంతోషించి "అట్లానే చేయండి బాబూ" అంటుంది.

ఆ పూట వారికి లక్ష్మమ్మ భోజనం యేర్పాట్లు చేసింది. భోజనాలయాక, గుణ లక్ష్మమ్మ కుమారుల యొద్దనున్న నూరు రూపాయలు తీసికొని వాటికి మరో వందరూపాయలు కలిపి రెండు వందలూ లక్ష్మమ్మకు యిచ్చి, "మీ అబ్బాయిలకు

ఏమీ భయంలేదు. ఈ డబ్బు మీకే వుంచుకోండి" అని ఆమెవద్ద సెలవు తీసుకొని ప్రయాణమౌతాడు. లక్ష్మమ్మ చాలా ఆనందంతో "నీవు ఎంత దయామయులు. నా బిడ్డలు అదృష్టవంతులు" అని తలంచి వాళ్ళను సాగనంపుతుంది.

## 38

గుణ, దేవకి, పద్మ, వేణు, గోపాల్ ఐదుగురూ కలిసి బయలుదేరి పట్నం చేరుకొని, ఒక హోటలులో బస చేస్తారు. తరువాత వేణు, గోపాలురను రెండు రోజులవరకు అక్కడనే బసచేయమని, వారి ఖర్చులకు డబ్బు యిచ్చి గుణ, దేవకిలు పద్మను తీసికొని బయలుదేరుతారు. అప్పుడు వేణు "మా ఉద్యోగాల సంగతేమి?" అంటాడు. "ఉద్యోగాలు చూచి మరీ వస్తాం" అని వారిని ఒప్పించుకొని, గుణ, దేవకిలు పద్మతో వారింటికి వెళ్తారు.

అప్పుడు రాజు జమీందార్ "ఇన్నాళ్ళవరకెక్కడికి వెళ్ళారమ్మా? ఈమె యెవరు?" అని ప్రశ్నించాడు.

"మా స్నేహితుల దగ్గరకు వెళ్లాం నాన్నా. అంతా కులాసాగానే యున్నారు. ఇంకో రెండురోజులు వుండమని బలవంతం చేశారు. మేము వుండకుండా, నిన్ను చూడాలని త్వరగా వచ్చాం. ఈమె పల్లెటూరిపిల్ల. కడుపేదరాలు. పేరు పద్మ. మన యింటిపనుల్లో మనకు సాయంగా వుంటుందని

మా స్నేహితురాలు యింటిదగ్గరనుండి తీసికొని వచ్చాం నాన్నా" అంటుంది గుణ.

"సరే! మంచిది. వెళ్లి స్నానంచేసి భోజనాలు చెయ్యండి" అంటాడు ఆప్యాయంగా రాజు.

పద్మ, రాజు జమీందారీ భవనం, అందలి అలంకార ములు, పాన్పులు, సోఫాలు మొదలైనవన్నీ చూచి ఆశ్చర్య పడుతుంది.

మరునాడు గుణ, దేవకిలు పట్నంలో ఒక రూము అద్దెకు తీసికొని వేణు, గోపాలురను ఆ రూములో బసచేయ మని చెప్పి వారికి కావలసిన సకల సౌకర్యములు చేస్తారు. భోజనం హోటలునుండి తెప్పించుకునే యేర్పాటుచేశారు. మొగవేషములోవున్న గుణ, దేవకిల చూసి "ఏమండీ, మాకు ఉద్యోగాలు యెప్పుడు చూపిస్తారు ?" అని జాలిగా ప్రశ్నించాడు వేణు.

"మేము మీ ఉద్యోగాలకోసమే వెళ్తున్నాం. నాలు గైదు రోజుల్లో మీకు ఉద్యోగాలు లభించేలా ప్రయత్నించి చూస్తాం. మీరు ఉద్యోగాలు దొరకలేదని బెంగగా వుండ వలదుసుమా. మీ కెటువంటి కొరతా రాకుండా చేసే బాధ్యత మాది. ప్రతిదినం మీ దగ్గరకు వచ్చిపోతుంటాం" అంది పొరలివచ్చే ప్రేమపలుకులతో గుణ.

అందుకు వేణూ, గోపాల్ సంతసం వెలిబుచ్చుతారు.

# 39

లక్షరూపాయలు కాజేసిపోయిన బొంబాయివాలాస్ యింకా తన గుమ్మం తొక్కనందుకు సుందర్ మండిపోతున్నాడు. తన బుద్ధిహీనతను గురించి సిగ్గుపడుతున్నాడు. కనపడితే వారిని నమిలి మింగేలాగున్నాడు.

అంతలో తన ఫ్యాక్టరీ ఆఫీసర్లు వచ్చారు. "నమస్తే సుందర్ గారు" అన్నారు.

మండిపోతున్న సుందర్ వారిని కసిరికొట్టాడు. ఆ కసిరింపుకు ఆఫీసర్లు కలవరించిన జింకల్లా బెదరి బయటపడ్డారు.

అదే సమయంలో పురుషవేషాల్లో వున్న గుణరాజ్, దేవరాజ్‌లు అక్కడ ప్రత్యక్షమయ్యారు.

"నమస్తే సుందర్" అన్నారు గుణరాజ్, దేవరాజ్.

"గెట్ అవుట్" అన్నాడు సుందర్ వచ్చినవాళ్ళెవరో గమనించకుండా.

"ఏమిటి సుందర్ అలా అంటావు" అన్నాడు గుణరాజ్. ఆ మాటలు విన్న సుందర్ వెనక్కితిరిగి "ఓహో మీరా? ఐ యామ్ సారి" అంటూ అమితానందంతో వారిని ఆహ్వానించాడు.

కుశలప్రశ్నలతో కొంత సమయం గడిచింది.

"సుందర్! గుణకు ఒక మంత్రం పెట్టించాం. ఆ మంత్రంతో గుణ నీ మనిషి అయిపోయింది. అంటే నిన్ను తప్ప యితరులను పెండ్లి చేసుకోదు. నీవంటే మనసిచ్చి వూరుకుంటుంది" అని గ్యాస్ కొట్టారు.

ఆ మాటలకు సుందర్ వుబ్బిపోయాడు.

"మరొక్క మాట సుందర్ ! సిద్ధాంతం ప్రకారం గుణ, దేవకిల పెండ్లి ఒకేరోజు జరుపకూడదు. మధ్య ఎనిమిది రోజులు యెడముండాలి. కనుక ముందుగా నీవు గుణను పెండ్లాడాలి" అన్నాడు గుణరాజ్.

ఆ మాటలకు సుందర్ పరమానందభరితు డయ్యాడు.

"ఏమండీ ! గుణరాజ్‌గారూ ! పెండ్లి ముహూర్తం ఎప్పుడు నిశ్చయించారు ?" అని హుషారుగా ప్రశ్నించాడు సుందర్.

"అదే చెప్పాలని వచ్చా వచ్చే శుక్రవారం రాత్రి ఒంటిగంటకు లగ్నం మంచిదని పురోహితుడు చెప్పాడు. అందు కని అదేరోజు ముహూర్తం నిశ్చయించాం. మల్లేశ్వరస్వామి దేవాలయంలో యీ పెండ్లి జరుగుతుంది. మీరు శుక్రవారం రాత్రి పన్నెండు గంటలకే గుడి దగ్గరకువచ్చి రెడీగా వుండాలి సుమా !" అన్నది గుణ.

"ఆల్‌రైట్ ! మీరు చెప్పింది కరెక్టు. మీరు చెప్పినట్లే చేస్తాను" అంటాడు సుందర్.

అంతలో పనివాడు కాఫీ తెస్తాడు. ముగ్గురూ కాఫీ త్రాగుతారు.

"మేము పెండ్లికుమార్తె అయిన గుణను దేవాలయం దగ్గరకు శుక్రవారం రాత్రి ఒంటిగంటకు తీసుకొనివచ్చి తయారుగా వుంటాం. మీరు ఆలస్యంచేయక రావాలి" అని మరొక పర్యాయం హెచ్చరించి గుణ, దేవకిలు వెళ్ళిపోతారు.

సుందర్ పట్టలేని పరమానందంతో మైమరచిపోతాడు. తనను వివాహమాడడానికి నిరాకరించిన గుణ తన పాదాల చెంత పడిగాపులుండే సమయం వస్తూందిగదాయని కలలుకంటు న్నాడు. తన్నెదిరించిన గుణ కొద్దిరోజుల్లో తన పడకచేరి తన ముద్దు మురిపములు తీరుస్తుందని మురిసిపోతున్నాడు. గుణను వివాహం చేసుకొని ఆమెను కలసుకొను మొదటిరోజున ఏమేమో అడుగవలెనని ఊహల్లపై ఊహలు పన్నుతున్నాడు పాపం! అసలు ఏమి జరుగనున్నదో తెలియని అభాగ్యుడైన సుందర్.

# 40

గుణ, దేవకిలు స్వగృహాన్ని చేరుకని పద్మను పిలిచి "పద్మా, నీవు మేము చెప్పినట్లు చేయాలి. నీవు నా మాదిరిగా తయారుకావాలి. నీ పెండ్లి శుక్రవారం జరుగబోతుంది. పెండ్లి కొడుకు జమీందారైన సుందర్. నీవు పేదపిల్లవని తెలియ రాదు. నీవు గుణనే అని చెప్పాలి. ఒకవేళ సుందర్ జమీం దార్ కొన్నాళ్ళకు అసలు రహస్యాన్ని తెలిసికొని నిన్ను వదిలివేసి యింటినుండి తరిమివేసినా భయపడవలదు. నిన్ను కాపాడి నీ భర్త నీకు దక్కునట్లుజేసి నీ కాపురం సరిచేస్తాం" అని గుణ, అసలు కథంతా పద్మకు విశదంగా విప్పి చెప్పి పద్మను ఒప్పిస్తుంది.

తరువాత తండ్రిదగ్గర కెళ్లి "నాన్నగారూ, మనయింటిలో వున్న పద్మకు మా స్నేహితురాలు ముహూర్తం నిశ్చయించి

ఆమెకి పెండ్లి చేయబోతూంది. పెండ్లి వచ్చే శుక్రవారమే. అందాక మన యింట్లోనే వుంచుతున్నారు. ఖర్చులకు కావలసిన డబ్బుకూడా యిచ్చారు" అని విన్నవించింది గుణ. తండ్రి అందుకు సమ్మతించాడు. అప్పుడు గుణ "నాన్నగారూ, యీ పెండ్లికి నీవు మాకు సహాయకారిగా వుండాలి" అంటుంది.

"ఏమిటి తల్లీ ! నే చేయవలసిన సహాయం ?" అని ప్రశ్నించాడు నవ్వుతూ రాజు.

"పద్మ తండ్రిగా నీవు నటించాలి" అంటుంది కొంచెం బెదురుతూ గుణ.

"నేనా !"

"అవును నాన్నా !"

"అంత పనేమి వచ్చింది ?"

"చెప్తాను వినండి. పద్మను సుందర్ జమీందారుకిచ్చి పెండ్లి చేయాలని యేర్పాట్లు చేశాం. సుందర్‌ను మేము చేసుకొనడానికి నిరాకరించామని మీరులేని సమయం చూచి మమ్ము మహాకష్టపెట్టి మాపై దుర్మార్గం తలపెట్టాడు. మా అభిమానాలను భంగపర్చవలెనని ప్రయత్నించాడు. మేము అందుకు యిష్టపడక తగిన వుపాయాలతో తప్పించుకున్నాం. తుదకు మమ్ములను హతమార్చాలని సిద్ధహస్తుడై విఫలుడయ్యాడు. అనేకవిధాలుగా మమ్ములను తన వశం చేసుకోవాలని యత్నించాడు. మాయందు చాల మూర్ఖుడై వర్తించాడు. అటువంటివానికి తగినట్లు బుద్ధి చెప్పాలని మేము నిర్ణయించుకున్నాము. అతనికి పేదపిల్లగు పద్మను యిచ్చి మా చేతులతో పెండ్లి చేయాలని తలంచాం.

అందుకు మా స్నేహితులంతా అంగీకరించారు. అది యేమన మా స్నేహితులు సుందర్‌ను కలిసికొని "గుణను నీకిచ్చి పెండ్లి చేస్తాం. చేసుకుంటావా ?" అని ప్రశ్నించారట.

"అంతకన్నా కావాల్సిదేముంది" అని యిష్టపడ్డాడట. పద్మ పోలికలు, నా పోలికలు ఒకేవిధంగావున్నాయి. ఏమవంటి భేదము మాయిరువురి రూపురేఖలలో మృగ్యం. కాబట్టి పద్మనే గుణయని చెప్పి సుందర్‌కిచ్చి పెండ్లి చేయనిశ్చయించాం. పెండ్లి శుక్రవారము రాత్రి ఒంటిగంటకు మల్లేశ్వరస్వామి దేవాలయములో. మేము తండ్రివైన నిన్ను కోరునదేమన యీ ముహూర్తమునకు మీరు దయచేసి పద్మ నీ బిడ్డయే యనునట్లు నటించి సుందర్ హృదయం దృఢము చేయుము" అంటుంది దీనంగా గుణ.

తండ్రి ప్రప్రథమంగా కొంచెం శంకించి అది అసాధ్యమన్నట్లు వ్యక్తంచేశాడుకాని గుణయొక్క విశాల భావాలకు ముగ్ధుడై ఆమె నీతి నిజాయతీ నియమములకు భ్రాంతుడై ఒప్పుకొనక తప్పిందికాదు. అప్పుడు గుణ, దేవకిలు తండ్రి చేయూతకు సంతసించి వారి స్నేహితులను కలుసుకొన వెళ్లారు.

# 41

సుందర్ తన ముఖ్యులకు వివాహ ఆహ్వాన పత్రికలు పంచిపెట్టుకున్నాడు. పెండ్లిరోజు యెప్పుడువస్తుందా, గుణమెళ్ళో తాళి ఎప్పుడు గట్టుదునా !" అని సుందర్ ఆలోచిస్తూ ఊహాలపై ఊహాలు పన్నుతున్నాడు.

# 42

శుక్రవారం రానే వచ్చింది. రాత్రి 12 గంటలు అయింది. గుణ, దేవకిలు తమ స్నేహితురాండ్ర సాయంతో పద్మను పెండ్లి కుమార్తెను చేసి మల్లేశ్వరస్వామి గుడివద్దకు చేర్చి స్నేహితులకు చెప్పవలసిన వుపాయసూత్రములు చెప్పి వారినక్కడే దిగబెట్టి గుణదేవకిలు తిరిగివస్తారు. రాజు జమీందార్ కూడా గుడివద్దకు వచ్చాడు.

అంతకుముందే సుందర్ జమీందార్ కళ్యాణానికి కావలసిన యేర్పాట్లన్నీ సిద్ధంచేసివుంటాడు. రాజు జమీందార్ పద్మతో రావడంచూసి పద్మను దేవకియేయని భావించు కుంటాడు. రాత్రి ఒంటిగంటకు పెండ్లి జరిగిపోతుంది. సుందర్ సతీసమేతముగా స్వగృహాన్ని చేరుకుంటాడు.

మరునాడు మహావైభవముగా సుందర్ స్నేహిత బృందమునకు విందు యేర్పాటు చేస్తాడు. పద్మ, గుణల పోలికలు ఒక మాదిరిగా వున్నందువల్ల సుందర్ పద్మను గుర్తించలేక పోయాడు. గుణయేయని తలంచుకుంటాడు. పేదపిల్లనిమాత్రం తలంచడు. ఈవిధంగా కొన్నాళ్ళు పద్మతో సుందర్ సంతోషంగా కాపురము చేయుచుండగా, ఒకనాడు చిలుకపల్లి గ్రామముదాపున వున్న గ్రామస్థుడైన ముసలి శేషయ్యగారు సుందర్ యింటికి వస్తాడు.

శేషయ్య సుందర్ తండ్రియొక్క స్నేహితుడు. తరచు శేషయ్య సుందరింటికి వచ్చిపోతుంటాడు. సుందర్ జమీం

దార్, పద్మ యిరువురు కూర్చుని ఏదో ముచ్చటించుకుంటూ కాఫీ త్రాగుతుంటారు. అదే సమయంలో శేషయ్య వస్తాడు. శేషయ్యను చూచి పద్మ లోనికి వెళ్తుంది. శేషయ్యను గుర్తు పట్టింది. తనను పెళ్లి చేసుకోవాలనుకున్న తనవూరి శేషయ్యే నని దృఢనిశ్చయురాలైంది. గుండెల్లో రైళ్ళు పరుగెత్తు తున్నాయి. సుందర్‌కు తనమీద ఏమి చెప్తాడోయని తత్తర పడుచున్నది.

శేషయ్య రావడం చూచిన సుందర్ "రండి రండి, కూర్చోండి" అని అక్కడున్న కాఫీగ్లాసు చేతికిస్తాడు.

"ఏమండీ సుందరయ్యగారూ మీకు పెండ్లి అయిందా?" అంటాడు.

"ఆఁ...ఆ... అయిందండి. మీదగ్గరకు రావడానికి కూడా టైము లేకపోయింది. చాల తొందరగా జరిగిందండి. బంధువులను పిలిపించే టైముకూడా లేకపోయింది. మీకు చెప్పలేదని మీరు వేరుగా తలంచక నన్ను మన్నించండి" అంటాడు సుందర్.

"ఏమండీ! మీకు యిక్కడెక్కడా సంబంధం దొరక లేదా? పోయిపోయి ఒకపేద కుటుంబరాలైన పల్లెటూరి పిల్లను పెండ్లిచేసుకున్నారేమిటండి" అంటాడు అదోరకంగా శేషయ్య పాపం! పెద్దతనం – చూపు తక్కువ – అందుచేతనే పట్నం జమీందారీ బిడ్డను చూసి, పల్లెటూరి పిల్లా! అంటున్నాడు అనుకున్నాడు అంతరంగంలో–అసలు అమో మయులెవరైందీ గమనించలేని సుందర్.

"అదేమిటండోయ్ - అసలైన పట్నంపిల్లను పట్టుకొని పల్లెటూరి పిల్లని తెలిసినవారిలా తెలియజేశారు!"

"అవునండీ! తెలియబట్టే అనగలిగేను"

"మీ ఉద్దేశం! మా ఆవిడ యెవరను కున్నారు" కొంచెం విసుగ్గా ప్రశ్నించాడు సుందర్.

"మా వూరి విధవరాలు అక్కమ్మ కుమార్తె పద్మ గదటండి. నేను యెరుగనన్నట్లు చెప్పబోతారేమండి!" పొట్ట బుగ్గలు గుంటలు పడేటట్టు, బోసినోటితో చప్పరించాడు శేషయ్య.

ఫక్కున నవ్వాడు సుందర్, శేషయ్యగారికి మతిచలించిందని వూహించి. అతని నవ్వులోని అంతరార్థమేమిటో అంతు పట్టని శేషయ్య దిగాలుపోయి చూస్తాడు సుందర్ ముఖంకేసి. "శేషయ్యగారూ! ఈవిడ యీ నగర నివాసియైన రాజు జమీందార్ ద్వితీయ పుత్రీరత్నం. పేరు గుణ" అంటాడు సుందర్.

"కాదు బాబూ! కాదు! ఈమె అక్షరాలా అక్కమ్మ కూతురు పద్మ. ఈమె తల్లి విధవరాలు. తింటానికి తిండిలేని పేద వారు. పుటక దరిద్రులు. వీరి పుట్టుపూర్వోత్తరాల పురాణం పుస్తకాలలో వ్రాసి భద్రపరచినా చెదలుపట్టి పాడై పోతాయని నా నాలికపై లిఖించి బుర్ర గూటిలో భద్రపరచి వుంచాను. ఈ మధ్య ఒక నెల క్రితం యీవిడను నాకు పాణి గ్రహణం చేయడానికి తల్లీ కూతురు యిష్టపడి తుదిఘడియలో యిద్దరు అమ్మాయిల కారణంగా ముహూర్తం ముదష్ట మయింది. అంత అనుభవశాలివిగదా! అసలు రహస్యం నా

ముందు దాచాలని ప్రయత్నించావన్న మాట” అంటూను ముసి ముసి నవ్వులు నవ్వుతూ శేషయ్య.

“శేషయ్యగారూ!” వ్రుక్రోషంగా అన్నాడు

“ఏమి! సుందర్‌గారూ!”

“మీకు! అనేది......!”

“అక్షరాలా అబద్ధం అనేగా మీ వుద్దేశం?” అన్నాడు వణుకుతున్న దేహంతో శేషయ్య.

“కాదు. నిజమేనా అని అడుగుతున్నాను” నొక్కి-పలికి విషపు చూపులు ప్రసరించాడు సుందర్.

“నా మీద వొట్టేసి చెప్తున్నా! నేను చెప్పింది అక్షరాలా! అబద్ధంకాదు. అంతా నిజమే!”

“నిరూపించగలవా?”

“నీ భార్యయే యిందుకు సాక్షి. పిలిచి విచారించండి. అప్పుడుగాని మీకు అసలు సంగతి అర్థంకాదు! నేను చెప్పినది ఎంతవరకు సత్యమో, అసత్యమో! మీకు తెలుస్తుంది” అన్నాడు తడబడుతున్న మాటలతో శేషయ్య.

సుందర్ పద్మను పిలచాడు. పద్మ ఫాలభాగమందలి ముసుగు సవరించుకుంటూ, పద్మనయనములందు ఆనందాన్ని ప్రసరింపజేయుచు ఆమెలో పొడసూపిన భయమును పోగొట్టుకొని ధైర్యం వహించి సుందర్ దరిజేరింది. సుందర్, పద్మకేసి పదినిముషాలుపాటు ఏకదృష్టితో చూస్తాడు. ఆమె సర్వాంగములు పరీక్షించి చూస్తాడు. అనుమాన మన్నదే అతని హృదయములో మృగ్యము. ఆవిడ రాజు కుమార్తె గుణయే యని యింకను అతని మది భ్రాంతి పడుచున్నది. అతని శరీ

రాణువులలో ప్రతి సూక్ష్మాణువూ గుణ అను భావ మునే వ్యక్తపరుస్తున్నది. కాని కాదు అని భావమును ఘోషించు అణువులు అతని శరీరాణువులందు వెదుక తగినవి.

సుందర్ శేషయ్యకేసి వికారంగా చూశాడు "అసలు అడిగి చూడండి సుందర్‌గారూ" అని చప్పరించాడు శేషయ్య.

అప్పుడు సుందర్ భార్యను చూసి - ఆమె వూరూ, పేరూ వివరించమన్నాడు.

"నా పేరు పద్మ. నాది పల్లెటూరు. పేదకుటుంబాన జన్మించినదానను" అని చెప్పింది పద్మ, వెల్లువలై ప్రవహించు చున్న కన్నీటిధారలను తుడుచుకొంటూ.

ఆ సవ్వడి చెవిసోకిన సుందర్ హృదయం భగ్గునమండి అగ్నిగోళమై నాలికలు కోరుచున్నవి. మున్ముందు సుందర్ మనస్సాగరమందడుగుపడిన మదమాత్సర్యముల నెడి మకర తిమింగలములు యథావిధిగా పైకేగి తాండవమాడుచున్నవి. కోరలుచాచిన నాగువలె కోపోద్రిక్తుడయ్యాడు. అతని ముఖ భాగమంతయు వివపు రేఖలతో విజృంభించుచున్నవి. పండ్లు నూరాడు.

అతని మనస్సాగరమున ప్రళయము చెలరేగి, భీభత్సమై విజృంభించుచున్నది. కాని, ఏమి చేయగలడు? అంతా మోసం అనుకున్నాడు. గుణనే పరిణయమాడితిగదా అను కున్నాడు. గొప్పింటి బిడ్డని తలపోశాడు. కాని, అతని ఆలోచ నంతయూ తారుమారైంది. ఆ వచ్చిన యిద్దరు వ్యక్తులను గూర్చి క్షణం తలంచాడు. వారిని పట్టుకొనే మార్గం యోచిం చాడు. కాని, నిష్ప్రయోజనమే అయింది.

సుందర్ పద్మకేసి వికారంగా చూచాడు. "నీలాంటి నీచులకు, కూటికిలేని నిరుపేదలకు, పల్లెటూరి పిల్లలకు నా యింట తావులేదు. నీలాంటి పగటివేష నటకత్తెలకు నా యింట స్థానములేదు. ఎంతగా నటించావే నటనాధురీణీ! నీవు యెంతకైనను పాల్పడుదువనుటలో సందేహము లేదు. నీ ముఖం చూడరాదు. పో! నా గౌరవం మంటకలిపిన మాయలాడివి నీవు నా భార్యవుకాదే! నా కులటవై ఇన్నాళ్ళు నాతో కాపురం చేశావ్! ఇక నిన్ను ముట్టరాను. ముష్టి బ్రతుకులు గడుపు ముష్టిముండవు నీవు. నన్ను, నా వంశాన్ని మురదనష్టం చేయవచ్చావా? ఊఁ... వెళ్ళి... పో!" అంటాడు మహా కోపంగా.

పద్మ బావురుమంటూ ఏడుస్తూ, భర్త కాళ్ళమీద పడుతుంది. అనేక విధాల బ్రతిమాలుతుంది. భర్త రెండు కాళ్ళూ గట్టిగా పట్టుకొని తన జీవితాన్ని, శీలాన్ని అభిమానములను కాపాడుమని వేడుకొంటుంది. తనను వీడిపోలేనని చెప్పుతుంది. సుందర్‌ను, పద్మ పరిపరివిధాల బ్రతిమాలినా చెవిపట్టించుకోడు.

"ఛీ......నన్నంటకు...సిగ్గులేక యింక నన్ను త్రిప్పకొన చూస్తున్నావా! నీ దరిద్రమే నన్ను చుట్టుకొన్నది. శత్రువునైన క్షమించవచ్చుగాని నిన్ను మన్నించరాదు. నిన్ను చూడరాదు పో,..!...నిన్నెవడు పట్టితెచ్చి యీ విధంగా చేశాడో వాడే నీకు మొగుడు. వాడినే పెళ్ళాడు. వాడితోనే కాపురం చేసి సుఖించవే! టక్కులాడీ! నీ టక్కులు నాదగ్గర కాదు. ఊఁ...బయటకు కదలవే!" అంటాడు సుందర్.

"మిమ్ము మనసార పెండ్లాడిన తరువాత యింకెవరిని చేసుకుంటాను? మీరే నా భర్తవు. మీ పాదసేవయే నాకు ముఖ్యము. మీరు లేని జీవితము నాకు అంధకార బంధురము. మీరే నా ఆదరణీయ మూర్తులు. మీ ప్రేమానురాగ ప్రియ వచన సముదాయములే నా జీవిత పరమార్థములు. మీ సుఖ భోగములే నాకు అలంకారములు. మిమ్ము విడిచి క్షణమైనను బ్రతుకజాలను. నా తప్పులను మన్నించి నన్ను ఆదరించండి. కాదని కాలరాయకండి. దైవముకంటె మీరే నా ఆప్తులు. మీ పాదపూజ చేసికొను భాగ్యము నాకు ప్రసాదించండి."అని పద్మ సుందర్ పాదాలపై బడి తన కన్నీటితో పతిపాదాలు కడుగుతుంది.

సుందర్ భార్యను కాలితో తంతాడు. తన్నుకు పద్మ తలక్రిందులై పడిపోతుంది. నలిగిన దేహంతో మళ్ళీ వచ్చి సుందర్ పాదాలు పట్టుకొని బ్రతిమాలుతుంది. సుందర్ మరింత ఉగ్రుడై మళ్ళీ తంతాడు. ఆ తన్నుకు పద్మకు ప్రాణాలు పోయినంత పనయింది. కాని కొంచెం తెప్పరిల్లుకొని మళ్లీ భర్తను సమీపించి వేడుకొంటుంది - నా ఆశ్రిత రక్షణ దక్షమైన శ్రీవారి పాదసేవాభాగ్యం నాకు దూరపర్చకండి. మీచరణ దాసిగా నన్ను పరిగ్రహించండి" అని సుందర్ పాదాలుపట్టుకొని బావురుమని ఏడుస్తుంది.

సుందర్ పద్మను పడద్రోసి - "నోరు మూయవే వగలాడీ! నీ కపటనాటకం కట్టిపెట్టి యిక్కడనుండి కదలిపోవే! నీ కన్నీటికి నా హృదయం కరిగి కరుణించి నిన్ను క్షమించుట కల్ల. పల్లెటూరి పిల్లవా! అందులో నూటికి లేక మల మల

మాడి చచ్చు పేదదానివా! ఛీ...ఛీ నీ ముఖం చూపకు. నీలాంటి అంగనలకు నా హృదయములో స్థానమే లేదు. మర్యాదగా చెప్తున్నా! యిప్పటికైనా కదలివెళ్ళు" అంటాడు ఆవేశంతో.

"పేదదాననైనంత మాత్రాన పెండ్లాడి విడిచి పుచ్చుట మీకు భావ్యమా! కూటికి లేనిదాననైననూ, గుణహీనురాలను కాదు గదండీ! అంతస్థులకు నోచుకొనకున్నను అందవిహీనతకు నోచుకొనలేదు గదా ధనమును కాశించి మానము నమ్ముకొనునంత కులటను కాదు గదా స్వామీ! ధనసంపదలు కలిగినంత మాత్రమున వారి బిడ్డలు గుణవంతులని వూహించుట ధర్మమా? కూటికి లేనంత మాత్రమున బీదవారి బిడ్డలు గుణహీనులని భావించుట న్యాయమా?" అని నెమ్మదిగా అన్నది పద్మ!

"ఆపవే నీ అతివాగుడు! నీ కల్లాడి పలుకులు నా దగ్గర కాదు. నీవూ, నీ అందం యెవడికి కావాలి? ముందు నీవు యిక్కడనుండి కదలి పో!"

"మిమ్మల్ని వదలి నే నెక్కడికిపోను? మీ యింటి దాసిగానైనా నన్ను పరిగ్రహించండి. నను పొమ్మనకండి" అంటుంది పద్మ.

సుందర్ మండిపడి పద్మ జుట్టుపట్టుకొని "నీవు యెవరి వలన నా దగ్గరికివచ్చి చేరావో, వాడే నే నీకు ముద్దుల మగడు! వాడి దగ్గరికే వెళ్ళి సుఖించు. పోయి వాడి పాదాలే పూజించు" అని బయటకులాగి, తంతాడు. ఆ తన్నుకు పద్మ గేటుముందర బోర్లాపడి మూర్ఛిల్లుతుంది. ఇంతకాలమూ నక్కవలె గేటు

వద్ద పొంచివున్న శేషయ్యతాత, మూర్ఛిల్లిన పద్మను చూసి ముచ్చట పడతాడు. ఇక పద్మ తనకు దక్కుతుందని ఘ్రాహాసౌధాలు నిర్మించుకుంటాడు. అవినీతి ఆలోచనతో ఆనందపడతాడు. చచ్చుటకు సిద్ధమైన వృద్ధుడైనా తుచ్ఛపు బ్రతుకును వీడి, స్వచ్ఛమైన జీవిగా బ్రతికి, ప్రచ్ఛన్నమైన స్వర్గసుఖమును పొందాలని తలంచడుగదా! అయ్యో, ప్రపంచమంతయు పాపముతో ప్రజ్వరిల్లుచున్నది గదా! వయోవృద్ధుడైన శేషయ్యే యీ విధంగా చరించుచున్న, యువకులింకెంతగా చరించవలెనో గదా!

మూర్ఛిల్లిన పద్మ తెప్పరిల్లుకొని, మూతలుపడిన కనురెప్పలను తెరచి దిక్కులు తేరిపారజూచింది. ఆమె చూపులు అక్కడ నిలుచున్న శేషయ్యపై వ్రాలినవి. కనుబొమ్మలు చిట్లించింది. "ఛీ, మూర్ఖుడా! ఎంతపని చేశావ్? నా జీవితం నాశనం చేసిన నరరూప రాక్షసీ!" అని లోలోన తలంచుకొని చూపులు మరల్చుకొంది. విరజిమ్ముకున్న జుట్టును ముడివేసికొని, పవిటకొంగు సరిచేసుకొంది. సుందర్ యింటివైపు చూస్తూ – కన్నీరు కార్చింది. మూయబడిన గేటు తలుపులు చూసి ఆమె హృదయద్వారములు పగిలిపోయాయి. కుమిలి, నశించిన ఆమె మనసు కూలిపోయింది. లేవలేకపోయింది. ఆమె సున్నిత శరీరం తగిలిన దెబ్బలకు వాచిపోయింది – ఆమె ముఖ పద్మం వాడిపోయింది.

పాపం! సంభవించిన కష్టాలతో పద్మ ప్రాణాలు చావు బ్రతుకలమధ్య కుడితిలోబడ్డ యెలుకలా కొట్టుకులాడుతుంటే– శేషయ్య "పద్మా! మనవూరు పోదాం రా! ఈ జమీందార్

యిక నిన్ను చేపట్టడు. పన్ను చేసుకో! నీవు కోరినవన్నీ తెచ్చి యిస్తాను. నా ఆ స్తినంతా నీపేర పెడ్తాను. హాయిగా సుఖించవచ్చు. నాతో లేచి రా!" అంటాడు.

"ఛీ.....నీచుడా! నాతో మాట్లాడకు. భార్యా భర్తల మధ్య తగవులు పురికొల్పి, వాళ్ళ కాపురమును విడదీసి పాపమును గట్టుకొను నీవును ఒక మగవాడవే? ఆస్తిపాస్తులు చూపించి ఆడబ్రతుకులను నాశనముచేయు నీవంటి చీడపురుగులు పాతమై అడుగంటిననాడే యీ దేశంలోని ప్రతిస్త్రీ హృదయం పవిత్రమై పతిసేవతో కళకళలాడుతుంది. ముసలి పీనుగవు నీకెందుకింత మమకారం! బిడ్డలాంటి పన్ను తండ్రిలా అడ్డుపడవలసిన నీవు చెడుమాటలతో నా హృదయాన్ని బాధిస్తావెందుకు? - పరమపాపీ! నీకు నావుసురు తప్పక తగుల్తుంది. ఛీ...నీముఖం చూపకు" అంటుంది ఆవేశంతో పద్మ.

పద్మ మెల్లగా లేచి - ఆ వీధిని వస్తున్న జట్కాబండి నాపి యెక్కి, కుమారి పేటకు పోనియ్యమంటుంది - బండిసాగి పోతుంది - శేషయ్య బండివెంట కొంతదూరం పరుగెత్తాడు - పద్మ బండిని కొంచెం వేగంగా పోనియ్యమంటుంది. బండి వేగంగా పోతుంది. శేషయ్య యిక పరుగెత్త శక్తిలేక పరుగు నాపుకున్నాడు. పద్మ బండి ఆపమంటుంది. బండి నిలబడుట చూచిన శేషయ్య పరుగిడుతూ "పద్మా! నీతో నేను రానా?" అంటాడు. "సరే రా!" అంటుంది. శేషయ్య పరుగెత్తుకొని వచ్చాడు. కాని ఆగిన బండి మరింత వేగంగాకదలి పోతుంది. ఈ విధంగా పద్మ శేషయ్యను నాలుగు దఫాలు

యేడిపిస్తుంది. శేషయ్య - "పద్మా! నీకొక దండం, నీ బండి కొక దండం. నే పరుగెత్తలేను - నా నడుం కదలిపోయింది. మోకాళ్ళు పీక్కుపోతున్నాయి. కీళ్ళనొప్పులు భరించలేను" అంటాడు బాధగా. "ఆం...... అట్లారా దారికి. ఇప్పటికైనా బుద్ధి వచ్చిందా! మోకాళ్ళు పోటులు, కీళ్ళనొప్పులు, నడుం నొప్పులతో బాధపడే నీకు పడుచుపిల్లలు కావాలా ? సిగ్గు లేదు నీ ముసలి ముఖానికి. ఇప్పటికైనా గుర్తించుకోను. గుఱ్ఱ మెంత చురుకు మనోవేగాన్ని మించి పోతుందో పడుచు పిల్లలు కూడా అంతే" అని అంటుంది. బండి కదిలిపోతుంది. పద్మ మాటలకు దిగాలు పోయిన శేషయ్య యింటి ముఖంపట్టాడు.

సుందర్ జమీందార్ జరిగిన పరాభవము సహించి, వుపేక్షించలేని మనస్సుతో ఉగ్రుడై పోతాడు. అతని పరాభవమునకు కారకులైన బొంబాయి రౌడీలను పట్టి పరిమార్చాలని పండ్లు నూరుతాడు. అతనిలో వేడిరక్తం పొంగి పొరలిపోతుంది. "రాజు జమీందారు కూతురు దేవకిని చేస్తారుగదా అని సంతోషించాను. పచ్చి పల్లెటూరిపిల్లని నా మెడ కంట గడతారని తలంచలేదు. లక్ష రూపాయలు కాజేసి, భిక్ష గత్తెను నాకు పెండ్లి చేస్తారా! వాళ్ళ కెంత అహంకారం ? ఆ రౌడీ వెధవల్ని పట్టి పరిమార్చాలి" అని సుందర్ ప్రక్కనున్న వాలుకుర్చీలో వాలిపోతాడు. సుందర్ మనసులో, "దేవకి అయితే యీ విధముగా ప్రాధేయపడునా. ఇది శుద్ధ పల్లెటూరి పిల్లయే. ఎంత మోసపోతిని" అని వాపోతాడు.

## 44

వీధిలోకి వెళ్ళిన వేణు, తమ రెంట్ రూములోనికి వచ్చి ఆశ్చర్యపడతాడు. తమ్ముడైన గోపాల్ రూములో కనిపించడు. రూమంతా గాలించి గాలించి, వేణు చూపులు టేబుల్ పైన వున్న చీటీపై వ్రాలినవి. ఆ చీటి చేతికి తీసుకొని చదువనారంభించాడు. అందులో యిలా వుంది :

ప్రియమైన అన్నయ్యా,

ఏమీ పనిచేయక, సోమరివలె బ్రతుకుట నాకు అయిష్టమైనది. పనిలేక యిక యెన్నాళ్ళు వుండవలెనో అని తలంచి, మిలిటరీలో చేరుటకు నిర్ణయించుకొని వెళుతున్నాను. నేను వెళ్ళిపోయినని దిగులు చెందక అమ్మకు తెలియపరచి, ధైర్యం చెప్పి అమ్మను ఓదార్చుము.

అమ్మను ఆదరించి కాపాడుము. నీవేమీ నా గురించి బాధపడకు. నీవు యేదైన పని చూచుకొనుము. నా యెడబాటుకు నీవు కలత చెందవలదని నాతుది ప్రార్థన – యికవస్తా.

ఇట్లు,
గోపాల్.

“తమ్ముడు ఎంతపని చేశాడు. వాళ్లకు నే నేమని చెప్పాలి.” అని వేణు నిట్టూర్పు విడచి తమ్ముని వెదకడానికి బయలుదేరుతాడు.

# 45

చిన్న కారులో వెళ్తున్న దేవకి చూపులు మిలటరీ రిక్రూటింగ్ ఆఫీసువద్ద క్యూలో నిలబడియున్న గోపాలుని ఆకర్షించాయి. గుణతో కారును స్టాప్ చేయమని చెప్పింది. క్యూలో నిలుచున్న గోపాలుని అక్కకు చూపుతుంది. పోయి పిలచుకు రావలెనన్నా యిద్దరు స్త్రీ రూపంలో వున్నారు. వేణు కూడా వచ్చాడేమోయని అక్కడున్న వరుసలన్నీ గాలించారు. కాని కనిపించదు. వేణు రాలేదు - గోపాల్ ఒక్కడే వచ్చాడని దృఢ నమ్మకం వారికి కలిగింది. పని చూపలేదన్న నిరాశతో గోపాల్ మిలటరీలో చేరి పోనున్నాడని అక్కా చెల్లెలు ఆలోచించుకున్నారు. గోపాల్ తల్లి పట్నం వచ్చినట్లు - వెంటనే గోపాల్‌ని రమ్మని చీటి వ్రాసి, అక్కడున్న ఒక అతనిని పిలచి ఒక రూపాయి, చీటిచేతి కిచ్చి "ఈ చీటి ఆ క్యూలో వున్నతనికి యివ్వండి. ఆ రూపాయి మీరు వుంచుకోండి" అని గోపాల్‌ను చూపుతారు. గుణ, దేవకిలు కదలిపోయి కొంత దూరంలో కారునాపి ఏమి జరుగుతుందా ! అని పరికించుతుంటారు.

అతడు చీటి తీసుకొని వెళ్ళి గోపాల్ కిస్తాడు. గోపాల్ చీటి తీసికొని చదువుకొని "ఎవరిచ్చారు నీకిది !" అని ప్రశ్నించకుండానే పరమ సంతోషంతో తల్లిని చూడాలని బయలు దేరాడు.

ఆ దృశ్యం చూసిన గుణ, దేవకీల హృదయం ఆనందంతో ఉప్పొంగిపోయింది. కిల కిలా నవ్వులు చిందిస్తూ వయ్యారంగా కారెక్కి కదలిపోతారు.

తమ్ముని కోసం వెదుకుతూ – మిలటరీ రిక్రూటింగ్ ఆఫీసు అడ్రసు కనుక్కొంటూ వీధినిబడి వస్తున్న వేణుకు జట్కాబండిలో వస్తున్న పద్మ ప్రత్యక్షమైంది.

పద్మనుగాంచిన వేణులో ఆనంద ఆశ్చర్యాలు పెనవేసుకొనిపోయాయి. వేణును చూచిన పద్మకు ప్రాణాలు లేచి వచ్చాయి. అప్పటివరకు అడుగంటిన ఆశలతో నీరసించిన ఆమె హృదయం మోదమొందింది. గుణ, దేవకీల యిల్లు తెలియక చిరాకు చెందిన ఆమె మనసు కొంతవరకు నెమ్మదిని పొందింది. జట్కాను ఆపి పద్మ దిగి వేణును కలిసికొంది.

వేణుకు జరిగిన విషయమంతా పద్మ వివరించి విచార వదనంతో నిలబడిపోయింది. వేణు ఆమెను ఓదార్చి తన తమ్ముడు చేసిన ఘనకార్యం వివరించుతాడు. తమ్ముని తరువాత వెదకవచ్చులే అనుకొని పద్మను తీసికొని వేణు ఆ జట్కాలోనే వేణువున్న రూముకు ప్రయాణమౌతారు.

# 46

తల్లిని చూడాలని ఆశతో వచ్చిన గోపాల్ యింటికి వచ్చి రూములన్నీ గాలిస్తాడు, కాని యెవరూ కనిపించరు. గోపాల్ నిరాశచెంది నిలబడి పోతాడు. ఇంతలో గుణరాజ్, దేవరాజ్ ప్రత్యక్షమై "ఏమిటి వెదుకుతున్నా"వని ప్రశ్నించారు.

"మా తల్లి వచ్చిందంటే వెదుకుతున్నాను. రూమంతా
గాలించినా యెవరూ కనిపించలేదు" అని గోపాల్ అంటుండగా,
వేణు పద్మలు బండిదిగి లోనికివచ్చి వారిని చూచి విస్తు
పోతారు.

పద్మను, వేణును గాంచి గుణ, దేవకిలు గాబరాపడతారు.
పద్మను చూచి గుణ "ఏమిటి వచ్చేశావ్" అంటుంది. పద్మ
జరిగినదంతా పూసగ్రుచ్చినట్లు విశ్లేషిస్తుంది. అది విని గుణ
ఆమెకు ధైర్యం చెప్పుతుంది – మరో విధంగా నిన్ను నీ భర్తకే
పెండ్లిచేస్తాం. నీవేమీ భయపడకు అని చెప్పి "వేణు యెక్కడి
కెళ్ళావు?..." అని ప్రశ్నిస్తుంది. తమ్ముడు చేసిన ఘనకార్యాన్ని
గుణకు వివరిస్తాడు.

అందుకు గుణ "ఎప్పుడూ మీరీ విధంగా చేయకండి.
మీకు ఉద్యోగాలు లేనంతమాత్రాన, మీకు వచ్చిన కష్ట
నష్టాలేమిటి? మంచి ఉద్యోగాలు చూడాలని మా శాయ
శక్తులా కృషి చేస్తున్నాం. అదృష్టం కలసిరావాలిగాని, ఏది
రమ్మన్నా వస్తుండి. అందుకై మీరు తొందరపడకండి. మీకు
కావాల్సినవన్నీ మేము తెచ్చియిస్తాము" అని వారిని సంతోష
పెట్టుతుంది. వారు అందుకు సమ్మతి తెలియజేస్తారు. "ఒక్క
సారి మీ యింటికి రావాలని వుంది" అని గొణిగాడు వేణు.

"ఇప్పుడు కాదు; వచ్చే రోజులు ముందున్నాయి.
మా యింటికి తీసుకెళ్ళాలంటే, మా నాన్నగారి ఆజ్ఞ కావాలి.
మేము పరులతో స్నేహం చేయటం మా నాన్నకు యిష్టం
లేదు. అందుకని మేమే మీ దగ్గరకు వస్తాము" అని చెప్పి,
పద్మను తోడ్కొని ముగ్గురూ వెళ్ళిపోతారు.

వేణు, గోపాల్ వారి మాటలకు ముచ్చటపడి ముగ్ధులైపోతారు. వాళ్ళతో యిన్నాళ్ళు పరిచయభాగ్యమబ్బిన వేణు, గోపాలురు వారి నిజరూపాలు గమనించలేకపోతారు. నిజంగా వారు పురుషులే యని భావించుకుంటారు.

పద్మకు నచ్చచెప్పి ఒప్పించి గుణ ఆమెను ఇంగ్లండ్ లేడీగా తయారు చేస్తుంది. పొడుగాటి కురులను పొట్టిగా కత్తిరిస్తుంది. చీర జాకెట్లు తీసి సూటు బూటు ధరింపచేస్తారు. వేషం మారిపోయింది. పద్మ యిప్పుడు నిజమైన ఇగ్లండ్ లేడీగా తయారు కాబడ్డది. రోజూ క్లబ్బుకు తీసికెళ్ళి రాకెన్ రోలు డాన్సులు మొదలైనవి నేర్పింది. ఇంగ్లండ్ లేడీస్ అల వాట్లన్ని క్రమేణా పద్మకు వంటబట్టాయి. మాటా పలుకు ల్లోనూ, నడక నాట్యాలల్లోను పద్మ ఇంగ్లండ్ స్త్రీలకన్నా అతి చమత్కారంగా తయారైంది. గుణ, పద్మకు నేర్పవలసిన వన్నీ బాగా నేర్పింది. రెండు నెలలు గతించాయి – పద్మను చూచి "నీవు నీ భర్తను మళ్ళీ కలుసుకోవాలంటే యిదే మార్గం" అంటుంది గుణ. అందుకు పద్మమురిసిపోతుంది. గుణ ఇంగ్లండ్ వృద్ధునివలె మేకప్ చేసుకుంది.

# 47

అది సుందర్ జమీందార్ భవనం. ఏమీ తోచని సుందర్ వరండాలో అటూ యిటూ తిరుగుతుంటాడు. మారు వేషధారులైన గుణ, పద్మలు లోనికిరావటం చూచిన సుందర్ "ఎవరు మీరు?" అని ప్రశ్నించాడు. అప్పుడు

ముసలి ఇంగ్లండుదొర- "సుందర్ బాబూ, మీ నాన్నగారుం టే మమ్మిల్ని యీ విధంగా ప్రశ్నించేవారేనా! మేము యీ దేశవాసులమే. ఇంగ్లండులో నివాస మేర్పరుచు కొంటిమి. మీ నాన్నగారు నాకు పరమమిత్రులు. మీనాన్న మంత్రిగా వున్నప్పుడు నన్నెంతగా గౌరవించేవారో చెప్పలేను అంటాడు. ఆమాటలకు సుందర్ హృదయంకరిగింది"రండిరండి.." అని ఆహ్వానించి సోఫాలపై కూర్చుండబెట్టి కాఫీ ఫలహారములు తెప్పించి వారిముందు పెట్టాడు. అవి సేవించిన పిదప "మా నాన్నగారు చాలా చెప్పియున్నారు."అని అంటూండగా,మారు వేషధారియైన గుణ "సుందర్! యిటు చూడండి. ఈ చిన్న దాన్ని - పట్టుబట్టి ఎంతో ప్రయాసబడి యిక్కడకు తీసుకొ చ్చాను. కారణంమీనాన్నగారికి నేను ఇచ్చినవాగ్దానంనిలబెట్టు కోవాలని - నా కుమార్తెను నీకు యిచ్చి వివాహం చేస్తానని వాగ్దానం చేశాను - యింతకీ నీకు పెండ్లి అయిందా?" అంటుంది. సుందర్ పద్మవంక తేరిపారజూచి మోహపర వశుడై - పెండ్లికాలేదని సమాధానమిస్తాడు. "అయితే ఫరవాలేదు" అంటుంది గుణ. సుందర్, మారువేషంలోవున్న పద్మల కనుచూపులు కలుసుకోగా ఒకరి నొకరు గాఢంగా ప్రేమించుకుంటారు. "సుందర్! నా కుమారులు ఇండియాకు యీ పిల్లను తీసికొనిపోయి వారికి పెండ్లి చేయవద్దని మొండి పట్టుపట్టినా, వారి మాటలు సరకుచేయక నీ దగ్గరకు వచ్చి నందుకు నాకు ఫలితం దక్కుతుందని తలంచుతున్నాను. నా కుమార్తెను వివాహం చేసుకోడానికి నీకు యిష్టమేనా?" అంటుంది గుణ.

"ఓ యస్! అంతకన్న నాకు కావాల్సిందేముంది. మీ విషయమే యిన్నాళ్ళు నేను ఆలోచించి ఆశలన్నీ మీపై నుంచాను. నా అదృష్ట వశాత్తు మీరే వచ్చారు. ఇక నా ఆశ ఫలించింది. నా హృదయం సంతోష తటాకమున తనివిదీర ఝలకమాడుచున్నది" అంటాడు సుందర్.

"రాణీ! నీకు యిష్టమేనా?" అని ప్రశ్నించింది పద్మ కేసి చూస్తూ గుణ.

"ఐ యామ్ ఆల్ రెడీ ఎగ్రీడ్ – బట్......" అని పద్మ సంకోచిస్తుంది.

ఆ సందేహ మేమిటో చెప్పమంటుంది గుణ.

"నాకు పెండ్లిచేసి నీవు స్వదేశం వెళ్ళిపోతావు. ఒకవేళ మీ అల్లుడుగారు నన్ను బాధించి కష్టపెడితే నాకు దిక్కెవరు? నాకు ఆశ్రయదుర్గ మెవరు? నాగతి నీచగతికి దిగజారిపోతుంది. తింటానికి తిండికి కూడా నోచుకోలేని దుర్గతిపాలౌతాను" అంటుంది పద్మ.

ఆ మాటలు విన్న సుందర్ ఆమెపై మోజు చెంది, ఆమెను విడువలేక "అటువంటి అనుమానమున్నట్లైతే నా ఆస్తి నంతా నీపేర వ్రాసిస్తాను" అంటాడు చురుకుగా.

అప్పుడు ముసలి ఇంగ్లండుదొర "నీమీద అనుమానం లేదు నాయనా! ఏనాటికి ఏ విధంగా కాలచక్రం మారుతుందో ఎవరు చెప్పగలరు." అంటాడు.

సుందర్‌ను చూచి "మనం రిజిష్టర్ మేరేజి చేసుకోవాలి" అంటుంది పద్మ.

"అదేమీ వీలుపడదు. నేను జమీందార్ బిడ్డను. పది మందినీ పిలుచుకొని హోదాగా పెండ్లి చేసుకోవాలి" అంటాడు బెట్టుగా, సుందర్. "నో, నో! అలా చేసుకుంటే న్యూసెన్సుగా వుంటుంది. రిజిష్టర్ మేరేజి యీజ్ బెస్ట్" అంటుంది పద్మ.

"ఆల్ రైట్! అంతే చేద్దాం" అంటాడు చేసేదిలేక, సుందర్.

గుణ లేచి "సుందర్! నేను అలా వెళ్ళివస్తాను. రేపటి రోజున రాణిపేర ఆస్తి రిజిష్టరు చేయడానికి తగినయేర్పాటులు చేయి. మరునాడు మీరిరువురూ రిజిష్టరు మేరేజి చేసికొని ఆలుమగలై, హాయిగా కాలాన్ని సద్వినియోగం చేసుకొనవచ్చు. మీ పెండ్లి చేసి, నేను మా స్వదేశం తిరిగి వెళ్తాను" అంటుంది.

"సరే" అంటాడు సుందర్.

గుణ తిన్నగా వాళ్ళింటికి పోతుంది.

మనసులు కలసిన రాణి – సుందర్ కలిసి చేతులు పట్టుకొని, చిరునవ్వులు చిందిస్తూ బంగాళా ప్రక్కనున్న పూలతోటలోకి వెళ్ళారు. అక్కడున్న పచ్చని గడ్డిపాన్పుపై యిరువురూ పవ్వళించుతారు. "రాణీ! ఇన్నాళ్ళవరకు నీకై చూచి చూచి, నా కన్నులు కాయలు కాచినవి. నీవే నా హృదయ రాణివని తలంచి తపించిపోయాను. మా నాన్న నీ విషయం చెప్పిన దగ్గరనుండి నిన్ను చూడాలని తహతహలాడాను. ఇన్నాళ్ళకు నిన్ను జూచుభాగ్యము నాకు లభ్యమై, నీవులేని జన్మ ప్రాణములేని జీవములాంటిది. ప్రియురాలా! నీ మధుర కాయముకై నా హృదయ మదురుచున్నది. నా మనోహారీ!

ఏదీ, ఒకసారి యిటు చూడుము" అని రాణిని దగ్గరకు తీసు కుంటాడు సుందర్.

"ఊహుఁ......యిప్పుడు కాదు. రెండురోజులు ఓపిక పట్టండి" అని రాణి దూరంగా పోవడానికి ప్రయత్నిస్తుంది.

సుందర్ రాణిని పట్టుకొని గట్టిగా బుగ్గపై రక్కుతాడు. అందమైన ఆమె పాలబుగ్గ కందిపోతుంది. సున్నితమైన ఆమె శరీరం సుందర్ స్పర్శతో ఎండకు వాడిన పద్మమువలె వాడి పోతుంది.

ఈ విధంగా కాలం గడుపుతున్న సుందర్, రాణీలు చీకటిపడుట గూడ గమనించలేదు కాబోలు.

ముసలి ఇంగ్లండుదొరకొరకు రాణీ, సుందర్‌లు చాల సేపు వేచియున్నారు. కాని అతను రాకపోవడంచేత వారిరువురు భోజనాలుచేసి వేరొకగదిలో విశ్రమించారు.

పాపం అయోమయుడైన సుందర్‌కు ఆ రాత్రి నిదుర పట్టలేదు. లేచి రాణి దగ్గరకు రావాలని ప్రయత్నించాడు. ప్రతిఫలం చిక్కలేదు.

పద్మ ఆరాత్రి పరుండి నిదురపట్టక యీ విధంగా తనలో తాను తలంచుకుంటుంది - "ఏమీ యీ వింత? నేనొక పల్లెటూరి పేదింటి పిల్లనని తరిమికొట్టాడే! ఇప్పుడు వేషం మార్చి నూతనతారగా అవతరించినంత మాత్రాన, నాపైతీపిని ఒలకబోస్తూ, నాకు ఆదరణిచ్చి ఆస్తినంతా నాపేర వ్రాయ సిద్ధమయ్యాడు. ఆహా కాలమహిమ యెంత ప్రభావము గలది. అవును! కలియుగంలో వేషధారులైన కాంతలకే ప్రథమ స్థానము. వేషం మార్చుకొన్నంత మాత్రమున దేహ

సౌందర్యముకూడా మారునని ఊహించుకొనుట శుద్ధపొరపాటు. ఆ విధంగా యోచించు పురుషులు యే రకానికి చెందిన వారో నాకు చెప్ప సాధ్యముకాదు." పద్మ ఆ రాత్రి ఆ విధంగా కాలం గడిపింది.

# 48

తెల్లవారింది. సుందర్ తెల్లవారకముందే చేయవలసిన యేర్పాట్లన్నీ సమకూర్చిపెట్టాడు. రాణీ, సుందర్ కాఫీ ఫలహారములు సేవించి హాలులోని సోఫాలపై యిరువురూ కూర్చుంటారు. ఇంతలో ముసలి ఇంగ్లండ్ దొర రాణి తండ్రి వస్తాడు. తండ్రిని చూచి "నాన్నా రాత్రి యెక్కడికెళ్లావు? నీ కొరకు చూచిచూచి నా కళ్ళు కాయలు కాచాయి" అంటుంది పద్మ.

"అటు వీధిలోకి వెళ్ళేసరికి, ఓ పాత స్నేహితుడు ప్రత్యక్షమై వారింటికితీసుకెళ్లి మంచీ, మర్యాదలూచేసి ఆరాత్రి అక్కడే ఉండాలని పట్టుపట్టాడు. అందువల్ల పాత స్నేహితుని వదలి రాలేకపోయాను" అంటాడు ముసలి ఇంగ్లండు దొర.

అందుకు యిద్దరూ వారి సమ్మతి తెలుపుతారు.

సుందర్ ఆ స్తిని, రాణిపేర రిజిష్టరు చేయడంజరిగిపోయింది. మరునాడు, రాణిని రిజిష్టరు మేరేజి చేసుకున్నాడు. రాణికి చెప్పవలసిన విషయములు చెప్పి తండ్రి స్వదేశం వెళ్ళాడు. పరమానంద పరవశుడైన సుందర్ బంధు మిత్రులను ఆహ్వానించి, వారిని తగినవిధముగా సత్కరించి సాయంకాలం 5గంట

లకు విందు జరిపిస్తాడు. చిలుకా గోరింకలవలె సుందర్, రాణీలు హాయిగా జీవితం గడుపుతుంటారు. రాణి వేషంలో వున్న పద్మ ఆనందానికి కూడా మితి లేకపోయింది.

గుణ యుక్తిని మదాంధుడైన సుందర్ గుర్తించలేదు. ప్రథమ భార్యగా పరిగ్రహించిన పద్మయే, రాణీ వేషంలో వచ్చి తనను మళ్లీ పరిణయమాడినదని కనులకు కామమనెడి పొరలు అడ్డుపడుటచే గమనించలేక, సుందర్ ఆమె పాద పూజారిగామారాడు.

# 49

వసంతకాలం వచ్చింది. పసందుగా పండు వెన్నెల ప్రసరిస్తోంది. ఆకాశవీధి తారా చంద్రుల విహారాలతో తళతళ లాడి పోతోంది. ఆ ప్రశాంత విశ్రాంతి సమయంలో వసంత కోయిలలు కుహూ కుహూ యంటూ కూనరాగాలు తీయుచు మానవ హృదయాంతరాళములను తమ మధురగానముతో ఊయల లూగించుచున్నవి.

వేణు రూపురేఖలు, అతని బుద్ధి కుశలత, అతని అమృత వచనములు క్షణక్షణమూ గుణ హృదయంలో తళుక్కుమని మెరువసాగాయి. ఆమె పవిత్రమైన తన హృదయాన్ని వేణుకే అంకితంచేయాలని, సమయం కోసం వేయికళ్ళతో యెదురు చూస్తోంది. ఆమె ఆశలు ఫలించే తుది ఘడియలు సమీపించాయని, తన ప్రతిజ్ఞ సఫలీకృతం కాగలదని మైమరచినదై ఫక్కున ఒక్కసారి నవ్వింది.

తోటలోని పూలచెట్లకేసి చూస్తూ వాటి అందచంద సుగంధములకు మురిసిపోయింది. పిల్లగాలులకు అటు నిటూ ఊగుతూ నాట్యమాడుతున్న పూలకొమ్మలు తనను పిలుస్తున్నాయేమో అని ఊహించి ఉత్సాహపడింది గుణ. చల్లని వసంత వాయువుల స్పర్శకు గుణ హాయిగా నిదురపోసాగింది.

ఆ రాత్రి గుణకు వింతగొల్పు ఒక చక్కటి స్వప్నం వచ్చింది.

వేణు జమీందారు బిడ్డయ్యాడు. గుణ ఒక పేదింటి పడుచు. అంతస్తుకు పేదదైనా అందచందాలు గల్గిన బంగారుబొమ్మ. గుణసంపదలతో వికసించు ముద్దుల కొమ్మ. వేణు జమీందారు బిడ్డడనుగర్వం తనలో లేదనుటకు అతని ముఖలక్షణములే సాక్షి. పేదపిల్ల గుణను వేణు మనసార ప్రేమించాడు. తనను పెండ్లిచేసికొమ్మని వెంటాడుతున్న వేణును చూచి గుణహృదయం భయాందోళనలతో కంపించిపోయింది. ఆమెలో పొడచూపే ఆనందరేఖలను భయాందోళనలు కప్పివుచ్చాయి. తన ప్రక్కకు సమీపిస్తున్న వేణును చూచి తలవంచుకొని ప్రక్కకు తప్పుకుంది. కాని, అతడు ఆమె చెంతచేరి భుజాలు తట్టబోయి తటాలున ఆగిపోయాడు. కారణం ఆడదాన్ని తాకుట అంత తేలికైన విషయం కాదని తలచాడు కాబోలు.

"గుణా......" అనలేక అనలేక అనేశాడు. వేణు హృదయం వేగంగా కొట్టుకుంటుంది. తిరుగు సమాధానం లేదు.

ఆమాట విన్న గుణహృదయం జింకవలె బెదరిపోయింది.

"గుణా !...యిటు చూడు" ఊపిరిబిగబట్టిన కంఠంతో పలికాడు.

"గుణ అంతస్తులకు నోచుకోని అభాగ్యురాలు! మీరు అనుకున్నంత అదృష్టవంతురాలు కాదని గుర్తించుకొని, మీ దారిని మీరు వెళ్ళటం మంచిదనుకుంటాను" దీనంగా గొణిగింది గుణ.

"అంతస్తుకు నోచుకోపోయినా అందానికి నోచుకున్నావు. సుగుణ సంపద నీసొత్తు. నా కవే పదివేలు. అవే నే నాశించిన ఆస్తిపాస్తులు. మనసార ప్రేమించిన నిన్ను యీ జన్మలో మరచిపోవుట జరుగనిపని" అనురాంగతో అన్నాడు వేణు.

"ఆస్తిపరులు ఆస్తికే ప్రాముఖ్యం యిస్తారు...కాని ఆత్మశుద్ధి, అందం, బుద్ధికుశలతలు వారి హృదయాల కెక్కవుగదా!"

"అవన్నీ పాత పురాణాలతో అడుగంటిపోయాయి గుణా! ఆస్తిపరులకు అహంకారం ఆవేశాలు జాస్తి...గుణ గణాలు నాస్తి...అందం, గుణం కలిగిన యువతే నా ఆస్తి... అందుకే నిన్ను ఆశించి నీదరి చేరాను. నీవే నా హృదయరాణివని తలపోశాను. పేదదానవైనా నాకు నచ్చావు. ప్రేమించాను" అన్నాడు వేణు.

అతని భావాన్ని అర్థంచేసికుంది గుణ. ఇన్నాళ్ళుగా తనకోసమై తపించిపోతున్న వేణును మరింత బాధించడం మంచిదికాదని తలచింది. మైమరచిపోయింది. కొన్నిక్షణాల పిదప గుణ వేణు వడిలో వాలిపోయింది.

నిదురలో వున్న గుణ, గులాబిరేఖలవంటి పెదిమలు విప్పి నవ్వసాగింది. మెళుకువ వచ్చిందికాబోలు! తుళ్లిపడి లేచింది. గది నలుదిశలు పారజూచింది. ఎవ్వరూ కనిపించలేదు. కల కన్నానను కాబోలనుకుంది. ఇంకా చీకటిరేఖలు క్షీణించ లేదు. వేణును కలుసుకోవాలని ఆమె హృదయం సమయం కోసం తహతహలాడుతోంది. స్వప్నభావం చెల్లికి తెలియ జేయాలని గుణ పొంగిపోతున్న హృదయం కలవరపడుతోంది. ఏవో! అంతులేని ఆలోచనలతో గుణ మనసు నిండిపోయింది. తెల్లగా తెల్లవారింది.

గుణ దేవకిని కలసికొని రాత్రి స్వప్నాన్ని గూర్చి తెలియజేసింది. ఇరువురు నవ్వుకొన్నారు. ఏమేమో గుస గుసలాడుకున్నారు. కాలకృత్యాలు ముగించుకుని కాఫీ పుచ్చుకుని, పురుషవేషాలు ధరించి చిన్న కారెక్కి తయారు మన్నారు.

రాణీ, సుందర్ కలిసి హాలులో కూర్చుని కాఫీ త్రాగుతూ ముచ్చటించుకుంటున్నారు. రాణీ అచ్చంగా మగవాడిలా మేకప్ చేసుకుంది. అది ఆఫ్రికన్ల ఆచారం కాబోలు. ఉభయులు సిగరెట్లు వెలిగించారు. ఇంతలో గుమ్మం వేపునుంచి "హల్లో! గుడ్‌మార్నింగ్" అన్నమాటలు వినిపించాయి. ఆ మాటలు విన్న సుందర్ హృదయం సంతో షించడానికి బదులు తత్తరపడిపోయింది. ఆ వస్తున్న నలుగురూ అతనికి ముఖ్యమైన స్నేహితులు. వారు రావటం గమనించిన రాణి, అక్కడనుండి లేచి లోనికి పోవడమటుంచి, నోటిలోని సిగరెట్టుకూడా ససేమిరా పారేయనంటూ మూతి బిగించింది.

సుందర్ తల తిరిగిపోయినంత పనయింది. పొంగివచ్చే తత్తర పాటును లోలోన అణచుకొని, వస్తున్న స్నేహబృందానికి స్వాగతం చెప్పాడు. వాళ్ళు వచ్చి సోఫాల్లో చతికిలబడ్డారు. రాణిని కూడా పురుషుడే అనుకున్నారేమో! ఆమె ప్రక్కనే భుజాలు అంటిస్తూ కూర్చున్నాడొక మిత్రుడు. సుందర్‌కు కోపం వచ్చింది. కాని యేమీ చేయలేకపోయాడు. "సుందర్! యీ నూతన చెలికాడెవరు?" అన్నాడు మిత్రబృందంలో ఒకడు.

ఆ మాటలకు సుందర్ గుండె పగిలినంతపనైంది. క్షణంపాటు మౌనం వహించి, తుదకు తెప్పరిల్లుకుని "చెలికాడు కాదురా బ్రదర్" ధైర్యం తెచ్చుకొని చప్పరించాడు సుందర్.

"అయితే యింకెవరై యుంటారు" అన్నాడు మరొకడు.

సుందర్ ఏదో చెప్పబోయాడు. అంతలో "ఎవరైందీ చూస్తూంటే తెలిసిపోలా, వేరుగా చెప్పాలా? నేను సుందర్ వైఫ్‌ను, అతడు నా హజ్‌బండ్" మరింత జోరుగా సిగరెట్టు పీల్చసాగింది.

ఆ పలుకులకే తలనొప్పి కలిగిన స్నేహితులు ఆమె సిగరెట్టు దమ్ములకు ఓర్వలేక, సుందర్‌కొక సలాంకొట్టి వచ్చిన దారినే తిరిగి వెళ్ళారు.

"ఇంటిలో సరేకదా, ఆఖరికి స్నేహితులముందు కూడా నా పరువు మర్యాదలు తీయాలని చూస్తున్నావన్నమాట."

"కాదు! నీ రాణీగారి ఆఫ్రికా ఆచారాలేమిటో అవి చూపిస్తున్నా! అంతే! మరేమీకాదు" చలాకీగా కులుకుతూ పలికింది.

"పద్మ అంటేనే అసహ్యించుకొను సుందర్ మారువేషం వేసి రాణిగావసే, ఆమె భానిసగా మారి భరింపరాని తలనంపులకు గురియగుతున్నాడు" లోలోన తలచింది రాణి.

అక్కడనుండి లేచిపోబోతున్న సుందర్ చేయిపట్టుకొని "డ్యాన్సుటైమ్ ఫోవర్! త్వరగా వెళ్దాం రండి" అంది రాణి.

"నే రాలేను..." అస్పష్టంగా తలాడించాడు సుందర్.

"అయితే యిక్కడే మనిద్దరం చేద్దాం కమాన్" అని చేయిపట్టుకు గుంజింది రాణి.

"నాకు అలవాటులేదు. నీవే డ్యాన్సుచేయి."

"అలవాటు చేస్తాను. కమాన్ ప్లీజ్."

"నాకు యిష్టంలేదు."

"పెళ్లైదు చేసితీరాల్సిందే! మా దేశంలో భార్యాభర్తలు కలిసి డ్యాన్సు చేయడం ఓ పెద్ద సాంప్రదాయం. అలా చేస్తేనే వారికి ఆనందం. లేకుంటే ప్రమాదం. ఊ...... రండి..." అంటూ సుందర్ భుజాలు తట్టుతుంది.

"పరమ పవిత్ర పతివ్రతను చేతులారా యింటినుండి తరిమికొట్టి, ఓ పోకిరి ముండను పెళ్లాంగా కట్టుకున్నాను. ఛీ...ఛీ...ఎంత అప్రతిష్ఠ" సుందర్ లోలోపల తలంచుకొని మౌనం వహించాడు. రాణి మరల సుందర్ చేతులు పట్టి లాగింది. పాపం! ఏం చెస్తాడు? రాణి చేయి తగిలితే చాలు సుందర్ కఠినహృదయంకూడా ఆమె చేతిలో కీలుబొమ్మగా మారాల్సిందే!

మౌనం వహించిన సుందర్ కేసి వెగటుగా చూస్తూ లోలోన తిట్టుకుంటూ లోనికి వెళ్ళింది చిరాకుగా రాణి.

"ఇది నా కర్మ"...అంటూ సుందర్ కుర్చీలో కూలి పోయాడు.

## 51

గుణరాజ్, దేవరాజు కలసి వేణుగోపాలుర దగ్గరికివచ్చి వారు తెచ్చిన విలువైన సూటు బూటులను వారికి అందించి అవి అలంకరించమన్నారు. ఆ మాటలకు అన్నా, తమ్ముడూ ఆశ్చర్యపోతారు. ఫ వాలేను ధరించమంటారు. వారి మాట జవదాటలేక వేణు, గోపాలురు ఆ వస్త్రాలూ, బూట్లూ ధరించారు. అవి ధరించి వేణు, గోపాలురు అందమైన నవ యువకులుగా తయారయారు. గుణరాజ్, దేవరాజ్‌లు వారి సౌందర్యానికి ముగ్ధులై మూర్ఛిల్లినంత పనైంది.

ఆడవేషంలో వుంటే అమాంతంగా ఆలింగనం చేసుకునేవారేమో?

వేణు, గోపాలురకేసి చూస్తూ "మీకు పెండ్లిచేయ నిశ్చయించుకున్నాం" అంటాడు గుణరాజ్.

"నిరుద్యోగ సమస్యతో నీరసించిపోయిన మాకు పెండ్లెందుకండీ" అన్నాడు వేణు.

"పెద్ద ఆస్తిపరుల కూతుళ్ళను మీకు చేస్తాం. ఇంకా మీకు ఉద్యోగం కావాల్సినంత పనేముంటుంది. హాయిగా ఆలితో సుఖజీవనం చేయవచ్చు" అంటాడు దేవరాజ్.

ఎంత చెప్పిగా వేణు, గోపాలుర పెళ్ళికి యిష్టపడరు. తుదకు ఒప్పుకోక తప్పిందికాదు.

"మీరు మంచి సూటు, బూటు ధరించి రేపు సాయంత్రం 5 గంటలకు సుశీలాదేవి పార్కుకు వెళ్ళాలి. అక్కడకు కాబోయే మీ సతీమణులు వస్తారు. వారిని మీరు ప్రేమించి పలుకరించాలి సుమా !" అని చెప్పి వారి రూపురేఖ లేవిధంగా వుంటాయో తెలియజేసి వెళ్ళిపోతారు, గుణ రాజ్, దేవరాజులు.

అనాధులను ఆస్తిపరుల కుమార్తెలు పెండ్లి చేసికోడానికి అంగీకరిస్తారా ? అన్న అనుమానం వేణు, గోపాల్‌ల హృదయాలలో చిగురించినా, కొంతసేపటికి తెప్పరిల్లి వారు చెప్పిన ప్రకారం అలంకరించుకొని సాయంకాలం 4½ గంటలకు సుశీలాదేవి పార్కుకు ప్రయాణమయ్యారు.

గుణ, దేవకిలు అందాల అప్సరసలవలె అలంకరించుకొని సుశీలాదేవి పార్కులో ఓ ప్రక్క సిమెంటు బల్లపై కూర్చుని వేణు, గోపాలుర కోసం నిరీక్షిస్తుంటారు. వారిలో హఠాత్తుగా ఆనందం కలిగింది. కనురెప్పలు వాల్చక తదేక దృష్టితో ఏమో చూస్తున్నారు.

వేణు, గోపాలురను గాంచినతోడనే వారి, ప్రాణాలు వారికై పరితపించాయి. కాని కొంతవరకు ఆ ఉద్రేకాన్ని అణచుకున్నారు.

## 52

వేణు ,గోపాలురు ఆ అమ్మాయిలను చూచి ప్రతిమల వలె నిలబడిపోతారు. వారి రూపు రేఖలను గాంచి ముగ్ధులై పోతారు. ఆ అపురూపసౌందర్యవతులు వారిని చేసుకుంటారా? అని లోలోన తలంచుకుంటూ ఉక్కిరిబిక్కిరి అవుతారు.

గుణ, దేవకిలు వారితలంపులు గమనించినవారై వింతగా వారికేసి చూస్తుంటారు. చీర, జాకెట్టు కట్టుకొనినంతమాత్రాన వేణు, గోపాలురు వారిని గుర్తించలేకపోయారే అని విస్తుపోతుంటారు. క్షణం ఆగినపిదప గుణ వారిని సైగచేసి పిలుస్తుంది. వేణు, గోపాలురు సైగను గమనించి తడబడుతున్న కాళ్ళతో తప్పటడుగులు వేస్తూ వారిని సమీపించారు. "ఆ అందాల పసిడిచిలుకలు వారికి దక్కునా?" అన్నదే వారి పరమ సందేహం. పలుకరించాలని పెదిమలు విప్పుతారు. నోటినుండి మాత్రం మాటరాలేదు. చిట్టచివరికి గోపాల్ ధైర్యంచేసి "గుణరాజ్, దేవరాజ్‌లు పంపిన అమ్మాయిలు మీరేనా?" ప్రశ్నించాడు దేవకితో. దేవకి చెవిటిదానిలా నటించి చెవిలో చెప్పమంటుంది. అది విని యిద్దరూ ఆశ్చర్యపోతారు. అంతలో గుణను సమీపించి "ఆ అమ్మాయికి చెవుడా?" అంటాడు. గుణ "బె...బె...బె" అని మూగదానిలా పలుకుతుంది. అది విని మరింత గాభరా పడతారు వారు. "దొందు దొందేవే" అనుకుంటారు. అయినా వారు దేవకన్యలవలె మిలమిలలాడు తున్నారు. అంతలో గుణ ఏదో చీటీ వేణుకిస్తుంది. "గులాబి

చీర కట్టిన అమ్మాయి పెద్దది. పసుపుచీర కట్టిన అమ్మాయి చిన్నది" అని అందులో వ్రాసివుంది. అది చూచి వేణు "తమ్ముడూ నీవు చేసుకునే అమ్మాయికి చెప్పుదున్నా మనసార మాటలాడుకోడానికి నోచుకుంది. నేనందుకూ నోచుకోలేదంటాడు. దేవకి "మమ్మల్ని చేసుకుంటారా?" అని అడుగుతుంది. గుణరాజ్, దేవరాజ్‌లతో చెప్పి వివరం తెలియజేస్తామని వారు బదులు చెప్తారు. గుణ, దేవకిలు, వేణు, గోపాలుడు ఒకర్ని ఒకరు చూచుకొని నవ్వుకున్నారు.

# 53

మరునాడుదయం గుణరాజ్, దేవరాజ్ - వేణు, గోపాలుడు వున్న యింటి గుమ్మంలోకి వెళ్ళారు. ఆ వీధిలోంచి సుందర్ డ్రైవరు కారేసుకువచ్చి వారిద్దరను గుర్తించి, వీళ్ళే తన సుందర్ జమీందారుదగ్గర లక్షరూపాయలు కాజేసి, పక్కా పల్లెటూర్ది దాన్ని సుందర్‌కు అంటగట్టారు. చిక్కారు దొంగలు అని ఆ యింటి నంబరు, పేట పేరు నోట్ చేసుకొని వెళ్ళిపోతాడు.

డ్రైవరు చెప్పిన మాటలు విని "నిజంగా ఆ పచ్చి మోసగాళ్ళు కంటబడ్డారంటావా?" అన్నాడు సుందర్.

"అంతా అబద్ధంకాదు, అక్షరాలా నిజం! త్వరగా పోలీసుస్టేషనుకు ఫోను చేయండి" ఆతృతగా అన్నాడు డ్రైవరు.

"సరే!" అంటూ ఫోను గదిలోనికి చకచకా నడిచాడు సుందర్.

వేణూ, గోపాలురి దగ్గరకు వచ్చిన గుణరాజ్, దేవరాజ్‌లు వారిని చూచి, "పార్కులో మీరు కలుసుకున్న అమ్మాయిలు మీ మనస్సులకు నచ్చారా?" ప్రశ్నించింది గుణ.

"నచ్చారు. కాని..." అన్నాడు గోపాల్.

"ఆ సందేహ మేమిటో చెప్పండి" అన్నాడు గుణరాజ్.

"ఆ సౌందర్యవతులు మమ్ములను పెళ్ళి చేసుకుంటారా!" అన్నదే సందేహం. మాటను మార్చి పలికాడు వేణు.

"అదా! మీ సందేహం?" అన్నాడు దేవరాజ్.

"అందాల చందమామకైనా మచ్చ లేకపోలేదు. అట్లే ఆ చిన్నారి వనితలకు దేవుడు నోరు లేకుండా చేశాడు. వాళ్ళతో ముద్దుగా మాట్లాడాలని తలంచాం! కాని వారు మూగవారు" అన్నాడు గోపాల్.

"అయితే మీరు పెండ్లి చేసుకోరన్న మాట!" అన్నాడు గుణరాజ్.

"అని కాదు, యిద్దరూ మూగవారనేదే మా ధర్మ సందేహం" అని అంటాడు వేణు.

"మీరే ఒకానొక జన్మలో మూగవాళ్ళుగా జన్మించి మీరు ప్రేమించిన చిన్నదే మాటామంతీ అన్నీ మాట్లాడ గలిగినదైతే మిమ్ము పెండ్లాడడానికి యిష్టపడుతుందా, చెప్పండి" అంటాడు దేవరాజ్.

వారి మాటలకు విస్తుపోయిన వేణూ, గోపాల్ మూగ వారిని చేసుకోడానికి యిష్టపడుతారు.

గుణరాజ్, దేవరాజ్‌లు వారితో చెప్పవలసిన సంగతులు చెప్పి వెళ్ళిపోతారు.

వేణూ, గోపాల్‌లు విలువగల్గిన సూటు, బూటు ధరించారు. కళ్లజోళ్లు పెట్టుకున్నారు. జమీందార్ బిడ్డలవలె వెలిగిపోతున్నారు. గుణరాజ్, దేవరాజ్‌ల గుణవిశేషాలను గూర్చి ముచ్చటించుకుంటూ వుంటారు.

# 54

తలుపు తట్టినశబ్దం వినిపించింది. వేణు వెళ్ళి తలుపు గడి తప్పించాడు. తలుపులు నెట్టుకుంటూ ఎవరో వచ్చారు. వారిని చూచిన వేణు గుండె బ్రద్దలైపోయింది. క్షణ కాలంలో వేణూ, గోపాలుర చేతులకు బేడీలు తగిలించబడ్డాయి. లాక్కుపోతున్న పోలీసు బృందాన్ని పలుకరించడానికి వారికి నోళ్ళు రాలేదు. అసలు సంగతి అంతుపట్టని వారి మనసులు కలతచెందాయి.

పోలీసు స్టేషనుకు తీసుకురాబడ్డ ఆ నూతన వ్యక్తులను యిన్‌స్పెక్టరు యీ విధంగా ప్రశ్నించాడు!

"ఏ వూరునుండి వచ్చారు మీరు?"

"పల్లెటూరు నుండి పనికోసం యీ పట్నం వచ్చాం" అని సమాధాన మిచ్చాడు వేణు.

"అయితే, సుందర్ జమీందార్ దగ్గర యెంత డబ్బు కాజేశారో చెప్పండి. లేకుంటే జైలుపాలు కావాల్సివస్తుంది. నిజం చెప్పండి" అని గర్జించాడు యిన్‌స్పెక్టరు.

"అసలు సుందర్ జమీందార్ యెవరో మాకు తెలియదు. అసలు విషయం మాకు అర్థం కావటంలేదు. అన్యాయంగా మమ్మల్ని బంధించటం మీకు న్యాయంకాదండీ" అన్నాడు జాలిగా వేణు.

"మీకు తెలియదా, తెలిపిస్తానువుండు. మీ కీ విధంగా అడిగితే చెప్పరు. మీకు తగిన శాస్తి చేస్తేనేగాని మీనుండి జవాబు రాదు" కోపంగా అన్నాడు యిన్‌స్పెక్టరు.

"ఇనస్పెక్టరుగారూ! మీరూపొరబడుతున్నారు. అన్యాయంగా మమ్మల్ని బాధించుట మీకు భావ్యంకాదు" అన్నాడు వేణు.

ఇన్‌స్పెక్టరు సుందర్‌కు ఫోనుచేస్తాడు. సుందర్ – "దొంగలు చిక్కారు. వారికి తగినట్లుగా బుద్ధి చెప్పించాలి. వారిని జైలుపాలు చేయాలి" అనుకుంటూ వుత్సాహపూరితుడై స్టేషన్‌కు వస్తాడు.

"ఎక్కడా మోసగాళ్ళు! చూపించండి యిన్‌స్పెక్టరు గారూ!" అంటాడు సుందర్.

"మీ యెదురుగా నిలబడ్డవారే నిన్ను మోసంచేసిన దొంగలు" అన్నాడు యినస్పెక్టరు.

వేణూ, గోపాలురను చూసి, సుందర్ ఆశ్చర్యపోతాడు. "ఇనస్పెక్టర్‌గారూ! వీరు కాదు నన్ను మోసపుచ్చింది. నాలాగే మీరూ మోసపోయారన్నమాట" అన్నాడు సుందర్.

ఇనస్పెక్టర్ విస్తుపోయాడు. వారిని పట్టితెచ్చిన పోలీసులను తిట్టాడు. వేణూ, గోపాలుర దగ్గర క్షమాపణ వేడుకొని వారిని విడిచిపెట్టాడు.

సుందర్ డ్రైవరును పట్టుకొని నాలుగిచ్చి "డామిట్! ఎవర్నో చూచి బొంబాయివాలాస్ అని పట్టిచ్చావ్. బ్లడీ బగర్, యిప్పుడైనా సరిగ్గా ప్రవర్తించు" అంటాడు.

డ్రైవరు చేసేదిలేక మౌనంగా తలవంచుకొని వెళ్ళి పోతాడు.

# 55

గదిలోని వాలుకుర్చీలో వాలిపోయి దీర్ఘాలోచనలో నిమగ్నమైయున్న ఆ లతాంగి లేతచిగురులాంటి మనస్సు పరిపరివిధాల పోతోంది. అంతలో "నమస్తే అక్కగారూ" అన్న మాటలు ఆమె చెవిలో పడ్డాయి. ఎవరైందీ తెలిసికోకుండానే "నమస్తే" అంటూ వచ్చిన వ్యక్తికేసి దృష్టి సారించి "ఓహో! రా!... రా..." అని చిరునగవు చిందిస్తూ వచ్చిన వ్యక్తిని ప్రక్కనే కూర్చోబెట్టుకుంది.

"అక్కా! యీ జన్మలో నీ మేలు మరచి జీవించాలంటే నా తరంగాదు. నీ ఆదరాభిమానములకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు" అని ఆ వచ్చినవ్యక్తి పలికింది.

"చెల్లీ! అపాయాన్ని తప్పుకోవాలంటే ఉపాయమే ఉపయోగపడుతుంది. కాని అంతకన్నా అన్యమార్గాలు మృగ్యం! ఆఁ... యింతకీ విషయాలేమిటో విన్నవిస్తానంటావా?" అంది బెట్టుగా.

"నీ దగ్గర దాపరికమా!" ఆశ్చర్యంగా పలికింది ఆ నూతన వ్యక్తి.

"దాస్తావనికాదు. సుందర్ గారు నిన్ను ఎలా చూస్తున్నారో చెప్పమని, అంతే ..." అంది నవ్వుతూ గుణ.

సుందర్ను తనేవిధంగా బాధిస్తాండో ఆ కథాసంగ్రహమంతా విప్పి చెప్పింది పద్మ. ఇద్దరూ నవ్వుకున్నారు.

"అక్కా, ఆస్తి నా పేరవుంది. పేదవారికి ఏదైనా ఉపకారం చేయాలని తలంచాను. అందుకు చివరిగా నీ సలహా తీసికొని ఆ విధంగా చేయాలని వచ్చాను. ఏంచేస్తే బావుంటుందో సెలవియ్యి" అంది పద్మ.

"చెల్లీ! పదిమందీ నిన్ను మంచిగా తలంచాలంటే పేదపిల్లలకు ఒక మంచి పాఠశాల కట్టించు. వారికి ఉచితంగా విద్యాబోధన చేసే మార్గం చూడు. పేదపిల్లలకు విద్యాభిక్ష పెట్టుము. దానధర్మాలు చేయి" అని వినయంగా పలికింది గుణ.

గుణ యిచ్చిన సలహాను అంగీకరించి పద్మ పట్టరాని సంతోషంతో వెళ్లిపోయింది.

ఇంటికి వచ్చిన రాణి మేనేజరుకు ఫోను చేస్తుంది. మేనేజరు అక్కడకు వస్తాడు. మేనేజరును చూచి రాణి, "మేనేజర్! మీతో అత్యవసరమైన పనివుండి పిలిచాను" అంది కొంచెం కట్టిగా.

"ఏమిటో చెప్పండి" అంటాడు తలగోకుతూ మేనేజర్.

"వెంటనే పేదవారి పిల్లల నిమిత్తం ఓ పాఠశాల కట్టించాలి. వారు చదువుకొనుటకు కావలసిన సమపాయాలు కల్పించాలి. ఆ పాఠశాలకు మన జమిందార్ గారి పేరు పెట్టాలి.

ఆఁ...ఆ పాఠశాల భవన నిర్మాణం నిమిత్తం రు 50 వేలు గ్రాంటు చేస్తున్నాను. క్యాష్‌బుక్కు పట్టుకురండి సంతకం చేస్తాను" అని సగర్వంగా పలికింది రాణి.

"చిత్తం, అలాగే చేద్దాం! జమీందార్‌గారితో కూడా మనవిచేసి, మరీ చేద్దాం" అని వణుకుతున్న పెదిమలు కదిలించాడు మేనేజరు.

"వారితో చెప్పవలసినంత అగత్యం ఏమీ లేదు. ఆ స్త్రీమీద అధికారం నాది. మీకు తెలియదు కాబోలు. ఊఁ... చెప్పినట్లు చేయండి" అని అంది గడుసుగా రాణి.

"చిత్తం!"అంటూ మేనేజరు వెళ్లిపోయాడు.

విషయం తెలుసుకున్న సుందర్ మండి పడుతూ రాణి దగ్గరకు వస్తాడు. కాని రాణి అమృత చూడ్కులకు సుందర్ హృదయం చల్లబడిపోతుంది.

"రాణీ! నీ ప్రవర్తనేమీ బాగుండలేదు. నీ యిష్టమొచ్చినట్లు డబ్బు తగలేస్తున్నావు" అనలేక అన్నాడు, పెడమొగం పెట్టిన సుందర్.

రాణి సుందర్‌వద్దకు వచ్చి చేతులుపట్టుకొని దగ్గరకు తీసుకుంటుంది. అంతకుముందే చల్లబడిన శరీరం ఆమె శరీర స్పర్శతో కొంచెం వేడెక్కింది.

"ఏమండీ! ఇంగ్లీషుడ్యాన్సు చేద్దాం రండి" అంటుంది.

"ఇదివరకొక పర్యాయం నాకవి యిష్టంలేదని చెప్పాను. ఇంకా యెన్నిసార్లు చెప్పాలి" విసుగ్గా అన్నాడు.

ఇలావుండగా ఆ పట్టణంలోని తారాచంద్‌గారి అబ్బాయి పుట్టినరోజు ఇన్విటేషన్ వస్తుంది.

రాణి అది తీసుకెళ్ళి సుందర్‌కు చూపెట్టి, "యీ పుట్టిన రోజు విందుకైనా మనిద్దరం కలిసి వెళ్ళాలి" అంటూ అతనిపై వాలిపోయింది.

"పతివ్రతా శిరోమణి పద్మను పాదాలతో తన్ని తరిమి కొట్టి, ఆ పరమసాధ్విని నానాబాధలకు గురిచేశాను. అగ్ని సాక్షిగా పెండ్లాడిన ఆ అభాగ్యురాలి జీవితాన్ని నాశనం చేశాను. పేదదని ఆ సుగుణశాలిని యింటినుంచి బయట కీడ్చాను. పాదాలుపట్టి ప్రాధేయపడినా లెక్కించక ఆమెను గెంటినందుకు ప్రతిఫలం యిది. పరదేశిపిల్ల రాణి నా ప్రాణం తీస్తోంది. ఈ పీడ వదిలిపోయే మార్గంలేదు. నేనెంత పాపిని" అని లోలోన తలచుకుంటూ కన్నీరుకార్చాడు సుందర్.

# 56

రాణి, రాజు జమీందార్ యింటికి వచ్చింది. అన్ని సంగతులూ మాట్లాడి, సేట్ తారాచంద్‌గారి అబ్బాయి పుట్టినరోజు విందునుగూర్చి చెప్తూవుంది. ఆ ఆహ్వానం వారికికూడా అందిందని గుణ చెప్తూవుంది. అక్కడ ఎట్లా ప్రవర్తించాలో రాణికి గుణ నేర్పుతుంది.

రాణి రాజు జమీందార్‌కన్నా ముందుగా వెళ్తోంది. రాజుకు కోపం వచ్చింది. మండిపోయాడు. గుణ, దేవకిలను సమీపించి ఉగ్రుడై కొండంతగా పెరిగిపోయాడు.

తండ్రి రూపం గాంచిన వారికి ప్రాణాలు పోయినంత పనైంది.

"ఆ వచ్చిన మూర్ఖుడెవరు ? ఎన్నాళ్ళుగా నా కన్ను గప్పి యీ కపటనాటకం ఆడుతున్నారు ? నా ముందే యింత ఘోరం చేస్తున్నారా ? మీ కెంత మదమెక్కింది. ఛీ ... నాకు మీరు ..." అని ఏమో అనబోతాడు రాజు.

అంతలో గుణ దేవకిలు ఫక్కున నవ్వుతారు. ఆ నవ్వు రాజును మరింత ముక్కోపిని చేసింది.

"సిగ్గు లేక యింకా నవ్వుతున్నారా !" అని రాజు గర్జించాడు.

"నాన్నగారూ ! వచ్చింది పురుషుడు కాదు. మనింటిలో వుండిపోయిన పద్మ. సుందర్ భార్య !" అంది గుణ.

ఆ మాటలువిన్న రాజు ఆశ్చర్యపోయాడు. ఇంకా అతనికి అనుమానం తీరిపోలేదు.

గుణ జరిగినకథంతా చెప్పి రాజు అనుమానాన్ని తీర్చింది.

"ఆమెను చూచి పురుషు డనుకున్నాను. చాల పొరబడ్డాను" అని నవ్వుతూ పలికాడు రాజు.

అందరూ జరిగిన సంఘటన గురించి నవ్వుకుంటారు.

గుణ, దేవకిలు యిన్నాళ్ళుగా చేస్తున్న పనులన్నీ తండ్రికి వివరంగా విప్పి చెప్తారు. వారు ప్రేమించిన వేణూ, గోపాలుర గూర్చి, వారి పేదతనాన్ని గురించీ తెలియజేస్తారు. అందుకు రాజు పరమానందభరితు డౌతాడు. తండ్రిని తీసుకొని పురుషుల వేషంలోనే వేణూ, గోపాలుర దగ్గరకు వెళ్ళాలని ప్రయాణమయ్యారు.

# 57

గుణరాజ్, దేవరాజ్‌లు చేసిన మోసాన్ని గూర్చి అన్నా - తమ్ముళ్లు ఆశ్చర్యపోతారు.

"తమ్ముడూ, వీళ్ళు మనల్ని కనికరించడంలేదు. మనల్ని అడ్డుపెట్టుకొని డబ్బును సంపాదించే రౌడీలు. మనకు మూగవాళ్లను అంటగట్టి వాళ్ల దగ్గర డబ్బు కాజేయాలని చూస్తున్నారు. వీరు వచ్చినరోజులు. పెళ్ళిఆశపెట్టి మనల్ని మోసం చేస్తున్నారు. సుందర్ జమీందార్ దగ్గర లక్ష రూపాయలు కాజేసి మనవూరు ప్రక్క గ్రామాన్నుంచి పట్టి తెచ్చిన పద్మను అంటకట్టి ఆమె జీవితం నాశనం చేశారు. వీళ్ళను నమ్మకూడదు. వెళ్దాం పద!" అంటాడు వేణు.

"అన్నయ్యా! నీవు చెప్పింది అక్షరాలా నిజం. వాళ్ళు నిజంగా దొంగలే! మనతో వాళ్ళు కలిసినప్పుడే నాకీ ఆలోచన వచ్చింది కాని నీతో అనలేక పోయాను" అంటాడు గోపాల్.

వారు బట్టలు మూటగట్టుకొని పారిపోవడానికి ప్రయాణ మయ్యారు.

అంతలో ఎప్పటివలె గుణరాజ్, దేవరాజ్ వారి తండ్రి రాజు వారికి ప్రత్యక్షమౌతారు.

వేణు, గోపాలురు వారిని చూచి మండిపడతారు. పలుకకుండా పోబోతారు. కాని గుణరాజ్ అడ్డుపడతాడు.

"మాకు అడ్డురాకు. నీ కపటవేషం మాకు తెలుసు. మీ టక్కులమారి మోసాలు మాదగ్గరకాదు. మీరంత మోసగాళ్ళు అనుకుంటే మీతో స్నేహం చేసేవాళ్ళమే కాదు" అని కోపంగా అనేశాడు వేణు.

ఆ మాటలు విని రాజుకు ఆశ్చర్యం, ఆవేశం, కోపం అతని హృదయంలో పెనవేసుకుపోయాయి. గుణరాజ్, దేవ రాజులు ముఖాలు తేలవేసి చూస్తున్నారు.

"వేణూ! నీమాటలు మాకు అర్థంకావడంలేదు. అసలు విషయమేమిటి?" అని ప్రశ్నించాడు గుణరాజ్.

"మీకు మా మాటలు అర్థంకావులెండి! ఎవర్ని యేవిధంగా మోసంచేయాలో మీకు బాగా తెలుసు. పల్లెటూరివాళ్ళులే, వీళ్ళ కేమితెలుసు అని తలంచావేమో! పట్నంలో యెలాంటి టక్కుటమారులు; పగటివేషగాళ్ళు, పక్కా కేడీలు వుంటారో యిప్పుడు మేము బాగా తెలుసుకో గలిగాము. మీ దొంగనాటకాలు చాలించి మమ్ములను వెళ్ళనియ్యండి" అని మరింత ఆవేశంతో అన్నాడు వేణు.

రాజు మరింత ఉగ్రుడయ్యాడు. కాని ఏమీ అనలేక మౌనం వహించాడు.

"వేణూ, కొంచెం జాగ్రత్తగా మాట్లాడు. అంతా డొంక తిరుగుడు వ్యవహారంగా మాట్లాడతావేమి? అసలు జరిగిందేమిటో వివరించవయ్యా! అధిక ప్రసంగాలు యెందుకు కాని"అన్నాడు కొంటెగా గుణరాజ్.

"ఎంత సంగనాచులండీ! మీకు ఏమీ యెరుగని అభాగ్యులవలె యెంతగా నటన చేస్తున్నారు. సుందర్ జమీందార్

దగ్గర లక్ష రూపాయలు కాజేసి పల్లెటూరి పిల్లను తెచ్చి అతనికి అంటగట్టి తుదకు ఆమె జీవితాన్ని సర్వనాశనం చేసింది మీరు కదా! చివరికి మాకు మాగపిల్లల్ని అంటకట్టి వారి తల్లి దండ్రుల దగ్గర కూడా డబ్బు గుంజాలని యెత్తువేసిన పచ్చి మోసగాళ్లు మీరుకదా ?" అన్నాడు వేణు.

"ఇంకానయం! జైలులో పెట్టకుండా, మాకు తెలియకన్నంత మాత్రాన పోలీసులు వదిలేశారు. లేకుంటే మేము జైలు కెళ్లేవారమేగదా! మీ పేర్లు, మీ గుట్టు బయటపెట్టకుండా మరీ తప్పుకున్నాం! మీకు, మీ స్నేహానికి వేయి దండాలు. మమ్మల్ని పోనియ్యండి. మా వూరుపోయి కష్టపడి పనిచేసుకొని బ్రతుకుతాము" అన్నాడు గోపాల్.

"మీరు పొరబడుతున్నారు. మీ రనుకున్నంత చెడ్డ వారముకాదు" అన్నాడు దేవరాజ్.

"చేసిన పొరపాటుతనానికి సిగ్గుపడి, మా దారిని మేము పోతున్నాం!" అన్నాడు గోపాల్.

"మా మాట విని వాళ్ళను పెండ్లి చేసుకోండి. మీకు మాంచి కట్నం వస్తుంది. హాయిగా సుఖించవచ్చు" కొంటెగా అన్నాడు గుణరాజ్.

"కట్నాల కాశించి కళ్యాణాలు చేసుకునే బాపతు వారలం కాదు. కష్టపడి బ్రతికి జీవించగలం. తిండికోసం, ఆస్తికోసం ఆశించి మానాభిమానాలు లేని వనితలను చేసుకోవడం మా చేతకాని పని. మీలాగా పైకి జమీందారులవలె వుండి లోలోపల జేబులుకొట్టే వ్యాపారం మాదికాదు" అని ఆవేశంతో అన్నాడు వేణు.

ఆ మాటలు విన్న రాజు జమీందార్ ఆపాదమస్తకం క్రోధాగ్నితో రగులుకుపోయింది; కాని కొంచెం శాంతించాడు.

"వేణూ! నిజంగా నీవు మా నిజాయితీని తెలుసుకుంటే నీవే పశ్చాత్తాపపడవలసి వస్తుందిసుమా!" అని అదోరకంగా అన్నాడు గుణరాజ్.

"పశ్చాత్తాపంకాదు, పారిపోవాల్సివస్తుంది" గంభీరంగా పలికాడు వేణు.

"అబ్బాయిలూ, అసలు వాళ్ళెవరో మీకు బాగా తెలుసా?" అని ప్రశ్నించాడు రాజు.

"ఎవరని అడుగుతారే! పట్టపగలు వేషాలువేసి ప్రజల్ని మోసగించే మోసగాళ్ళు" అన్నాడు వేణు.

"అవును నీవన్నదీ నిజమే. వాళ్ళు నిజంగానే యిప్పుడు వేషాలు వేశారు కాని ఎవర్నీ మోసం చేయడానికి కాదు. మోసంచేసే దుర్మార్గులకు బుద్ధి చెప్పడానికి, అష్టకష్టాలు పడుతున్న అభాగ్యులను ఆదుకోడానికి అంతే..." అన్నాడు రాజు.

"కప్పిపుచ్చకండి, వారి కపటనాటకాలు. మీకు అర్థంకాదు గాబోలు. మిమ్మల్ని కూడా ఒకసారి పోలీసులు పట్టుకెళ్తేగాని వీళ్ల సంగతి మీకు తెలియదు" అన్నాడు గోపాల్.

వేణు పోలీసులు పట్టుకెళ్ళి ఏమిచేశారో అదంతా వివరంగా చెప్పిన పిదప "అంత అన్యాయం చేసేవాళ్ళంకాదు వేణూ" అంటూ వారి నిజస్వరూపాలు చూపెట్టుతారు. గుణ, దేవకిలను చూచి వేణు, గోపాలురు ఆశ్చర్యచకితులౌతారు.

"నేనూ, మాచెల్లి ఎంతో గారాబంగా తండ్రిచాటున పెరిగినవారం. మాతల్లి చిన్నప్పుడే మరణించింది. మేము పేదవారినే పెండ్లి చేసుకోవాలని నిర్ణయించుకొన్నాం. చదువు కునే రోజుల్లోకూడా పేదవారినే చేసుకుంటానని నా స్నేహితులతో ప్రతిజ్ఞ చేశాను. సుందర్ మమ్మల్ని అవమానపరచ యత్నంచేస్తుంటే అతనికి ఓ పేదపిల్లను అంటకట్టాలని తలంచి యీ విధంగా చేశాం" అని గుణ సంగతులన్నీ సావధానంగా వేణు, గోపాలురకు విన్నవించింది. ఆ మాటలువిన్న అన్నా - తమ్ముడు ఆనందపడతారు.

వేణూ, గోపాలురు గుణ, దేవకిలను క్షమాపణ వేడుకో బోయారు. కాని, గుణదేవకిలు వారిని నివారించారు. రాజు జమీందార్ తన కుమార్తెలు చేసిన ఘనకార్యానికి సంతసించాడు.

అందరూ కలిసి రాజు జమీందార్ భవనానికి చేరుకుంటారు.

# 58

అది తారాచంద్‌గారి భవనం. బంధుమిత్ర సపరివారంతో ఆ భవనం కళకళలాడిపోతోంది. రాణి బలవంతంచేత సుందర్‌కూడా అక్కడికి రాక తప్పిందికాదు. రాణి ఇంగ్లండ్ ఆచారం చొప్పున సూటు బూటు తొడిగి మగవానిరూపంలో అక్కడికి వచ్చింది. గుణదేవకిలు అంతకుముందే వచ్చారు.

ఆడవారంతా పసిపాపను వుూయలలో పరుండబెట్టి తిలకందిద్ది జోలపాటలు పాడుతుంటారు. రాణికూడా అక్కడికి వచ్చి ఆడవారిని నెట్టుకుంటూ వుూయలలోని పసిపాపను సమీపించి ముద్దుపెట్టుకుంటుంది. అక్కడున్న ఆడవారు ఆమె పురుషుడని భావించి ప్రక్కకు తప్పుకొని "ఏమండీ! కాస్త ఆడవాళ్ళున్నారు అనే భావం లేకుండానే నెట్టుకుంటూ వస్తారేమిటి" అంటారు.

రాణి ఒకామెను సమీపించి ఆమె జాకెట్టును తాకుతూ "ఆహా! నీ జాకెట్టు అతి అందంగా వుంది" అంటుంది.

ఆమె రాణిని పురుషుడుగా భావించి తత్తరపోతుంది.

రాణి మరియొక స్త్రీ చేతులుపట్టుకొని గాజుల సౌందర్యాన్ని వర్ణించుతుంది.

# 59

మరునాడు రాణి అందంగా అలంకరించుకుని సుందర్ ప్రక్కనే కూర్చుని అతని తల దువ్వుతుంది. ఆమెను చూచిన సుందర్ అసహ్యించుకుంటాడు. కాని ఆమె శరీరస్పర్శకు అతని మనస్సు మంచులా కరిగి పోతుంది.

"ఏమండీ! అలా షికారు వెళ్దాం రండి" అని అప్యాయంగా అడుగుతుంది.

"రాణీ! నీవు భారత దేశ ఆచారప్రకారం చీర, జాకెట్టు ధరించి నొసటను తిలకం దిద్దుకుని నా మాటప్రకారం ప్రవ

_ర్తిస్తే నీవెంట వస్తాను. లేకుంటే నీవు నా భార్యవూ కాదు. నేను నీ భర్తనూ కాను. నీ యిష్టప్రకారం వర్తించు" అంటాడు.

"ఏమండీ! మా దేశ ఆచారాలు మరచిపోవడం నా చేతకాని పని" అంటుంది జెస్సీగా.

"అయితే నీ యిష్టమొచ్చినట్లే నడుచుకో! నాతో మాట్లాడకు. నీ ముఖం చూడరాదు. ఛీ... ఛీ... నా బ్రతుకు నాశనం చేసిన దుర్మార్గురాలా! నా కన్నులముందినుంచి వెళ్ళిపో" కోపంగా అంటాడు.

"వెళ్లమనే వాడివి నన్నెందుకు పెళ్ళిచేసుకున్నావు? నా జీవితం నాశనం చేయాలనుకున్నావా? సరే! వెళ్తాను నీ యిష్టమొచ్చినట్లే వుండిపో" అని రాణి లేచి పెట్టెలోని బట్టలు దేరుతుంది.

"రాణి, వారి ఫ్యాక్టరీలను దర్శించడానికి వచ్చుట గమనించిన ఫ్యాక్టరీ మేనేజరు ఆమెకు యెదురువచ్చి నమస్కారం చేసి ఆమెను తోడ్కొని వెళ్తాడు. ఫ్యాక్టరీ ఆఫీసు ఉద్యోగులంతా రాణిరాకను చూచి లేచి వినయ విధేయతలతో వందనాలు చేస్తారు. రాణి ప్రతివందనాలు చేస్తూ అందర్నీ పరిశీలిస్తూ సాగిపోతుంది. మేనేజర్ రాణికి అందర్నీ పరిచయం చేస్తుంటాడు. డిపార్టుమెంటులన్నీ తిరిగి కార్మికుల కష్టసుఖాలన్నీ గమనిస్తుంది. మేనేజర్ రాణిని స్పెషల్ రూముకు తోడ్కొని పోయి ఫ్యాక్టరీ విశేషాలు సవినయంగా విన్నవిస్తాడు. రాణి తలాడించుతూ ఊకొడుతుంది. అంతలో మేనేజరుకు ఏదో గుర్తుకొచ్చింది.

"ఏమండీ! తమకు తెలిసే వచ్చారనుకుంటాను. కార్మికులు బోనసు యివ్వాలని రెండు సంవత్సరాలుగా గొడవ చేస్తున్నారు. అది నేటికి మరింత ప్రబలమై పోయింది. కార్మికులలో ఆందోళన బయలుదేరింది. రేపో మాపో కార్మికులంతా సమ్మెచేయాలని సిద్ధమౌతున్నారు. ఈ సంఘటన నిమిత్తం అన్ని మిల్లుల డైరెక్టర్లు ఒక మీటింగు యేర్పాటు చేశారు. ఆ సమావేశము యింకా పది నిమిషాలలో జరుగబోతోంది. దయచేసి తమరు కూడా యీ సమావేశంలో పాల్గొనాలి" అని వినయంగా విన్నవించాడు మేనేజరు.

అందుకు రాణి తన అంగీకారాన్ని తెలుపుతుంది. మేనేజర్ తనలో మెదులుతున్న దుష్టాలోచనల్ని రాణికి విన్నవించబోయాడు. కాని రాణి లేచి బయటకువచ్చి కార్మికుల జీవితాల్నిగూర్చి ఆలోచిస్తూ అలా సాగిపోయింది.

మీటింగుహాలు మిల్లు డైరక్టర్లతో కళకళ లాడిపోతుంది. రాణి, మేనేజరుకూడా మీటింగులో పాల్గొంటారు. మేనేజర్ రాణిని అక్కడున్న డైరెక్టర్లందరికి పరిచయం చేస్తాడు. ప్రథమాంశంగా బోనసు విషయం చర్చకు వస్తుంది. అందరూ ఏకకంఠంగా కార్మికులకు బోనసులుయివ్వడం అధర్మం అంటారు. రాణి మాత్రం వారి తీర్పును ఆమోదించదు. కార్మికులకు కూలిపెంచినా, బోనసులు పంచిపెట్టినా కంపెనీలు నష్టానికి గురి అవుతాయి. అందువల్ల కార్మికుల కూలీ, బోనసు విషయాలలోగాని యింక యెలాంటి మార్పులు చేయరాదని డైరక్టర్ల తుది తీర్మానం జరుగుతుంది. ఆ తీర్మానం యిష్టం లేక రాణి మీటింగులోంచి లేచి తన ఫ్యాక్టరీ ఆఫీసుకు వస్తుంది. మేనేజరు కంగారుపడుతూ ఆమె వెంట లేచివస్తాడు.

"మేనేజరుగారూ! కార్మికులకు బోనసులు యివ్వక పోవడానికి కారణమేమిటో చెప్పగలరా?" అని ప్రశ్నించింది ఘాటుగా రాణి.

"కార్మికులకు బోనసులు గనక యిస్తే వాళ్లు మన తలలమీదకెక్కి తైతక్క లాడతారు. మన ఫ్యాక్టరీ లాభం తోనే సాగుతోందనుకోండి. ప్రస్తుతానికి లాభాలు పడిపోయా యని చెప్పి వారికి బోనసులు ఎగనాం బెట్టాలి. మనం గనుక యిస్తే తక్కిన మిల్లుల వాళ్ళంతా చచ్చినట్లు యివ్వాలి. అందుకే అందరూ ఐకమత్యంతో యీ గూడుపుఠాణి చేశారు" అని చేతులు నలుపుకుంటూ మనవిచేశాడు మేనేజర్.

"అలా వీలులేదు. న్యాయమైన కార్మికుల కోర్కెలు నెరవేర్చి వారికి బోనసులు పంచిపెట్టండి" అంది రాణి.

"ఏమండీ! సరిగ్గా తమకు యీ విషయాలు అవగా హనం కాలేదనుకుంటాను. కార్మికులకు బోనసు లివ్వడం అన్యాయమండీ" అన్నాడు కొంచెం గట్టిగా మేనేజరు.

"అయితే వారి కూలినైనా పెంచండి" అంది రాణి.

"అలా వీలులేదండి" గొణిగాడు మేనేజరు.

"ఈ మేనేజరు నరరూపరాక్షసిలా వున్నాడు. ఫ్యాక్టరీ లాభంలోనేవుందంటూ శ్రమజీవులకు న్యాయంగాయివ్వవలసిన బోనసు యివ్వరాదంటాడు. కార్మికుల కష్టార్జితం గడిస్తూ వారి కష్టంతో వచ్చిన లాభంలో వారికి భాగం పంచరాదం టాడు. అన్నిటికీ యితడే మూలకారకుడు. ఇతన్ని డిస్మిస్ చేస్తే గాని యితని రోగం కుదరదు" అని లోలోన తలంచుకుంది రాణి.

"ఏమండీ ! మేనేజరుగారూ ! మీ మనస్సేవిధంగా పని చేస్తుందో పరీక్షించాను. మీ మూలంగా మా ఫ్యాక్టరీ లాభాలు గడించింది. మీ మేనేజిమెంటు వల్లనే మా ఫ్యాక్టరీ అభివృద్ధి చెందుతుంది. అందుకు నాకు చాలా సంతోషం. అందుచేత యీ నెలనుండి మీకు యింకో ఐదువందలు యింక్రిమెంటు చేస్తున్నాను." అని చమత్కారంగా పలికింది రాణి.

ఆ మాటలు విని మేనేజరు పుప్పొంగిపోతాడు. తనకు కలిగిన ఘనతనుగూర్చి తనలో తాను మురిసిపోతాడు.

# 60

మరునాడుదయం మేనేజరుకన్నా ముందుగానే రాణి ఫ్యాక్టరీకి వస్తుంది. ఆఫీసులో కూర్చుని మేనేజరుకోసం యెదురు చూస్తుంది. మేనేజరు రానే వచ్చాడు. రాణిని చూచి "గుడ్ మార్నింగ్" అంటూ చిరునవ్వుతో రాణి దగ్గరకెళ్ళి కుర్చీలో కూర్చోబోతుండగా, రాణి ఓ పేపరు అతని చేతికిస్తుంది. అది పూర్తిగా చదువకుండానే మేనేజరు వణకిపోతాడు కంటిలో నెత్తురు చుక్కంటూ లేదు. అతను గాబరాపడ్డాడు. అతని ముఖం నల్ల కావురుతో నిండిపోయింది. అతని గుండె అతి వేగంతో కొట్టుకోసాగింది.

"ఈ నోటీసు నాకేనా ?" అన్నాడు తడబడుతూ మేనేజరు.

"అవును..." నొక్కి చెప్పింది రాణి.

"ఏమండీ! నేనేమి చేశానని నాకు డిస్మిస్ నోటీసు యిచ్చారు. నిన్ననే గదాండి రు 500 లు యింక్రిమెంటు శాంక్షను చేసింది" జాలిగా పలికాడు మేనేజరు.

"మీరు మా ఫ్యాక్టరీలో మేనేజరుగా వుండతగరు. రాత్రిపగలనక కాయకష్టంచేసి వారి సర్వశక్తుల్ని ధారబోసి మనకు లాభాలు సంపాదించిపెట్టే కార్మికులకు న్యాయరీతిగా కూలి పెంచడంగాని, బోనసు లివ్వడంగాని యేర్పాటు చేయడానికి వీలులేదంటారు. మీకు రు 500 లు యింక్రిమెంటు శాంక్షనుచేస్తే సంతోషిస్తారు. పేదలపొట్టలు కొట్టటం తెలుసుగాని, వారిని సంతోషపెట్టటం తెలియదు. కార్మికుల కష్టసుఖాలు గమనించని మేనేజరు యెందుకు? జీతం పెంచితే నీకు ఎంత సంతోషం కలిగిందో, అలాగే కార్మికులకు న్యాయం చేకూర్చి ఆనందపరచడం మంచిదికాదనే నీవు మాకు అవసరం లేదు" అంటుంది ఆవేశంతో రాణి.

ఆ మాటలు విన్న మేనేజరు తను జేసిన తప్పును క్షమించమని రాణిని ప్రాధేయపడి అడుగుతాడు. ఇక ఎన్నడూ యిటువంటి పొరపాటు చేయనంటాడు. జాలిహృదయం గల్గిన రాణి అతన్ని క్షమిస్తూ, కార్మికులకు యివ్వవలసిన బోనసులు మన అన్ని ఫ్యాక్టరీల పనివారికి పంచిపెట్టి, న్యాయంగా వారికి కూలి పెంపుదల చేయమంటుంది.

మేనేజరు రాణి ఆజ్ఞ ప్రకారం కార్మికులకు రెండేళ్ల బోనసు యివ్వడానికి నోటీసు జారీ చేస్తాడు.

సుందర్ ఫ్యాక్టరీ కార్మికులకు బోనసు యివ్వ నిర్ణయించారని తెలుసుకున్న మిగతా ఫ్యాక్టరీల డైరెక్టర్లు ఒక్కుమ్మడిగా సుందర్ యింటిమీద దాడిచేస్తారు.

సుందర్ డైరక్టర్లు రావడం చూచి ఆశ్చర్యపోతూ వారిని ఆహ్వానిస్తాడు.

"సుందర్ గారూ! మా ఫ్యాక్టరీలు మూసుకోవాలిందేనా ?" ప్రశ్నించాడు ఒక డైరెక్టరు.

"అంత పనేం వచ్చింది" మెల్లగా అన్నాడు సుందర్.

"వచ్చింది కాబట్టే కాళ్లీడ్చుకుంటూ మీ దగ్గరకు వచ్చాం. మీ మిల్లు కార్మికులకు బోనసులు యివ్వడానికి అంగీకరించి మీ మేనేజరు ప్రకటన చేశాడట. మా కార్మికులు కూడా బోనసులు యివ్వమని గొడవచేస్తున్నారు" అని లెక్చర్ కొట్టాడు మరొక డైరెక్టరు.

"అందుకు నేను చేసేదేమీ లేదు. నా ఆస్థినంతా నా భార్యకు యేనాడో దత్తం చేశాను. ఆ విషయం ఆమెతోనే ముచ్చటించండి. నాకు మాత్రం బోనసులు యివ్వడం యిష్టం లేదని వేరే చెప్పాలా ?" అన్నాడు సుందర్.

ఆమాటలు విన్న డైరక్టర్లు రాణి దగ్గరకు వచ్చి వెనుకా ముందూ చూడకుండా బోనసులు యివ్వడం ఆపు చేయమంటారు.

రాణి వారి మాటలు అంగీకరించదు. మనకు లాభాలు గడించి కష్టపడేవారికి బోనసులు ఎందుకు యివ్వగూడదు, యిస్తాం అంటుంది. డైరక్టర్లు చేసేదిలేక చిన్నబోయిన ముఖాలతో తిరుగుముఖంపట్టారు.

సుందర్, తన బంగాళాలో ఏకాంతంగా సోఫాలో కూర్చుంటాడు." "ఆస్థినంతా భార్య పేర పెట్టి దాని పాదదాసుడనైతి. ఛీ...ఛీ...నా బ్రతుకు పాడుగాను. ఇంగ్లండ్ దేశస్థు

రాలు ధనవంతురాలు, అందగత్తె అని ఆశించి రాణిని వివాహం మాడినందుకు తగినట్లు బుద్ధిచెప్పింది. పాపం! అశుభమూ శుభమూ తెలియని అభాగ్యురాలు పద్మ, పవిత్రహృదయము గల్గిన పరమసాధ్వి. పతివ్రతా శిరోమణి. అందాలబొమ్మ. పేదింటి పల్లెటూరి పిల్లని దూషించి. యింటినుంచి తన్ని తరిమి తిని. పాదదాసిగా బ్రతుకుతానని ప్రాధేయపడిన ఆమె మాటలు చెవిని బెట్టక, జుట్టుపట్టుకొని బయటకు యీడ్చేసి. నేనెంత దుర్మార్గుడను. అయ్యయ్యో! బంగారంలాంటి నా పద్మను చేతులారా వదులుకొంటిగదా" అని లోలోన కన్నీరు మున్నీరుగా ఏడుస్తాడు సుందర్.

ఆక్షణంలో ఎవరో వచ్చినట్లుంటుంది. సుందర్ తలెత్తి చూచి "పద్మా వచ్చావా?" అని లేవబోతాడు. వెనుక నుండి ఎవరో వచ్చి అతన్ని వెనక్కి లాగినట్లుంటుంది. వెనక్కి చూస్తాడు "ఛీ...నీముఖం చూపకు" కోపంగా అని, రాణీకేసి చూస్తాడు.

పద్మ విచారవదనంతో "ఏమండీ! అలా క్షీణించి పోయారు. మీ మనసు దుఃఖపడుతున్నట్లుంది. మీ ముఖం వాడిపోయిందేమీ? అవును అంతా తెలిసింది. అంతా యీ మాయలమారి రాణివల్ల నేకదా! ఏమే నంగనాచీ, నాభర్తను పీడించకపోతే యింకెవరినయినా పీడించకపోయావ్. ఆడజన్మకు కళంకం తెచ్చావుగదే" అంటుంది.

రాణి అహ...హా...హా...అని నవ్వుతూ "ఏమే! పద్మా! భర్తగారికి శ్రీరంగనీతులు బోధిస్తూ, నన్ను యెత్తి పొడుస్తున్నావు. నీ వొక్కదానికేకాదు భర్త, నాకూ భర్తేనే!

నీవు నాలాంటి ఓ స్త్రీవేకదా! నిన్ను పెండ్లాడి పేదదానివని తెలిసినంతమాత్రాన తన్ని తరిమి నానాబాధలకు గురిచేశాడే సిగ్గులేద్దు నీకూ. ఇంకా భర్తగారిపై ప్రేమ వొలకబోస్తు న్నావా? మగవాని మాటలు బూటకాలని తెలిసికున్నదానిని గనుక, ముందుగనే ఆస్తి నా పేర రిజిష్టరు చేయించుకున్నాను. నేను మాయలమారిని కాను. రంకులాడిని కాను. సుందరే స్త్రీ లోలుడు" అంటుంది ఘాటుగా.

"అలా అనకు. భారత స్త్రీ ధర్మమేమంటే భర్త యెట్టివాడైనా, భార్య భర్తకు దాసురాలై వుండాలి. కాని నీలాగ భర్తను తిరస్కరించి, పతి పరువుమర్యాదలు తీసి తనను తలెత్తుకోకుండా చేయుట భావ్యంకాదు" అని, పద్మ భర్తకేసి చూస్తూ "ఏమండీ! మీరు యీ పీడ వదిలించుకునే మార్గం ఆలోచించండి. లెండి...త్వరగా మీ జీవితం చక్కబెట్టు కోండి" అంటుంది జాలిగా.

"ఏమి పలుకుతావే వగలాడీ! మా దేశంలో స్త్రీ, పురుషులు సమాన ధర్మాలతో వర్తిస్తారు...ఇక్కడ పురుషు నికే అన్ని సౌఖ్యాలు. స్త్రీకి వంటగది, పడకగది తప్ప మరేమీ ప్రాప్తంలేదు" అంటూ భర్తకేసి చూచి, "సుందర్ కమాన్, రాకెన్‌రోలు డ్యాన్సు చేద్దాం" అంటుంది.

"ఛీ...నా భర్తను పిలువకే పాపీ" అంటుంది, పద్మ.

"ఎవరే నీ భర్త. యెప్పుడో నీకు విడాకులిచ్చాడు. ఇప్పుడు నా భర్త" అని రాణి ఎగతాళి చేస్తుంది.

క్షణం పాటులో ఏమీ లేదు. రాణి, పద్మలు మాయు మయ్యారు. సుందర్ వారి స్వరూపాలను చూచి విస్తు

పోయాడు. అది అంతా అతని ఊహ! రాణి, పద్మల సంభాషణ మనస్సులో తలంచుకుంటూ తల పట్టుకొని సుందర్ సోఫాలో వాలిపోతాడు.

# 61

"సుందర్ బాబుగారూ !" అన్న శబ్దం సుందర్ చెవిని బడింది. విచారంగా వున్న సుందర్ ప్రక్కగా, చూచి ఆ పిలచిన వ్యక్తిని రమ్మని తలాడించాడు.

ఆ వ్యక్తిని చూచి జమీందార్ "ఏం ! సుబ్బన్నా వచ్చావ్ ?" ప్రశ్నించాడు.

"గుణ, దేవకీలు యీ వుత్తరం మీకిమ్మని పంపారు బాబూ" తల గోక్కుంటూ తెచ్చిన వుత్తరాన్ని సుందర్ చేతికి యిచ్చాడు.

సుందర్ వుత్తరాన్ని తెరచి చూస్తాడు. అతనిలో ఆశ్చర్యం, ఆవేదన, విచారం ఒక్కుమ్మడిగా జనించాయి. ఆతృతగా ఆ వుత్తరాన్ని చదువ నారంభించాడు.

క్షే మ ము లు .

ప్రియాతి ప్రియమైన, సోదరతుల్యుడైన సుందర్ జమీందార్ దివ్యసముఖమునకు అనేక నమస్కారములు గావించి వ్రాయు లేఖ !

అన్నయ్యా ! మీరంటె మాకు చాలా అభిమానము. కాని, అసూయ అన్న దే మీపై మాకు లేదు. మిమ్ము మేము

ఒక సోదరునిగా భావించుకున్నాము. కాని, మీరు మమ్మల్ని ప్రేమించి పెండ్లిచేసుకోవాలని తలంచారు. అంతేగాక, ప్రయత్నంకూడా చేశారు. అందుకు మేము అంగీకరించలేదు. కారణమేమన, మేము హైస్కూల్లో చదువుకునే రోజుల్లో ఒక సందర్భంలో మా తోటి విద్యార్థినులతో మేము పేద వారినే పాణిగ్రహణము చేసుకుంటామని ప్రతిజ్ఞ చేశాం. ప్రతిజ్ఞకు భంగం సంభవించుట మేము సహించని విషయం. అందువలన మీ అభిలాషను తిరస్కరించినాము. మీరే పేదవారై యుంటే తప్పక కల్యాణం చేసుకునేవారం. అందుకే నీకు "పతియే దైవము"ని పూజించు పరమసాధ్విని, పేద కుటుంబమున జన్మించిన పద్మను పెండ్లిచేసియున్నాం. అటువంటి పతివ్రతా స్త్రీరత్నాన్ని పేద పిల్లని, పుష్పాన్ని వాసనచూచి నలిపి పారేసినట్లు పాదాలతో నలిపి, యిష్టమొచ్చినట్లు తన్ని యింటినుండి తరిమి, ఇంగ్లండ్ స్త్రీయైన రాణిని పాణిగ్రహణం చేసుకొని, ఆస్తినంతా ఆమెచేతి కప్పగించి ఆమె చేతిలో కీలు బొమ్మగా మారిపోయారు. అంతేకాదు, ఆమె పాదసేవకులుగా మారారనుటకూడ అతిశయోక్తికాదేమో? ఇప్పుడు మీరు సుఖాన్ని అనుభవిస్తున్నారో లేక బాధపడుతున్నారో మాకంటె మీకే బాగా తెలిసివుంటుంది. ఈ విషయాన్ని తలచుకొని మేము చాలా దుఃఖిస్తున్నాం. మీ ప్రథమ భార్యారత్నం పద్మ మీరు వదిలిపెట్టినప్పటినుండీ మా దగ్గరే వుంటూంది. ఆమె మిము తలంచుకొని మనోవేదనతో కుమిలి పోతూంది ఇప్పటికైనా మించినది లేదు. మీకు యిష్టమైతే పద్మను తీసికొని వెళ్ళవచ్చు. పద్మ మీరాకకోసం వేయి కళ్ళతో యెదురుచూస్తూంది.

అదీగాక, మా ప్రతిజ్ఞానుసారం సోదరులైన మీవ వారిని మేము ప్రేమించి పెళ్లి చేసుకోబోతున్నాం. చివరిగా మిమ్మల్ని కోరేదేమన మీ చేతులతోనే మా పెండ్లి జరపవల నని ఆశించి మిమ్ములను ప్రార్థించమనీ అడుగుతున్నాం.

ఇందు మా దోషములున్న క్షమించి, మమ్మల్ని చెల్లెళ్ళుగా భావించి, మా కోరిక నెరవేర్చగలరని మనఃపూర్వకముగా నమ్ముతున్నాం. నమస్తే!

ఇట్లు,
మీ చెల్లెళ్ళు,
గుణ - దేవకి.

# 62

ఉత్తరం చదవడం పూర్తయింది. సుందర్ కళ్లు గిరగిరా తిరిగాయి. అతనిలో ఆశ్చర్యం ఆత్రుతలు చిగురించాయి. అతని కనులనుండి ఆనందబాష్పాలు రాలాయి. ఉప్పొంగిపోయే హృదయంతో అక్కడనుండి లేచాడు. వణుకుచున్న కాళ్లతో వేగంగా నడక సాగించాడు.

ఆరోజు రాజు జమీందార్ భవనం నూతన అలంకారాలతో నవ్యతేజస్సుతో కళకళలాడిపోతూంది.

"పద్మా!...పద్మా..." అంటూ వీధిలోంచి కేకలు వినిపించాయి.

ఆ కేకలు విని, రాజు జమీందార్, పద్మ, గుణ, దేవకీలు వింతపడి గది కిటికీలోంచి వీధిలోకి దృష్టి మలుపుతారు. వారి మనస్సులలో ఆనంద దయాభావాలు కలిగాయి.

"పద్మా!...పద్మా..."అన్న పిలుపులతో పరుగిడుతూ వస్తున్న వ్యక్తి, రాజు భవనాన్ని సమీపించాడు.

ఆ దృశ్యం చూచిన పద్మ ఆగలేక, ఆనందబాష్పాలు కళ్ళ వెంట కారుస్తూ మేడమెట్లు దిగి క్రిందకు వస్తుంది. చకచకా వెళ్ళి గుమ్మంలో కాలు పెట్టిన భర్త పాదాలపై పడుతుంది. ఆమె పవిత్రమైన కన్నీటితో పతిపాదాలు కడుగుతుంది. అతని పాదములను హృదయమునకు హత్తుకుని పూజించి హృదయ జ్యోతి వెలిగించి హారతి నిస్తుంది.

కనులార పద్మ పాతివ్రత్యాని గుర్తించిన సుందర్ మరింత సంబరపడి "పద్మా! నేను నీకు మహాఘోరం చేశాను. నా హృదయం కల్మషంతో కపుడుగట్టింది. నేను క్రూరుడను. నా పాదస్పర్శకు నీ ముఖపద్మం వాడిపోయింది. నీ శరీరం మలిన మైంది. నన్ను క్షమించు. ఇక నిన్ను యెన్నడూ యెడ బాయను."దీనంగా పలికి, ఆమె భుజాలు పట్టుకుని లేవనెత్తాడు.

పవిటకొంగుతో పద్మ నయనములనుండి యేకధారలై కారుచున్న కన్నీటిని తుడుచుకుంటూ, ఒక్కసారిగా సుందర్‌ను కౌగలించుకుంటుంది పద్మ.

పొరలుచున్న దుఃఖాన్ని అణచుకొనుచు సుందర్ ఆమెను ఓదార్చుతాడు.

ఆ విచిత్ర సంఘటన చూస్తున్న రాజూ, గుణ, దేవకిలు వేణు, గోపాలురు వారిని సమీపిస్తారు.

సుందర్, అతని భుజాలపై వాలిపోయిన పద్మను ప్రక్కకు దీసికొని, గుణ, దేవకిలను చూచి మరింత చింతిస్తాడు.

"చెల్లెళ్ళతో తుల్యులైన మిమ్ము చేయరాని దుష్ట కార్యాలు చేసి మీ హృదయాలను నొప్పించాను. అనరాని

మాటలతో మీ మనసులను బాధించాను. అనేక పన్నాగాలు పన్ని పవిత్రమైన మీ శీలాన్ని భంగపరచాలని ప్రయత్నించాను. తుదకు మిమ్ములను చంపాలనికూడా యత్నించి విఫలుడ నయ్యాను. క్రూరహింసకు పాల్పడ్డ నాపై మీరు కరుణను ప్రసారించి రక్షించారు. సోదరీమణులారా! నన్ను క్షమించండి" అని కన్నీరు కారుస్తూ సుందర్, గుణ, దేవకీల పాదాలపై పడబోతాడు. కాని గుణ, దేవకీలు అతన్ని పట్టుకుని ఓదారుస్తారు.

"మీ మేలు వేయిజన్మలకైనా మరువలేను చెల్లెళ్లూ! మీరు నా ఆప్తమిత్రులు. అంతేగాదు, నా హృదయ పరివర్తనకు కారకులు" దీనంగా అన్నాడు సుందర్.

రాజు జమీందార్ అంతా విని ఆశ్చర్యపడతాడు.

వేణూ, గోపాలురు పోలీస్ స్టేషనులో సుందర్‌ను చూచిన విషయం జ్ఞాపకం తెచ్చుకుని విస్తుపోతారు.

పద్మ తన భర్త పరివర్తనకు వుత్సాహపడుతుంది.

"చెల్లెళ్లూ! మీరు ప్రేమించిన యువకులు వీరేనా?" వేణూ, గోపాలురను చూపించి సంతోష హృదయంతో సుందర్ ప్రశ్నించాడు.

'అవును' అన్నట్లు విచ్చిన గులాబిరేకుల్లాంటి పెదవులు విరిసి, సన్నజాజిలాంటి చిన్నారి నవ్వులు చిందిస్తూ, మల్లె మొగ్గల్లాంటి బుగ్గలు సిగ్గునొంద, చామంతి పువ్వులాంటి వారి ముఖాలను వయ్యారంగా వంచుకున్నారు.

వారి వాలకం గమనించిన సుందర్ ఆనందపడి, గుణ చేతిని వేణు చేతికి, దేవకి చేతిని గోపాల్ చేతికి కలుపుతాడు.

ఇదంతా గమనిస్తున్న రాజు, పద్మ చేయి పుచ్చుకుని సుందర్ చేతిలో పెట్టుతాడు. అందరి హృదయాలూ తామరపూవుల్లా వికసించి సంతసించాయి.

అందరూ 'అలంకార్ విలాస్' అని పేరు కల్గిన రాజు విశ్రాంతి భవనంలోని సోఫాలు అలంకరించారు. ఆ భవనంలో వున్న పద్మ, గుణ, దేవకిలు మేరుపర్వత గుహాలలో విహరింప వచ్చిన దేవకన్యలా, అన్నట్లు మిరుమిట్లు గొలుపుతున్నారు. అందరి ముఖాల్లో ఆనందరేఖలు వుదయించాయి. గుణ లేచి నిలబడి "సోదరతుల్యులైన సుందర్‌గారూ! ఒక్క విషయం మీకు గుర్తుకు తెస్తాను కోపగించరుగదా?" పరిమళమైన మనస్సుతో ప్రశ్నించింది.

"చెల్లీ! గుణా! యెన్నటికీ నీపైన అలుక నాకు కలుగదని దైవసాక్షిగా చెప్తున్నా. నీ నీతి వాక్యములను విని బుద్ధి తెచ్చుకుంటాను" వినయంగా అన్నాడు సుందర్.

"వినండి అన్నగారూ! ప్రప్రథమంగా పురుష వేషాల్లో వచ్చి మీ దగ్గర లక్షరూపాయలు పుచ్చుకుంది యీ గుణదేవకిలే!" అని చిరునవ్వుతో గుణ పలికింది. ఆ మాటలు విన్న సుందర్ విస్తుపోతూ గ్రుడ్లప్పగించాడు.

"గాభరాపడకండి సుందర్‌గారూ! ఆ లక్షరూపాయలు గైకొని పేదరాలు పద్మను నీకు వివాహం చేసింది యీ గుణ దేవకిలే! పద్మ గుట్టు బట్టబయలై మీరు యింటినుండి వెళ్ళగొట్టిన తరువాత, ఆమెకు ఇంగ్లండ్ రాణిగా వేషం మార్చి, ముదుసలి ఇంగ్లండ్ దొరగా నేను నటించి, ఆ స్తిఅంతా పద్మపేర పెట్టించి, నీకు ఆ మెను రిజిష్టరుమారేజి చేయించింది కూడా

యీా గుణ, దేవకిలే! ఆమెను నీ యాజ్ఞలను ఉల్లంఘించవని చెప్పి అట్లు నటింపజేసింది యీా గుణ, దేవకిలే!

"నా భర్తమాటలు నే నేవిధంగా జవదాటి నాటకం కట్టుకునేది అక్కా! అట్లుచేయడం నా చేతగాని పని" అని పద్మ మాకు విన్నవించితే, "అట్లా చేస్తే నే నీ భర్త నీకు దక్కుతాడు" అని చెప్పి పద్మను ఒప్పించింది యీా గుణ, దేవకిలే. ఇకమీాదట మీాపు యీా పద్మ పేదరాలని తలిస్తే నా ఆస్తి నీకు కట్నంగా యిస్తాను. మీా ఆస్తి రాణిపేర వీలునామా వ్రాసిన పత్రాలు, మీా దగ్గర తీసుకొనిన లక్ష రూపాయలు నా దగ్గర భద్రపరచబడివున్నాయి" అంటూ తనదగ్గర దాచినపత్రాలు తీసి చూపిస్తుంది గుణ.

ఆ మాటలు విన్న సుందర్ అమితానంద పడతాడు. "గుణా! నాకున్న ఆస్తి చాలు. కట్నాలకు - కానుకలకు ఆశించి పుచ్చుకునే కాలం పోయింది. నాకు బుద్ధి వచ్చింది. ఆస్తి - అంతస్తులకు స్థానం లేదు. గుణగణాలు గల్గిన గుణవతి పేదరాలైనా ఆమె గుణగణాలే సకల సంపదలు. అపకారికి మహోపకారం చేసే మీావంటి బుద్ధిమంతులు చిరకాలం భారత భూమిపై వసించి దేశంలో జరిగే కుట్రలు, కుయుక్తులు నశింపజేసి మేలు చేకూర్చునట్లు దేవుడు మిమ్ము చిరంజీవుల చేయుగాక! అమ్మా గుణా! యికమీాదట పద్మను ఇంగ్లాండు రాణిగా చేసి నన్ను బాధించవద్దు" అని నవ్వుముఖం పెట్టాడు.

"అయిందేదో అయిపోయింది. గతజలసేతుబంధనం యెందు కన్నగారూ. ఇక మీా రిరువురూ భార్యాభర్తలై సుఖించడమే మా అభిలాష" చిరునవ్వుతో పలికింది గుణ.

"అమ్మా, గుణా! ధనవంతులు, దరిద్రులు అను భేదాలు వినాశం కావాలంటే, మీ లాంటి నీతినిజాయితీపరులు దేశంలో కోకొల్లలుగా వుద్భవించాలి. ఆనాడే భారత దేశం ముందంజ వేయగలదు" అని గుణ, దేవకిలను దీవించాడు సుందర్.

పద్మ తల్లి అక్కమ్మా, వేణూ, గోపాలుర తల్లి లక్ష్మమ్మా జరిగిన కథంతా విని ఆనందపడతారు.

రామయ్యా, రాజులు, గుణ దేవకిలు చేసిన ఘనకార్యాలకు సంతసిస్తారు.

అందరూ ఆనందసంతోషాలతో కిలకిలా నవ్వుతూ కళకళ లాడిపోతారు.

అప్పుడే వుదయించిన చంద్రుని చల్లని అమృత కిరణ కాంతులు భవనంలోంచి బయటకు వస్తున్న వారందరిపై ప్రసరించి వారిని సంతోషపరవశులను చేశాయి.

శు భ ం

